# ఉత్తమమనుసంభవము

రచన:

మల్లంపల్లి వీరేశ్వరశర్మ

ప్రాప్తిస్థానము :

**అజంతా బుక్ హౌస్**

బ్రాడీపేట, గుంటూరు-2.

శ్రీ శివాయగురవే నమః

# తొలిపలుకు

శ్రీ మార్కండేయ పురాణము వ్యాసభట్టారక విరచితము. ఇందుఁ బెక్కు కథలు గలవు దీనిని మారన కవీంద్రుఁడు తెనుఁగు చేసెను. ఇందలి మరుత్తరాట్చరిత్రను గవిసార్వభౌముఁడును, స్వారోచిష మను సంభవమును, గవితాపితామహుఁడును, మదాలసా చరిత్రమును నారాయణ కవియుఁ బ్రత్యేక ప్రబంధములుగా రచించిరి. ఈ రచనమునకు మారన కవీంద్రుని యనువాదమే మూలము.

ఉత్తానపాదుఁడను రాజునకు సునీతి, సురుచి యను భార్యలు గలరు. సునీతి సుతుఁడు ధ్రువుఁడు. సురుచి తనయుఁ డుత్తముఁడు. ఇతని జాయ బహుళ. ఈ పుణ్యదంపతుల యాత్మజుఁడే యుత్తను మనువు. మనువులలో నీయన తృతీయుఁడు.

ఉత్తమ దంపతు లుభయులు నుత్తమ శీలగుణ రూప యుక్తరూపులయ్యు నాయమ కాయన యనఁ గిట్టదు. ఇది వారి వివాహలగ్నమందలి దోషము. ఇది యెఱుకపడని వారి కాపుర మతి విచిత్రము. అతఁడామెనే యారాధించి యామె చిత్తముఁబడయనెంచి యనేక యత్నము లొనరించును. ఒకటియును ఫలింపదు. తుద కొకానొక వసంత మధుపానోత్సవమున రాజు స్వయముగా నందించిన మధుపాత్ర నామె విసరివేయును. అతఁడామె నడవులఁ బరిత్యజించును. సాలపోతుఁడను నాగరాజామెను మోహించును. ఆ పతివ్రత వాని నంగీకరింపదు. తన మాయాబలమున నతఁడామెను బాతాళలోకమునకుఁ గొనిపోవును. ఆ నాగరాజు కూఁతురు నంద యనునది తనతండ్రి కా రాణిని జిక్కనీయక రక్షించును. దానికిఁ గోపించిన యా పాఁపఱేఁడు తన కన్నకొమిరెను మూఁగదానినిగా శపించును,

ఇట రాజునొద్దకు వైశాలియను విప్రుఁడు వచ్చి తనభార్య నెవ్వరో యపహరించిరనియు నామెను వెదకితెచ్చి యిమ్మనియు నరపతిని యాచించును. ఆతల్లి యెల్ల వికారగుణములకునెల్ల, సకల వికటాచారములకు నాచార్య. అస్థాన విషయముల కాస్థాని. పాపము ఎన్నఁడు పతిమాట వినెడి పాపమెఱుఁగదు. అయినను దన కా భార్యయే కావలయునను విప్రునిమాటను గాదనఁజాలక రా జామెకొఱకు జగమెల్లఁ దిరుగును. అయమ కనిపింపదు. చివఱకుఁ ద్రికాలవేదియను ముని యనుగ్రహమున, బలాకుఁడను రాక్షసునొద్ద యామె యున్నటులఁ దెలిసి యతని శాసనమున నాతనికడ కేగును.

ఆ దానవుఁడు కడు విచిత్రుఁడు. వాఁడు సురాపానము సేయఁడు. మాంసభక్షణము నొల్లఁడు. నల్లఁద్రావఁడు. పరస్త్రీ గమనము వాని నిషిద్ధములలో నతి ప్రధానము. అయినను వాఁడు రాక్షసుఁడు. మానవుల కామక్రోధాది వికారములు, విఘ్నితయాగాది ఫలములును వానికి సహజాహారములు, ఆ రాజా రక్కసుని సాయమున నామె వికారములఁ బోనడచి యాయమ నామె భర్తృసన్నిధి కంపించును. రాజు త్రికాలవేది వలనఁ దమ వివాహలగ్నదోషమును నెఱింగి యతని యనుశాసనమున బలాకునంపి పాతాళమునుండి బహుళామహాదేవిని రప్పించును.

కృతజ్ఞుఁడగు విప్రుఁడు మిత్రవిందయను యాగ మహిమచే లగ్నదోషమును, సారస్వతేష్టి విశేషమున, నందకు గలిగిన శాపమును బోఁగొట్టి రాజదంపతులకు సుఖస్థితిని గలిగించును. ఆ నాగకన్యకా వరదాన విశేషమున నా యుత్తమ దంపతులకు నుత్తమ మను వావిర్భవించును. ఇది మూల కథాసారము.

రాజ దంపతులచే నిచ్చలు పూజలందు స్వాహాపీతిహోత్రులే, విప్రదంపతులుగను, రాజధర్మదీక్షయే బలాకుఁడుగను, రాణి మనోఖి

కారమే నాగరాజుగను నామె యనురాగవిశేషమే నాగరాజ్ఞిగను, నామె హృదయశుద్ధియే నాగకన్యగా నిందుఁ జిత్రితులయిరి

గేస్తునితోడి సమానస్థానము గేస్తురాలి కీ కథాసంసారమున గోచరించును. అటనటఁగల కల్పనములు కథారహస్య వివరణప్రాయములు వస్తుసమన్వయము నెఱిఁగి మూలమున నున్నది యున్నటులే రచించుట యొకమార్గము. ఆ సమన్వయమును, అందుఁదానందిన యనుభూతినిఁ గల్పనల నెపమున వివరించుట మఱియొక మార్గము. ఆ మూలముగూడ స్వోపజ్ఞమే యగుట యొక్క సూరనకే దక్కినది. ఇందుఁ గలుగు సందియముల కిందేసమన్వయములు గలవని చదువరులు గుర్తింపఁగలరని నా నమ్మిక — ఇందు నా చరితార్థతను సహృదయులగు రసజ్ఞులకే విడిచెదను.

శ్రీ నందన సంవత్సర కార్తిక పూర్ణిమనాఁడు శ్రీ విరూపాక్ష సందర్శనమునఁ బొడమిన కోరికయే యీగ్రంథరూపము నందినది. ఇది జయ, విజయ వత్సరములందే పూర్తియయ్యు నీనాటికి ముద్రణభాగ్యము నందినది. దీని నయాచితముగా ముద్రించి యిచ్చిన జూపిటరు ముద్రాగారాధిపతులు శివశ్రీ ముదిగొండ చంద్రమౌళిగారికిని వీరి సోదరులు శ్రీ విశ్వనాథముగారికి నేనెంతయు గృతజ్ఞుఁడను, శ్రీ భువనేశ్వరీ సనాథుఁడగు శ్రీ పంపా విరూపాక్షవిభుఁడు వీరికిని వీరి వంశమునకును సర్వదా, సర్వథా, సదాయురారోగ్యైశ్వర్యాభీష్టసిద్ధుల ననుగ్రహించుగావుత!

ఈ నాకావ్యమునకుఁ బమతమ యమూల్యాభిప్రాయముల నొసంగిన పెద్దలకెల్లరకు నా కృతజ్ఞతాభివందనములు.

—మ. వేంకటేశ్వరశర్మ.

# కృతిపోషకాభినందనము

శ్రీరామాధవనేత్రపంకజరజస్స్వర్గ్రాంఘ్రిసంసేవనన్
తోరంబైన తపోవిశేషమున సద్యోజాతవక్త్రంబునన్
గౌరీనాథునిచేతఁ బాశుపతదీక్షం గొన్న మౌనీంద్రుఁ డా
భారద్వాజునిగోత్ర మొప్పెడి జగత్ప్రఖ్యాతవృత్తమ్మునన్.

ఆగోత్రక్షీరాంబుధి
నాగమనిగమజ్ఞులున్ నిరాగోమూర్తుల్
భోగులు యోగులు త్యాగులు
నీరాగయశోధనుల్ జనించి రనేకుల్.

ముదిగొండ యనఁగ హిమగిరి
మదిఁ గొండొకశంక లేక మహితానేహ
స్సదను లట నగుట వారికి
ముదిగొండాన్వయపదమ్ము పుడమిని జెల్లెన్.

కాశ్మీరనృపసభా కమలాకరానంత
రత్నమౌ నుద్భటారాధ్యగురుఁడు
నిగమాగమాత్మ నిర్ణిద్రశాఖాజటా
రాశి యౌ లింగయారాధ్యమౌళి
ప్రత్యక్షశంకర ప్రథితావతారమూ
ర్ధన్యుఁ డౌ శంకరారాధ్యగురుఁడు
నిఖిలవేదాంతార్థనిష్ణాత శివపాద
శేఖరుఁడు నాగలింగబుధుఁడు

మున్నుగాఁగ మున్ను ముదిగొండవంశమ్ము
నందుఁ బుట్టువార లమరమణులు
నమరభూరుహమ్ము లమరధేనువులు న
య్యమరకరులు నెల్ల రమృతకరులు.

మా మాతామహవంశ
శ్రీ మహిమము చెప్పనేల సిద్ధమ్మది తా
నీ మహి శ్రీనాథాది మ
హామహజననైకభూమి యనుటయె చాలున్.

ఆరాధ్యమ్మగు నట్టివంశమున మల్లారాధ్యుఁ డొప్పెన్ సతీ
వారాగ్రేసర యియ్యమాంబ సతిగా, వర్ధిష్ణులై వారికిఁ
క్షీరాంభోనిధిఁ బంచదేవతరులై శ్రీశంభువక్త్రాళియై
సారాకారులు పుట్టి రేవురు సుధాసంపన్నసౌభ్రాతృలై.

శరభారాధ్యుఁడు మంత్రమూర్తిసుధియుఁ శ్లాఘ్యుండు
నాగయ్య, భా
స్వరులౌ భద్రయమల్లయల్ శివపదాబ్జాతస్పృహాభృంగముల్
గురుసేవాప్రవణాంతరంగులు యశఃకూలంకషాబ్ధుల్, నిరం
తరసంతర్పితబాంధవార్థిజనతాధన్యాత్మపుణ్యోదయుల్

కొంపల్లియాదిమాంబుజ
సంపల్లలనాలలామ సౌజన్యమహ
స్సంపన్న కనకరత్నమ
శంపామధురాంగి తనదుజాయగ నెలమిఁ.

ఘనుఁడగు శరభారాధ్యుఁడు
మనోజవసుఁ డైన చంద్రమౌళీశ్వరుఁ బా
వనుఁ డైన మల్లికార్జును
ఘనుఁడగు నవ్విశ్వనాథుఁ గనియెఁ దనయులన్

వినినంతన యీయుత్తమ
మనుసంభవకావ్యమహిమ మన మిగురింపన్
దనయంత ముద్రణమ్మిడె
మనమున నెవరీడు చంద్రమౌళీశునకున్

శ్రీమల్లనారాధ్య చిరతపఃఫలశర
    భారాధ్యు మనసు తియ్యందనమ్ము
ఆదిమాశ్రీపిచ్చయారాధ్యపుత్రిక
    కనకరత్నాంబిక కడుపుచలువ
మధురభావరసార్ద్రమధురసుబ్రహ్మణ్య
    మహితాభివృద్ధిసమాదరమ్ము
పరమశివార్చనాపరమ భారద్వాజ
    గోత్రర్షిమృదుకృపాంకూరరేఖ

చంద్రమౌళీశ ఘనఘృణాసాంద్రహృదయ
మృదులదరహాసవీక్షణామేడితమ్ము
సకలభాషాస్వరూప యీశ్వరి యొసంగు
నెల్లశుభములు చంద్రమౌళీశ్వరునకు.

శ్రీభ్రమరాంబికా స్థిరకృపామృతసంగ
దరహాసవీక్షణాదరభరములు
శ్రీమల్లికార్జున స్నిగ్ధజటాబంధ
చంద్రలేఖామృతసారఝరులు
లక్ష్మీగణపతి సంలక్షితాన్యోన్యవీ
క్షాసారమధుభావసౌరభములు
వల్లీకుమారాఽనిశోల్లాసనల్లాప
వాఙ్మాధురీఝరీపరిభవములు

భద్రకాళీశకరుణావినిద్రమధుర
వీక్షణమ్ములు పోషించు వివిధవిధుల
శరభయారాధ్యవంశ మాచంద్రతార
కమ్ము సతతమ్ము శుభముల కిమ్ము గాఁగ.

శివునిత్రిశూల మాశివునిశీర్షగతమ్మగుబిల్వపత్రమున్
భవునికురారధారయు, బినాకధనుర్ధ్వని శంఖనిస్స్వన
ప్రవిమలబందుబావ, వృషభప్రఘుగర్జయుఁ బ్రోఁచుఁగాత ని
త్యవిభవశోభనాళి శరభాన్వయసూఁన్ జిరభాన్వయమ్ముగన్.

శివకల్యాణపరంపరావిభవముల్ సేకూర్చి రక్షించుతన్
శివపాదాబ్జమరందసక్తశరభశ్రేష్ఠాన్వవాయమ్ము, ని
త్యవిరాజన్మధుపూరపూర్ణసరసీజాకారమున్ నవ్యభ
వ్యవసంతాగమనిత్యనందనమహోద్యానప్రభాస్థానమున్.

హరచూడాసుమనోవిభాసి నవచంద్రాంకూరపీయూషముల్
పరితఃపావనసర్వతోముఖ వియత్పాథఃప్రవాహౌఘముల్
చరమాశాంతరనృత్యదీశ్వర జటాసంధ్యామిధోరాగముల్
శరభారాధ్యునియన్వయమ్ము మనుచున్ సర్వప్రకారమ్ములన్,

శ్రీత్రిలింగేశ్వర స్థిరలోకచైతన్య
దానానుకంపాత్మదర్పణములు
మహితేశ్వరార్చనామధురాతిమధురాత్మ
మతి భక్తలోకసమర్పణములు
సంస్కృతాంధ్రకవీంద్ర సర్వలోకహితార్థ
తన్మహాకావ్యసంతర్పణములు
గౌతమీశ్రీసహ్యకన్యకారసమయ
సర్వజనీనవిసర్పణములు

రంజిలఁగజేయు శరభయారాధ్యమౌళి
వంశ మాసూర్యచంద్రమ్ము బహుళభోగ
భాగ్యసౌభాగ్యసంతానవైభవముల
నందనమ్ముగ బుధజనానందనముగ.

—మ. వీరేశ్వరశర్మ.

## కృతిపోషకులు



బ్రహ్మశ్రీ ముదిగొండ శరభయ్య అయ్యవారు
వారి సతీమణి కనకరత్తమ్మగారు

# విషయసూచనము

శ్రీరస్తు

# ఉత్తమ మను సంభవము

## ప్రథమ మానసము

శ్రీమత్పంపా విరూపాక్ష మూర్తయే శమితార్తయే
ఆనందైక స్వరూపాయ శివాయ గురవే నమః

శివము పురాతన ప్స్మ్రఖిలసేవ్యము సర్వజగన్నిదానమున్
నవనవమున్ సదాతన మనంతగుణమ్ము స్వతఃప్రకాశమున్
కవిజనమాత్ర లక్ష్యమును గమ్యము వాచ్యమునైన వెల్గు,మత్
వివిధవచఃప్రకారముల వేయివిధమ్ములఁ గొల్వుదీర్చుతన్. 1

వివిధములైన భాషలను వేయివిధమ్ములఁ గొల్వుదీర్చి, తా
నెవ రెడియెట్లు పల్కిన, నహీన రసధ్వనిగుంభనమ్ములన్
దవిలెనయేని, సత్కవిపదమ్మున వానిని నిల్పువాణి నా
యవిరళ భక్తిబంధుర మనోంబుజలక్ష్మి నలంకరించుతన్. 2

కేవలశాస్త్రపండితులు గేలి యొనర్తురు లక్ష్యసిద్ధిసం
భావన చాలమిన్, సుకవిపల్కుల, వారల కన్నువిప్పగన్
వావిరి నెన్నికబ్బములఁ బల్కిననేని, శుకానువాదు మే
లా! విలసద్వికస్వర కలస్వర కోకిలగాన వేళలన్. 3

క. మాజనకుని గురుమూర్తి
వ్యాజ శ్రీశైల మల్లికార్జున దేవున్
పూజించి సకలగురుజన
రాజికిఁ గయిమోడ్చి, కడు తిరమ్మగుభక్తిన్. 4

గీ. వెలయు సంస్కృతభాషఁ గవిత్రయమ్ము
వాసిగాంచిన వాల్మీకి వ్యాసుఁ గాళి
దాసుఁ దలఁపించు నీకవిత్రయమువారి
కంజలించి, త్రివిక్రము నడుగులకును. 5

## కృ తి పీ ఠి క

అలరుఁ ద్రిమూర్తులేయనఁగ నాత్రయినాఁగ, మహేశుమూఁడుక
న్నులై, యన నా కవిత్రయమునుం దలఁపించెడి, సార్వభౌముఁ బిం
గళికవి సూర్యు ముఖ్యు నెడఁ గానఁగనయ్యెడు, తిక్కయజ్వ యు
జ్జ్వలమతివోని యొక్క గుణబంధురమూర్తి రసార్ద్రవృత్తిగన్. 6

ఎవరీశారదమూర్తి యంచెఱిఁగి మే నీక్షించునాలోన నా
కవిమూర్ధన్యుని పాదపీఠికడ మార్కండేయవాణీవిభు
త్వ విశేషస్ఫుటసూచిపట్ట మటఁ గ్రిందన్ సార్వభౌముండు నాఁ
గవితానవ్యపితామహుం డనునటుల్ గన్పట్టె వర్ణావళుల్. 7

శ్రీమత్కాకతిసార్వభౌమ బలభిత్సేనాళి సేనానియౌ
ధీమంతుం డగునాగగన్నయ యశోబ్ధిన్ మారయబ్రహ్మ వా

గ్ధామం బేకశిలామనోహరము మార్కండేయ మాంధ్రీయశ
శ్రీమూలమ్ము మహార్ఘశిల్పరచనా శ్రీమన్మహాదర్శమున్. 8

అచ్చెరువంది చూడఁగ మదాలసవృత్తము నమ్మరుత్తభూ
భృచ్చరితమ్ము తత్పిత యవీక్షితుసత్కథ దేవివృత్తమున్
త్రిచ్చినరత్నవార్ణిధు లుదాత్తముచంద్రమతీచరిత్రమున్
పొచ్చెము లేనియట్టి మనువుల్ పదునల్వుర దివ్యగాథలున్. 9

వ. అందుం బ్రసన్నంబులయి చూపట్టిన 10

క. వరరత్నము లగువానన్
మరుత్తరాట్చరిత తొల్లి మారయపుత్రుం
డరుదుగొన సానయిడె నట
చిరత్నరత్నప్రభా విశేషము లొలయన్. 11

గీ. ఆంధ్రవాఙ్మయ తారాపథాంతరముల
దూరదూరాల నది యొక్కతార యగుచు
లుప్తయాశాలివాహన సప్తశతికిఁ
జెలియ కవిసార్వభౌముని సృష్టియందు. 12

తిక్కనసోమయాజులమతిన్ గడు నచ్చినయట్టి శిష్యుఁడా
తిక్కనతీర్పులన్ బదును తేఱినబుద్ధి, గురుప్రసన్నతల్
చిక్కనిపాటవమ్మును వశీకృతచిత్తము మారసత్కవిన్
దక్కున, నెందునుం గలవె, దా నొకయెఱ్ఱన లేకయున్నచో. 13

కేతన సోమయాజికవికిం గృతినిచ్చుచు శిష్యభావ వి
ఖ్యాతిఁ గడించుఁగాక గురునందలిశూరత వాని సోమునిన్
బ్రీతి వరించె నాగుణసమృద్ధులు మారయశంభుదాసులన్
బాతరపాతరల్ గురుని భవ్యకలామయ శిల్పసత్త్వముల్. 14

బిరుదులు తాల్ప నేరని కవిప్రవరుండె తిక్కమంత్రికిన్
వరసుతుఁ డౌచుఁ దిక్కకవినాథునిశిష్యత మిన్నుముట్టఁ ద
త్సురుచిరగద్యమున్ శరణుసొచ్చిన సూరిజనస్తుతుండు త
ద్గురుజనభక్తిబంధురునకున్ సరివత్తురె యెట్టి సత్కవుల్. 15

గీ. అంధ్రభారతి కాకతీయాబ్జపీఠి
విడిచి పంపావిరూపాక్షు కడకు నేఁగి
రాయ రాజ్యాబ్జినీవిహారములు సలుపఁ
దుంగభద్రాతరంగిణీభంగములుగ. 16

కవిహంసమ్ములు మిన్నుముట్టి సలిపెన్ గల్యాణగంభీరవా
క్కవితాతుంగతరంగిణీ రసబహూకారక్రియాక్రీడ లం
దు విజృంభించెను కృష్ణరాయల సభాద్యోవాహినిం జొచ్చుచో
వివిధోత్సాహము లష్టదిగ్గజములున్ విస్రంభశుంభద్గతుల్. 17

అలశ్రీనాథుని జ్యేష్ఠపుత్రుఁ డితఁడే యన్పించుకొన్నట్టివాఁ
డలఘు స్వీయమనోజ్ఞ పుష్పమృదుశయ్యం, దూగుటుయ్యాల
పలుక న్నేర్చిన యల్లసానికులసౌభాగ్యేందిరాపుత్రుఁ డు [లన్
జ్జ్వలఖంగు ల్పచరించె నీతెలుఁగులన్ స్వారోచిషోద్భూతులన్.

క. హితుఁడును జతురవచోనిధి
యతుల పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుఁడు నాంధ్రకవితా
పితామహుం డెవ్వ రీడు పేర్కొనరామిన్. 19

క. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రససమంచితకథలన్
వినవింపు కలిధ్వంసక
మనఘుఁడు తచ్చతురరచన కనుకూలముగన్. 20

గీ. ప్రాజ్యతత్కథానాయక రత్నమనుచు
నంకిత మొనర్చెఁ గృష్ణరాయలకుఁ బేర్మి
ఆ స్వారోచిని మువురుభార్యలను దలఁచి
యందు రాయలచరితమ్ము నచ్చుపడఁగ. 21

గీ. ఆ మనోరమ రాక్షసుఁ డైనతండ్రి
యేఁచ రక్షించికొన్న స్వారోచియందు
అల్ల గజపతిపుత్రి న య్యన్నపూర్ణఁ
గృష్ణరాయలుగొనుట చిత్రితము గాఁగ. 22

ఇమ్మెయి యర్థగుంభనము లెవ్వరొనర్చిరి తాన పల్లకీ
కొమ్ము ధరించి పై నెదురుకొన్నపు డేనుఁగుడిగ్గి కొల్చి, చి
త్తమ్మగుగండపెండెరము తాన పదమ్మున నలంకరించి, కై
కొమ్మని యగ్రహారములు కోరినతావుల నిచ్చుటబ్రమే. 23

పెద్దనం బోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే
పెద్దన కీఁదలంచినను బేర్మిని నాకిడు మన్నసత్కవిన్
పెద్దని గండపెండెరము పెట్టుచు నో కవితాపితామహా
ఇద్ది గ్రహింపు మీవనుట కృష్ణునకే తగు నెల్లభంగులన్. 24

క. రెండవశ్రీనాథుండు, ప్ర
చండుఁడు ధూర్జటియుఁ బారిజాతకవి మొదల్
గండరగండం డ్రిట, నె
య్యెండయి కవితాపితామహుం డగుటఁ సదే. 25

అవి యేలా తడవంగఁ బెద్దనకవీంద్రామాత్యు దౌహిత్రికిన్
ధవుఁ డం చాడుదు రల్లసూరకవి సత్యంబో, యసత్యంబొకో
మువురుం బల్కనిదాని బల్కెను గళాపూర్ణోదయంబు న్మహా
కవివిజ్ఞేయ మఖండ వాఙ్మయపరిష్కారప్రమాణమ్ముగన్. 26

ఒకతిక్కన్నను దక్కఁగా విడుచుచో నున్నారొ లేరైరొ యీ
సకలాంధ్రమ్మున సత్కళాప్రతిభమై సౌజన్యజేయుండు సూ
రకవిం బోలినవాఁడొకండును మహాప్రౌఢప్రబంధార్థద
ర్శకము న్మర్శక మామనోజ్ఞశితపీత్వాధాటిఁ బోనేర్తురే. 27

కవిలోకమ్మున కెల్ల బ్రహ్మ యొకఁడే కన్పించుఁదిక్కన్న యీ
కవిలోకమ్మున సార్వభౌముఁడొకడే కన్పట్టు శ్రీనాథుఁ డీ
కవిలోకమ్మున సూర్యుఁడొక్కరుఁడె ప్రఖ్యాతుండు సూరన్న యే
కవితల్ నచ్చెడిఁ దత్ప్రసిద్ధకవితాగంగాచతుర్దంతికిన్. 28

మఱువన్ శక్యమె వానిఁ గన్నడపురీమాధ్యందినబ్రధ్నునిన్
సరసానేకమహాప్రబంధకవితా సాహిత్య సామ్రాజ్య పు
ష్కర కేళీవిధియానహంసమును దుర్గర్వాంధవిద్వ త్తిర
స్కరణప్రౌఢ కటాక్షతీక్ష్ణరుచి మాంగళ్యాంధ్ర భర్మధ్వజున్.

వ. అని బహుముఖభావనా పరంపరాయత్తం బగుచిత్తంబున నుదయించిన మధురస్మృతివిశేషంబున శ్రీఁబుట్టి సుధా మధుద్రవముతోఁ జెల్వొందుపుష్పంబు శోభాతారుణ్య మెలర్పఁగా ముడుచు పంపాహేమకూటాశ్రయ ఖ్యాతం బగు శ్రీమద్విరూపాక్ష బ్రహ్మంబు దవుదవ్వుల సాక్షాత్క రించుటలు దోఁచినట్టులయిన దదీయదివ్యసందర్శన కుతూ హలవిశేషంబునం డగ్గఱగాఁ జవిచని సౌజన్యజేయ సమ ర్పిత పద్యసుమనోమాలా పరిమళంబులు గుబాళించు నాహృదయవిభు సన్నిధిం జేరి కొలిచి యుదయదరుణకిరణ ప్రచార సబ్రహ్మచారు లగు నాస్వామి తేజఃప్రసారంబులు బహుళార్థ స్మృతిబోధకంబు లయిపరిఢవిల్లుటయుం, దద్భా వనా వశంబున నజ్ఞాతేతరవిషయుండనై యెంతతడవుంటినో కాని తుద కొకానొక మధురగంభీరధ్వని శ్రవణసుభగం బుగా వీతెంచినం, బులకితాంగుఁడనై యద్భుత రసా క్రాంతహృదయంబున నద్దెస దృష్టిసారించుటయు. 30

క. సాక్షాత్కరించె నొకముని
తత్త్వజ్ఞునిరూపాంతరంబు సఖులాగమటే

కాక్షర మృదుహాసమ్ములు
చక్షుఃఫలదములు సాంద్రచంద్రిక లోలయన్. 31

క. ఆపోలికవా రందు వి
రూపాక్షులు చంద్రశేఖరుక్రియాశక్తుల్
దీపించిరి మును లంతట
నౌపనిషత్కాహారచారి హార్యక్షమ్ముల్. 32

క. చండీశ పటుహాసఖ పటు
డిండిమనిస్స్వనము దుగ్ధడిండీరఘటా
ఖండ మృదుహాస నిచయము
నిండిన యొకవింత వెలుఁగు నెలకొనియె నటన్. 33

క. సర్వజ్ఞప్రథితము వా
గ్గుర్వాణకృతి సోమయాజిగురు వీరరసా
ఖర్వరచనోజ్జ్వలం బా
యుర్విని నొకమూర్తి వింతయొఱపులు దిద్దెన్. 34

క. పటువిక్రమార్కచరిత
స్ఫుట రచనాప్రాభవమ్ము పొడవందెనొ నా
నట నొక్కవెలుఁగు ప్రతిభా
చటులమ్మాస్వామియెదురఁ జక్కన నిలిచెన్. 35

క. జైమినిభారతరచనా
శ్రీముగ్ధము కాళిదాస శివపదసేవా

కామమ్మ భారతీమతి
ధామ మ్మయ్యెడల నొక్క దామము మెఱసెన్. 36

క. ఆదిమవరాహదంష్ట్రా
శ్రీదయితాకృతిని నొఱసి చెలఁగెఁ బ్రబోధ
ప్రాదుర్భవసమయేందు
స్వాదూదయ మొలఁచు వింతజంట మెఱపులన్. 37

క. ఆముక్తమాల్యదాప్రా
ధామలసౌరభము లెందు నలమికొనఁగ ను
ద్దామ మగునొక్క ధామం
బామహి నెఱరాచఱికము లంతట నించెన్. 38

క. కోమల శిరీషకుసుమ
శ్రీమృదులము పద్మసురభి స్నిగ్ధరసధునీ
ధామ మగుమూర్తి యొక్కం
డామహి తనపెద్దఱికము లలరించెఁ గడున్. 39

క. నవపారిజాతవికసన
భవపరిమళహారి నెఱసి పర్వఁగ నొకమూ
ర్తి విశేష మచట మెఱసెన్
యువతిప్రణయార్ద్ర మతిసముజ్జ్వలగతులన్. 40

క. అటఁ దోఁచె వెలుఁగు ధూర్జటి
జటాపటలచరణ చారుచంద్రాంకుర మై

స్ఫుటదక్షిణ కైలాసో
త్కట లీలామధుర కావ్య గంభీరంబై. 41

క. వర రాజ శేఖర విలా
సరసోజ్జ్వలమూర్తి యొకఁడు సాక్షాత్కృతిగా
వర రామాభ్యుదయ కథా
దర మగునొకమూర్తి నయనతర్పణ మయ్యెన్. 42

క. సరసార్థ బోధ హేలా
పరిష్కరణ శారదాప్రభా రుచిరపద
స్ఫురిత మయి పాండురంగా
భరణ మ్మొక వెలుఁగు నేత్రపర్వ మొనర్చెన్. 43

క. సౌజన్యజేయమయి బుధ
పూజితకవనపరిభావపూర్ణం బయి వి
భ్రాజికళాపూర్ణోదయ
తేజిత మొకదీప్తి యచట తీర్పులు దిద్దెన్. 44

క. సాహిత్యగానవైభవ
దోహల కోలాహలప్రతుష్టము శ్లేష
శ్రీహరి వసుపద మ్మయి
యూహాతిగమైన మూర్తి యొక్కఁడు దోఁచెన్. 45

క. కవికర్ణరసాయనమై
నవనవ గళమధురిమమ్ము నాట్యముచేయన్

వివిధకళాప్రతిభ మ్మొం
దు వెలింగె నొకండు కవనదోహలమూర్తిన్ 46

వ. అంతట 47

క. సంగమనృపతులు సాళువ
వంగడమునవారు తుళువవంశమువారల్
సంగతిని దుంగభద్రా
భంగతరంగమ్ము లగుచు బలసి కొలువఁగన్. 48

## శ్రీనాథప్రవేశము

ఉ మఱియనేకనృపులు కవులు మంత్రివర్యులున్ బుధుల్
త్సా పెఱసి మెఱసి యందు నొక్క పెద్దకొలువుదీర్చి యం
హా దఱు సముత్సుకులయి యెదురు దారు లెన్ను వేళలన్
ము దఱుచు వినఁగనయ్యె మధుర దర్ప జయజయధ్వనుల్.

వ. ఆ సమయంబున 50

సీ. ఇతఁడె పో శ్రీహర్షకృతిని దీర్పులుదిద్ది
తెనుఁగుల కిచ్చిన దేవగురుఁడు
విద్యాపరీక్షణ వివిధదేశాయాత
బుధనికష మ్మాంధ్రబుధుఁ డితండె
వేమభూమీపాలు విద్యాధికారియై
విబుధుల కూళ్లు నిప్పించె నితఁడె

పలనాటివీరుల బహుళగాథాకథల్
 పాడిన పటు దేశభక్తి యితఁడె
ఇతఁడె దక్షిణకాశికా ధీశభీమ
విభుని పేరోలగమ్మున వెలయుసుకవి
తెనుఁగునాఁడెల్ల స్వపద ముద్రితముగాఁగఁ
బూత మొనరించు విఖ్యాతపుణ్యరాశి. 51

సీ. ఇట్టింత లింకించె నితఁడె పో డిండిమ
 కవిసార్వభౌము వాగ్గగనలహరి
దీనారటంకాల తీర్థమాడిన వాణి
 పురుషరూప విశేషభూమి యితఁడె
దక్షిణోత్తరకాశికాక్షేత్రమహిమమ్ము
 పండించినట్టి జీవనది యితఁడె
సకలాంధ్రదేశ యశస్సారధవళిమల్
 కుదురైన ముత్యాల గొడుగితండె
పూర్ణపురుషుండు కవిలోక ముఖ్యగురుఁడు
త్యాగి భోగియు జ్ఞాని యుత్తముఁడు నీశ్వ
రార్చనాశశాశీలుఁ డత్యలఘుగుణుఁడు
నితని కెవ్వరు సరియౌదు రేయుగమున. 52

క. ఇటు సార్వభౌమువిచ్చే
యుట తెలిపెడుకొన్నిపలుకు లాదవినయటులై

యటు గాంచునెడలఁ గన్నుల
పటుపుణ్యము పండి యెదురువచ్చు వడువునన్. 53

బ్రాహ్మీదత్తవరప్రసాదము నురుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతము నీశ్వరార్చనకళాశీలమ్ము నభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధాన మవు సౌభాగ్యంబు దీపింపఁగన్. 54

సీ. ఒకట నన్నయమంత్రి యొకట వీరారెడ్డి
యంతంత నొఱసి యేకాంతమాడ
మామిడిసింగన్న వేమభూమీపతి
మంతనం బటు కొంతకొంత సేయ
సర్వజ్ఞనరపతి సహజపాండిత్యంబు
నొయ్యొయ్యఁ దనుఁ జేరి యుబుసుపోవ
అవచి తిప్పయసెట్టి యల్ల విస్సనమంత్రి
యయ్యైవిశేషంబు లరసి తెలుప
రాయరాహుత్తుఁడు తెనుంగురాయఁ డెదుర
నరిగి సందడి వడి బరాబరులుసలుప
కఱదు లెఱిఁగిన తనముద్దుమఱఁది దుగ్గ
నకవి పలుకుల మెచ్చెడి నగవు లొలయ. 55

గీ. సార్వభౌముఁడు కుకవీంద్రగర్వతిమిర
భీష్మ మధ్యందినార్క గంభీరమూర్తి

ప్రౌఢ రాకేందు గమన విభ్రాజిగతుల
సహజసౌరభలహరులు చౌకళింప. 56

వ. శ్రీవిరూపాక్ష భక్తివిశేష వినతగాత్రంబున నా నాసకల
విద్యాసనాథుం డచ్చటకు నల్లనల్లన విచ్చేయునెడల 57

సీ. పంపావిరూపాక్ష బహుజటాజూటికా
చంద్రికాద్యుతి వక్క స్వాగతమ్ము
ప్రౌఢవిద్యారణ్య భవ్యహాసజ్యోతి
బహుముఖాశీస్సులు పరిఢవించె
తుంగభద్రానదీ శృంగారవీచి వై
భక్తిమై బెద్దన పాద్యమిడియె
వినత డిండిమమహావిద్వన్ముఖాంభోజ
వికసన మ్మర్ఘ్యభూమిక వహించె
నొకట నాచనసోమన యొదిగియొదిగి
చూపు లనియెడి సాంబ్రాణిధూప మిడియె
ఎలమి కలుములు వెలుఁగ శ్రీకృష్ణదేవ
రాయ లొసఁగెను దివ్యనీరాజనంబు. 58

గీ. అచటఁ జేరినకవిచక్రి మలరుకనుల
కువలయమ్ములు కాన్కలు గూర్చె నందుఁ
జూపు చూపున సూరనసుకవిచంద్రుఁ
డతని కర్పించె నేకబిల్వార్చనంబు. 59

వ. ఆ కవివరుండు నవ్విరూపాక్షవిభునకుం జాఁగిలి మ్రొక్కి— 60

గీ. ఉచితరీతుల నెల్లర నుపచరించి
వ్యాస వాల్మీకి కాళిదాసాదికవుల
నాకవిత్రయిఁ దలఁచి భీమాంబసుతుఁడు
వారికోరికఁ బెనుగద్దెపయి వసించె. 61

వ. అవ్విశేషంబున 62

క. సాక్షాత్తుగ శ్రీనాథుం
డాక్షేత్రమున న్వసించు, నభవు, శివు విరూ
పాక్షుని సేవించుటకై
యక్షర మాకొలువు మనసు హత్తుకొనంగా. 63

వ. భయభక్తివినయ సంభ్రమాశ్చర్యభర వినతాంగుఁడనై దాక్షారామ ప్రోద్ధేందుబింబాననా కటాక్ష కువలయ మాలికా నిత్యవికసనోల్లాస కారణం బగు భీమేశ్వరేశ్వర శిరోలలిత కుమారచంద్రము స్సుకుమారాకృతి యాఁకూడిన సకలకవి తారకాలోక సభా నభోంగణమ్మున రాకానిశాకరు నుద్దిమై శ్రీమద్విరూపాక్ష రూపాంతర మ్మగు నమ్మహామహున కేను జాఁగిలి మ్రొక్కి, యశేషసారస్వత పరిషచ్చక్రంబునకుం గేలు మొగిడ్చి, తన కట్టెదుర నించుక తొలంగి నిలిచిన, నన్నత్యాదరంబునఁ జేరం బిలిచి యొకించుక దలంచి పొడమినచిఱునగ వడంచి యయ్యనఘుండు నన్నుం జూపి వారి కిట్లనియె. 64

క. మాదాహింత్రి కులంబునఁ
ప్రాదుర్భవ మందినాఁడు భక్తుఁడు నాకున్
స్వాదుప్రబంధకృతి గా
ఢాదర మీతనికి సహజమై యలరారున్. 65

క. ఉత్తరనైషధరచనా
యుత్తమతి న్నాయనుజ్ఞ నందెను, మున్నే
చిత్తమువిడిసిన ముఖరుచి
యుత్తమకావ్యంబు సలుపు నుత్సుకత యగున్. 66

క. ఇతనిమతి నాంధ్రకవితా
పితామహుఁడు దీర్ప నా కభీష్టం బచుడున్
శితిదృష్టిని సనుగనుఁగొనెఁ
బితామహుఁడు నవశిరీష పేశలరుచులన్ 67

క. పులకింపఁ జూచె సూరన
తిలకించెను కృష్ణనృపతి తేనెలువాఱన్
పలికించినటుల ధూర్జటి
విలోకనము లలరె మధుర విభ్రమగుములన్. 68

క. తిమ్మనయు రామకృష్ణుఁడు
కమ్మనిచూపులను జిలుకఁ గవికుల మెల్లన్
నెమ్మదుల నులికినటు, సిరి
తమ్ముగఁ గనుఁగొనిరి కవిపితామహు వంకన్. 69

క. నను మున్న యెఱిఁగి యుండుట
ననఘుఁడు పెద్దనకవీంద్రుఁ డల్లన నగుచున్
విను మోయి నీతలంచిన
పని కిదె జయమంగళంబు పలికెద నేనున్. 70

పలుమార్గంబుల భావనల్ సలిపి దుష్ప్రాపంబు లౌ లక్ష్యముల్
దెలియం బల్కితి వింతకున్మనువు జ్యోతిర్మూర్తి యీస్వామి సే
వలకుం గన్న ఫలంబుగా, నిదియె సంభావింతు మేమెప్పుడున్
నలచారిత్రవిశుద్ధనీకవిత సంధానించు నిష్ఠారముల్. 71

సీ. నీతలంచినయట్లు నిక్క మీకవిలోక
మున కెల్ల బ్రహ్మ తిక్కన యొకండె
ఏయుగంబులనేని యెల్లఁ గవీంద్రులన్
సార్వభౌముండు శ్రీనాథుఁ డొకఁడె
కవిలోక మిదియెల్ల గాలించి చూడమా
సూర్యుఁ డొక్కరుఁడె దా సూర్యుఁడగును
ఈదేవు తేజమ్మె లే నృపాలురు గాఁగఁ
గృతులు నరాంకితస్థితిని జెడునె
అరయఁ దనయెల్లఁగృతులందు గురునిమూర్తి
అలరుపొగడలఁ బరిమళం బలమినట్లు
పలుకనేర్చుట సత్కళాభావుకునకు
ధ్వనిగుణోజ్జ్వల ఘంటాపథమ్ముగాదె. 72

వ. అనునంతట 73

క. ఉలికిపడి చూచెఁ బోతన
కళవళపడె సంకుసాల కవివర్యుఁడు, దా
నెలనగవు విరిసె ధూర్జటి
తళతళ శ్రీకృష్ణు ఫాలతలమున మెఱసెన్. 74

క. కలపుంస్కోకిల మృదుగళ
గళిత కలస్వాన కదనకలిత విపంచీ
కలకలము లప్పితామహు
పలుకుల పరిమళము లాసభాస్థలి నిండెన్. 75

క. మాదౌహిత్రికిఁ బెనిమిటి
కాదేనిం జెప్ప నయితిగా దనరా దీ
స్వాదుప్రబంధరచనా
మేదురమతి సూరసుకవి మేలిగుణమ్ముల్. 76

గీ. సహజ సత్ప్రతిభావిశేషమ్ము కలిమిఁ
దడవి విడువని యేప్రబంధయును లేఁడు
అమరనార్యునిపుత్రుఁ డీయమలమతికి
సాక్షి యొక్కఁడె శ్రీవిరూపాక్షవిభుఁడు. 77

క. ఉత్తమమనుచరిత గుణో
దాత్తము రచియింపు మీవు తావకరచనా
యత్తమతి, సూరకవి నీ
చిత్తమున వసించి దిద్ద శిల్పగుణమ్ముల్. 78

క. అని యతఁడు గనిఁయె సూరన
నెనయఁ గపోలముల వింత యెఱ్ఱనిచాయల్
తన మృదుకలభాషణముల
నను బలికె నతండు పృథుఘృణాభరితోక్తిన్. 79

క. నుతకవితాచతురుం డగు
పితామహుని పల్కులెల్ల వింటివె నీవం
కిత మిదు ముత్తమచరితము
శ్రుతినిగదితమూర్తి శ్రీవిరూపాక్షునకున్. 80

క. నిరతమ్ము నన్ను గొప్పగ
స్మరియించెదు గాక నాకుఁ జతురిమయు నటే
అరయంగ విరూపాక్షుని
కరుణాలేశమ్ముకంటెఁ గలదె యొకండున్. 81

గీ. అదె విరూపాక్షు దివ్యరూపాంతరమ్ము
అలకవిత్రయి వెనుక సర్వాంధ్రసుకవి
కులగురుశ్రుతి శ్రీనాథగురుమహామ్ము
పరిషదధ్యక్ష మగు శివంకరమునీకు 82

వ. అని యాశుచిస్మిత ముఖుండు, సభక్తికమ్ముగా నన్ను నామహామహునకు నివేదించుటయు నయ్యనఘుండు నత్యాదరమ్మున శ్రీకృష్ణరాయ ధరణీశ్వరు దెస నిజవిమల దృష్టిం బ్రిసారించిన నవ్విభుండు కొలువునలుదెసల గలయంగనుం గొని నిసర్గమధురగంభీరధ్వానంబున 83

గీ. ఆంధ్రకవితాపితామహుం డాడెఁ గొంత
సూక్తు లలరించె నొకకొన్ని సూరసుకవి
పరిషదధ్యక్షుఁ డగు సార్వభౌమునాన
నేను బలికెద నొకకొంత యెఱిఁగినంత. 84

గీ. ఏము సలుపనిసుకృతు లెన్నని జలిపె
సూరన కవీంద్రుఁ డాతనిచూపు వేఱు
అరయఁ బ్రాక్తనకవుల మహత్త్వమునకుఁ
జిహ్న మనుకొందు మత్సభాశ్రీమహమ్ము. 85

క. అకళంకోత్తరనైషధ
నికషోపల బుద్ధి గుణ వినిద్రుఁడు, సుకవీం
ద్రకుమారుఁ డటవె యీతని
సుకృతులఁ గన నెవరిమనసు సొగయకయున్నే. 86

వ. అని నన్నుంగనుంగొని 87

నందనకార్తికపూర్ణిమ
నిందు విరూపాక్షు గొలువ నేతెంచినమా
కిందఱకు విందవైతివి
ఇంద మటం చాదరంబు హెచ్చినప్రేమన్. 88

వ. సకల భువనాధీశ్వరుండగు శ్రీవిరూపాక్షవిభుని, ప్రతినిధిత్వప్రభాస్ఫూర్తిమూర్తి యగు నా శ్రీకృష్ణరాయ ధరణీమహేంద్రుండు, శ్రీభువనేశ్వరీ సనాథ సమర్పితంబు గా,

నుత్తమమనఃసంభవంబు రచియింపం, దదీయ, మృదుల
గభీర హృదయపరిమళ మధురంబు, బుణ్యరమాధురంబు
ననర్ఘంబు నగు కర్పూరతాంబూలమ్ము నొసంగునంతట. 89

క. మారనకవీంద్రు పలుకుల
తీ తెలుఁగుదు వతనిగురుని తెలుఁ గెలుఁగుదు వా
ధీరునియనుకృతు లెలుఁగుదు
సూరన నెలుఁగుదువు గడఁగు సుకృతి యొనర్పన్. 90

అని దీవించెను సార్వభౌముఁ డటఁ గర్ణాటాంధ్రసర్వక్షమా
వనజాతప్రియబాంధవాకృతి విరూపాక్ష స్ఫురన్మౌళిపైఁ
గనదిందుద్యుతి తెచ్చి కాసెను వియత్కల్లోలినీవీచికల్
నినదించెన్ భువనేశ్వరీముఖరుచుల్ నించెన్ జగద్భద్రముల్.

అధికాశ్చర్యము నంది చూచునెడఁ దా నంతర్హితం బయ్యెనా
పృథులానంద కవిప్రపంచ పరిషత్పీఠంబు నా స్వామిలోఁ
బ్రథితోత్తుంగతరంగ భద్రరస దీవ్యత్తుంగభద్రానదీ
మధురధ్వాన పరంపరావళి కథామాధుర్యముల్ చిందగా. 92

వ. రసవిశేషానుభవ పరవశతా దురవబోధం బగు నాస్థితి
యట్లెంతతడవు చెల్లెనో కాని పదంపడి యొదవిన యొకిం
చుక తెలివికలిమి. 93

క. ఎక్కడ మారన పెద్దన
యెక్కడ సూరకవియొచట నేనెట యాథా

నిక్కపుమణులకుఁ బులుగొను
టెక్కటిగఁ ణ మనఁటయెఱుఁగ రే సుకవీంద్రుల్. 94

వ. అటుగాక తక్కిన 95

తలఁపఁగ సార్వభౌముఁడు పితామహుఁ డీశ్వరమూర్తి కృష్ణరా
యలు నను నిట్టులాడుట యథార్థమయందురొ యేమి యందురో
కల యనువారొ యేమనిన గాథసిసోజ్జ్వలమూర్తులైనవా
రల సహజార్ద్రభావ మనరా, నను వారలభక్తు నెంచుచున్.

వ. అని పెద్దయుం బ్రొద్దుచింతించియు, నవ్విధంబున నొదవిన యాసారస్వత ప్రపంచానుగ్రహంబునకు ముదంబంది వారలయభీష్టం బవశ్యంబు నిర్వహింపవలయుట నెంచి యదస్సమస్తమంగళనివాసం బయి వెలయుచున్న 97

# కృతి సమర్పణము

క. భువనేశ్వరీమనఃపతి
కవినాకృతసతికి సుకవితామృతరతికిన్
నవనవ కరుణావినిమయ
కవిజనకవనునకు నఖిలకల్యాణునకున్. 98

క. దర్పకహారదివ్యకథా
దర్పణముగ భువనపతియుదారగుణమన
స్తర్పణముగ, గావింతు స
మర్పణముగ నుత్తమాఖ్య మనుసంభవమున్. 99

ఏనస్సంభరితమ్ము నాచరిత మయ్యెన్ నేటి కిల్లాట నీ
కేనర్పించెదఁ దద్విశుద్ధి కయి స్వామీ యుత్తమాభిఖ్యమా
నీనాకావ్యము మత్పవిత్రహృదయం బిద్దాని, నైర్మల్యసు
శ్రీ నీవొక్కఁడవే యొసంగు దనుచున్, శీర్షేందుఖండోజ్జ్వలా

క్రీడార్థం బగు సృష్టి నీకు నరయం, గ్రీడామృగమ్ముల్ జనుల్
వాఁడొక్కండును లేఁడ, యెవ్వఁడు నిజప్రౌఢిన్ స్వవృత్తంబునన్
కీడున్మేలు, సుదుష్కృతుల్ సలుపునో, నీయిచ్ఛఁబోఁద్రోచి నీ
క్రీడార్థ మ్మిది స్వీకరించి, నను రక్షింపంగదే యీశ్వరా 101

ఏతావత్కృత మత్పవిత్రకృతులం దెల్లన్ జగజ్జ్యోతివై
చేతస్స్వామివి నీవసించుటలు నా చేరాని పుణ్యాంబులై
ప్రీతిస్నిగ్ధములై యొసంగు ననఁగా, వేఁడేను వాంఛింతు, వి
ఖ్యాతాగ్రావసశీల శంకర విరూపాక్షా జగద్రక్షకా. 102

కామక్రోధము లింతలంతలయి యీకాయమ్మునం బ్రత్యణు
స్వామిత్వమ్మును నిర్వహించుకొన నాస్వాంతమ్ము దిగ్భ్రాంతమై
ఏమిన్నేరదు నీదు జాడ గనుఁగో నేదారిఁ జూపింతువో
స్వామీ శాంతి ననుగ్రహింపవె పునర్జన్మాపహారక్రియన్. 103

ఎవరో చేసినయప్ఫలం బెవరికో యేలబ్బు, నేప్రాణియే
నెవ రేకార్యము దానుగాఁ జలుప నీయెల్లం ద్వదిచ్ఛామయం
బవుటన్, సర్వమునుం త్రిశుద్ధిగను నీయం దర్పణాల్ సేయు, శ
క్తివిశేషమ్ము ననుగ్రహింప నిను బ్రార్థింతున్ సతంబీశ్వరా.

జీవగ్రాహముగా సరిపత్రికరమున్ జేకో దలం పంటినా
శ్రీవిద్యానగరీ కవీంద్రకవితా శ్రీస్పర్ధ చేకొంటినా
శ్రీవాణీకమలాసన ప్రణయముల్ చిత్రింతు నేనంటినా
రావయ్యా కృతి స్వీకరించి మనువన్ రాజార్థచూడామణీ 105

## అష్టమూర్తి స్తుతి

భరితాంభోనిధియై యశేషమహీభృత్పాళీ శిరోధార్యమై
శరణ మ్ముర్వర రత్నగర్భ యగుచున్ సర్వంసహాభిఖ్యమై
పరమంబై మృదుగంధధామ మగుచున్ భాసిల్లు నీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే.

సరసంబై, నిజగర్భ జాగ్రదవనీచక్రింబునై, యుర్వరాం
తరధారం బయి జీవనమ్మగుచు రత్నస్థానమై, విద్యుదా
కరమై నిత్యరసాత్మకం బమృతవిఖ్యాతంబు నీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే.

దురితారణ్య దవానలం బఖిలజంతుప్రాణనాధార జా
ఠరదీపమ్ము దురంతదుర్విషయ ఝూటద్రోహశీలమ్ము భా
సురమున్ జ్యోతిరఖండ మక్షరము తేజోధాని నీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే.

పరమస్పర్శము గంధవాహము జగత్ప్రాణమ్ము విశ్రాంతరే
త్వరశీలమ్ము సదాగతిస్ఫురితము న్వహ్నిప్రియస్థానమున్

మరుదాఖ్యమ్ము మహాబలమ్మగు జగత్ప్రాణమ్ము నీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే. 109

భరితాజాండ మిహాఖచక్రము విభుత్వస్ఫారమున్ సర్వభూ
తరమాక్రీడన దివ్యరంగమును శబ్దబ్రహ్మ సంచార భా
స్వరమున్ దివ్య మనంతరూపము జగద్భద్రమ్ము నీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే.

కిరణోగ్రమ్ము దివానిశాకరణలక్ష్మీమూల తేజమ్ము, భా
స్కరసంజ్ఞమ్ము జడాజడాత్మకజగచ్చైతన్యదానోజ్జ్వలం
బరవిందాప్తము దివ్యధామము త్రిమూర్త్యాత్మంబునీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే 111

పరమాహ్లాది, సుధాస్వరూపము సురప్రాణంబు దివ్యౌషధీ
భరణప్రౌఢము జ్యోతిరీశ్వరము సర్వప్రౌఢవిదత్వకృవీం
ద్రి రసాలంబి వచోతిభూమి యగుచున్ రాజిల్లు నీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే.

పురుషఖ్యాతము నాత్మయజ్ఞ ఫలసంపూర్ణస్వరూపంబు దు
స్తరసంసారసమగ్రతారణజయస్తంభ ప్రభావస్ఫుర
చ్చరితం బాగమసారరూపము మహాశాంతమ్ము నీమూర్తికిన్
శరణంటిన్ శరణంటి నంటి శరణుల్ స్వామీ కటాక్షింపవే.113

# పంచబ్రహ్మస్తుతి

ధృతవిద్యుత్కనకావభాస మయి ప్రాగ్దిగ్విధికావాసమై
భృతవిద్యాభయదానహస్త పరశుస్ఫీతమ్ము త్ర్యక్షమ్ము నై
చతురాస్యప్రథితమ్ము తత్పురుషసంజ్ఞం బైన బ్రహ్మమ్ము మత్
కృతినాథమ్ము కృపాసనాథము కటాక్షించున్ జగద్భద్రముల్

ధృతఖేటాగ్నికణాంకుశస్వధితియై తీక్ష్ణత్రిశూలమ్ము, ను
ద్ధతఢక్కాసి త్రినేత్ర, మింద్రమణిసాంద్రజ్యోతి రుద్రాక్షహా
రతతిస్నిగ్ధము దక్షిణస్థము నఘోరబ్రహ్మసంజ్ఞమ్ము మత్
కృతినాథమ్ము కృపాసనాథము కటాక్షించున్ జగద్భద్రముల్

భృతవేదమ్ము సితాక్షమాలము వరాభీతిప్రద మ్మంబక
త్రితయస్ఫీత చతుర్ముఖోజ్జ్వలము జ్యోతిశ్శంఖ కుందేందుస
ద్ద్యుతిదీప్ర మ్మయి పశ్చిమస్థ మగు సద్యోజాత సంజ్ఞమ్ము మత్
కృతినాథమ్ము కృపాసనాథము కటాక్షించున్ జగద్భద్రముల్.

భృతటంకమ్ము ధృతాక్షమాలము వరాభీతిప్రద మ్మీక్షణ
త్రితయస్ఫారచతుర్ముఖమ్ము నవనీరేజాత కింజల్కసం
చితవర్ణ మ్మగు వామదేవము నుదీచీభాసి బ్రహ్మమ్ము మత్
కృతినాథమ్ము కృపాసనాథము కటాక్షించున్ జగద్భద్రముల్.

ధృతవేదాభయపాశటంకము లసత్తీక్ష్ణత్రిశూలాంకుశో
ద్ధతఢక్కమ్ము కపాలహస్త మయి యూర్ధ్వంబున్ సితద్యుమ్నమై
కృతవిశ్వావన మాచుఁ బంచమము నౌ నీశానసంజ్ఞమ్ము. మత్
కృతినాథమ్ము కృపాసనాథము కటాక్షించున్ జగద్భద్రముల్.

సీ. శంఖ ధనుశ్చక్ర ఝషకమలావళీ
శరణ చరణయుగీ చారిమములు
మకరవిగ్రహరమా మహిత జంఘాఘృణుల్
కమఠపృష్ఠక జానుకమ్రరుచులు
కిరిఘోణ కదనవిస్ఫురి తోరుకాంతులు
భగ్ననృసింహో వలగ్నరమలు
వక్షస్త్రివిక్రమ ప్రాభవోద్దామముల్
పరశురామ భుజా పరిభవమహములు
మృదులవీక్షణమయ రామకృష్ణజనులు
విమలదరహాస బుద్ధ సంయమిజనమ్ము
లయిన వెలుఁగుల బహుళ దశావతార
రమలు ప్రోచుతఁ గలిదోషశమము లలర. 119

వ్యాసపథమ్మున న్వెలుఁగు లర్చన మారన సేసె మున్ను వై
యాసము నీకథార్థపరమార్థము భావన సేసిసేసి, నా
చేసినయన్యాయమ్ము దయచేసిన వేల్పవు నీవె కాదె, నేఁ
జేసిన వీసముం బరక చెల్లదె నీకృప రత్నహారివై. 120

వ. అని, నిన్ను న వ్విరూపాక్షవిభునిం బ్రార్థించి నీతదర్చ
నమ్ముగా మారసకపీంద్రు ననువాదమ్ము యొజ్జనమ్ముగా,
నావివరింపం దలంచిన శ్రీమదుత్తమమానససంభవ కథాసంవి
ధానం బెట్టిదనిన. 121

# ఉత్తముఁడు

క. శ్రీమత్పింగళి సూరయ
ధీ మేరు విహారరసిక ద్వికథాద్వైత
శ్రీ మధురమధుర భాషా
స్వామి విరూపాక్ష సకల జగదధ్యక్షా. 1

వ. దేవా అవధరింపుము. 2

క. ఉత్తానపాద తనయుం
డుత్తముఁ డాసురుచి మూర్తి యుజ్జ్వలధర్మా
యత్తమ్ము నుదాత్త మ్మగు
చిత్త మ్మటు రాజ్య మెల్లసిరులను దిద్దెన్. 3

త్రికరణశుద్ధి యా నృపతి తేజము, సూర్యుఁడు నగ్ని చంద్రుడై
సకలమహిన్ మహాఫలవిశాలను జేయ ధ్రువానురాగి తత్
ప్రకృతిజనమ్ము సర్వకృతిదక్షిణమున్ సుగుణోత్తరమ్ము నై
ప్రకట మొనర్చెఁ దత్సహజ భావవిశుద్ధి సునీతి భూతులన్. 4

సురుచికుమారు నేల్బడి వసుంధర ధాత్రి యనంత రత్నగ
ర్భ, రస జగద్వహా, యపాంపతి మేఖల, విశ్వమాత యు
ర్వర చతురంత గోత్రధర పంటవలంతి యటన్న పేరులన్
స్థిర విపులక్షమాభిధలఁ, జెందియు జెందదు పాంసులాభిధన్. 5

క. అకలియు నద్వాపర మై
యకృత త్రేతాగ్ని హోమ యజ్వరహితమున్
సుకృతి యతఁ డతిచతుర్యుగ
వికస్వరోదాత్త ధర్మవిభవము చూపెన్. 6

క. శ్రుతిగోచర తస్కరతన్
కృతమున హరి యడఁచె నమ్మహీపతి బహువి
శ్రుతికలిమి శ్రుతిస్మృతిదూ
రతఁ గనెఁ దస్కరత యతనిరాజ్యమునందున్ 7

క. భరణమున రక్షణమ్మున
వరవినయాధానమునను బ్రజలకు నెల్లన్
నరపతియె తండ్రి వారి పి
తరు లనఁ గేవలము జని నిదానస్థానుల్. 8

వార్ధి తరంగలీలలనఁ బట్టయి, కేకిసలాడుచున్ విహా
రార్థపథమ్ముల న్నిదురలందిన బాలల సన్నపైఁటలన్
వర్ధిలుగంధముల్ మనసుపట్టియు బట్టనియట్టి వయ్యె నా
పార్థివు నేల్బడిన్ మలయబంధుర గంధవహార్భకాళికిన్. 9

పండిన నిండువెన్నెలల వాఁకల నిక్కరళ్లగుంపులై
గండతలమ్ములన్, వెలికిఁ గ్రక్కిన వెన్నెలనవ్వులందుఁ దా
నుండియు నుండఁడయ్యె శశి యొప్పినబాలల దీర్ఘవేణికా
చండకృపాల శాసన లసత్కరవాల విధుంతుదప్రభన్ 10

ఆమనివేళ లందొడళు లన్నిచివుళ్లుగ మోసులెత్తుచున్
కోమలబాహువల్లరులఁ గోర్కులు నింపెడి పూలకొమ్మలన్
వేమరు లెత్తియెత్తి పృథివీరుహముల్ సరియొద్ద నుండియున్
భూమిపుశాసనమ్ము లన ముట్టియుముట్టవు చూచిచూడవున్.

జలజలమ్రోయుచుం బృథులశైలహృదంతర గహ్వరమ్ములన్
మలఁగిమలంగి, యద్రులమనమ్ములఁ దాల్చియుదాల్చనట్టులై
చెలఁగిన పెక్కుపోకడల సింధువుజొచ్చును సింధువుల్ చలా
చలదసిభంగిమల్ నృపునిశాసనముల్ తమజీవనమ్ములై. 12

ఒనరినమన్మథోత్సవ కుహూకుహుజృంభిత మత్తగానముల్
విని వినవయ్యె నానృపతి వీక్షణకైతవ కైతకప్రభా
వినిమయశాసనమ్ములకు విచ్చియు మూఁగియు మూఁగ లానళుల్
దనికినచిత్తముల్ పరభృతమ్ముల కింతలనంతలంగనన్. 13

ఎక్కఁగరానియద్రులయి యెంతకు దాటఁగరాని వార్ధులై
త్రొక్కఁగరాని యగ్నులయి త్రోసుఁగరాని సమీరణమ్ములై
చిక్కనియాకసమ్ము లయి చెల్లె మహీపతిశాసనమ్ము లే
దిక్కనఁ దామయై ప్రజల దిద్దినబాటల పూలతోటలై. 14

సీ. ఎల్లఫలమ్ములఁ గొల్లలిచ్చుటె కాక
పృథివి తా నింతేని యెగసిపడదు
తనజీవనము లెల్ల దానవోయుటె కాని
యప్పతి తనమేర తప్పిచనఁడు

చైతన్య మనుజ్యోతి సంతరించుచుఁ గాని
మండింపఁ డినుఁడు భూమండలంబు
ఎల్లరప్రాణమై యెలమి నించుచుఁ గాని
యార్భటింపఁడు దా మహాబలుండు
ఎల్ల బ్రహ్మాండగోళముల్ హృదయమందు
నేకరీతిని దాల్చి తా నేకసాక్షి
యయిన గగనమ్ము నృపతిమహానసమున
నెల్లప్రకృతియు మినుముట్ట నుల్లసిల్లె. 15

గీ. ప్రజలు తమతమ విధులనిర్వాహణ మందు
నేమఱక యుంట సౌఖ్యమ్ము లెల్లఁ గలుగ
సాక్షిమాత్రుండె యగుచు నాజనవిభుండు
దేవళములోని లింగమై తేజరిల్లె. 16

అవినయ మభ్యసూయ దురహంకృతి మందున కైన లేక యా
సువినయమార్ద్రచిత్తతయు,సూనృతముం దముగొల్వు సేయ నా
యవనిపురాజ్య మందుఁ బ్రజలైరి విభుం డతఁడయ్యె నాప్రజల్
వివిధ సుఖానుభూతులను బింపిసలాడెడి సత్యతృప్తులన్. 17

## బహుళ

సీ. కాలమ్మునవవయఃకాలజృంభణమున
ఘనశరల్లక్ష్మిఁ గైకొనినయట్లు

పగలు దాఁ గయిసేయఁ దగుసమున్నతమున్న
నెఱసంజరసము చేత నొఱసినట్లు
గగనమ్ము తనదు సోయగమును దిద్దంగ
మొసరి నిశాలక్ష్మిఁ గొసరినట్లు
కువలయబంధుండు కోర్కులు పొడవెత్తి
రాకాతిథిశ్రీని జోకినట్లు
పరమపురుషుండు ప్రకృతిఁ జేపట్టినట్లు
మహిత గుణరూపసౌభాగ్యబహుళ బహుళ
ధర్మపత్నిగఁ గొని భూతధాత్రి కొక్క
సవతిఁ గల్పించెఁ బతి మహోత్సవముగాఁగ. 18

గీ. పతి ప్రజాతంతుపోషణపరముఁ డగుచు
శీలసంపన్న బహురూప శిల్పరేఖ
దేవిఁ జేపట్టి తన సద్వితీయభావ
మరయు ప్రజలకుఁ గన్నులకఱవు దీర్చె. 19

గీ. తల్లి దండ్రియు నృపతిగాఁ దలఁచుప్రజకు
బహుళ తనమాతృభావ సంపదలుచూపి
తల్లియే కాదు తానొక తండ్రి యగుచుఁ
బ్రజల మఱపించెఁ దన పుణ్యావర్తనముల. 20

క. ఆ దివ్యదంపతుల కథ
లాదర్శము లగుచుఁ బ్రజల నలరింపఁగఁ దా

నేదియొ వారలమదుల వి
భేద మెఱ్ఱఁగఁ దుద్భవిల్లి పెరిఁగె గ్రమముగన్. 21

సీ. చతురాస్యసంపదఁ బతి తన్ను నలరింప
బహుముఖమ్ముల నుండు వాణివోలె
హృదయ మిచ్చిననాథు నెద నున్నయటులుండి
చంచలయగు లక్ష్మిచందమునను
తన మేన సగమిచ్చి యనునయింపఁగఁ బతి
గట్టల్క గొను గట్టుపట్టి యనఁగ
మిను డిగ్గి సరసత్వమున డాయు నిను గని
కననట్లు మినుఁజూచు కమలినియన

బహుముఖమ్ములఁ దన్ను విశ్వమునఁ జూచు
పతి నెఱుంగునొ, యెఱుఁగదో, బహుళ దాను
బ్రౌఢ యనరాక, ముగ్ధ నా, వలనుపడక
మధ్యయును గాక పతికి సంభ్రమముగూర్చె. 22

తనకై మిన్నులు డిగ్గివచ్చు సరసత్వంబేని లక్షించి, ర
మ్మనఁగా నేర, దెచుర్లోనం జనదు,నిత్యామోదముం దాల్చియున్
వనమధ్యమ్మున నున్నకై రవిణియై, ప్రాణేశు నానందవా
హిను లౌ వెన్నెలలం గరంగదు శిలాహేవాక చిత్తమ్మునన్.

బహువిధ నాయికాగుణ విభావము లెన్నియొ యున్నయెన్ని, త
ద్బహుళము శాస్త్రమున్ బహువిధమ్ములనారసిచూచెఁగాక యా

బహుళమతిన్ ,రవంత తెలుపంగను వేఁడు పరాంగనాస్పృహా
రహితమనమ్మునం బడయరానివి కోర్కులు చిందివందగన్.

క. పూవయి పుట్టినయప్పుడ
తావియు దేనెయును మధురతయు సుకుమార
శ్రీ విలసిల్లుట యెటుఁ గన
మో వినమో గాక యీ యపూర్వము లున్నే. 25

క. తలఁచినవి తలఁపులోనన
వలఁచినయంతలుగ నిచ్చువాఁడై పతి తన్
దలఁచి పరం బెఱుఁగండై
లలనకుఁ బతివయిని నీచలం బది యేలా. 26

ఉ. రూపసి గాదొ తా సతఁడు రూపసిగాఁడొ, కరంప నేరదో
పూపగుప్రాయ మొక్కొ వలపుందరిదీపుల కాసవెట్టదో
కోపము లేక యే యలుకగొన్న విధమ్మున, నెల్లఁగల్గి, యి
చ్ఛాపరకోటి కెక్కియును జాలదు నాథుమది న్వసింపఁగన్.

ఉ. రాజును రాణిఁ జూచుచుఁ బరస్పరరాగ మనోజ్ఞభావ వి
భ్రాజితమూర్తు లంచుఁ బరివారజనుల్ సరివారు మెచ్చ పే
రోజఁ జరింత్రుగాని, మదు లొండొరులన్ సరి విశ్వసింప వా
రాజును రాణి విస్మయకర మ్మగు కాపుర మిట్లు చెల్లఁగన్. 28

గీ. నరవిభుఁడు నవ్వ, రాణియు నవ్వు నవ్వు
డద్దమునపోలెఁ బద్మరాగాధరమున

స్ఫటికకాంతుల ధగధగల్ పరిఢవిల్లఁ
గాని పూవులతావులు గడలుకొనవు. 29

వ. అమ్మహీకాంతుఁ డిట్టు లేకాంతదుస్సహం బగు నక్కాంత
పొందునం జిక్కు వెలార్పం దలంచి, పెక్కు లూహించియు
నొక్కనిక్కువంబు సేయంజాలక, చిత్తరువు నీక్షించినట్లు,
రత్నపుత్రికం గౌఁగిలించినటుల, స్వప్నసమాగమంబులం దని
సినయటులు నయి, కాదంబినీ దర్శనంబునం గేకియుం
బోలె నటించుచు, మలయజ లతాస్పర్శంబునం గంధ
వహుండునుంబోలె నలఁతలుదీఱుచు, జంద్రనిరీక్షణంబునం
జకోరంబునుంబలెఁ దృప్తి భజించుచు, నాగస్వరశ్రవ
ణంబున ఫణిపతియునుంబలె మెయివెంచి విప్పాఱు పడగ
నిలుకడల బుస్సలుగొనుచు, విమలాదర్శప్రతిబింబితంబు లగు
బహువిధ మధురపదార్థంబులు పంచేంద్రియతర్పణంబు
లుగా ననుభవించుటలై, యాదేవికి నుచితంబు మెయిం
జెప్పియుఁ జెప్పించియు, బుజ్జగించియు, భూషించియు మిథ్యా
కలహంబులం గిలికించితంబులు పుట్టించియు, నెందును
నక్కాంతహృదయంబు తెఱంగు, తెఱంగుసేయ నేరక, యు
ద్యేకపత్నివ్రతుం డంతర్బడబానల దహ్యమానుం డగు
నంభోనిధి గాంభీర్యంబు భజించి, హేమంతంబులకు వెఱ
చియు, శిశిరంబులు గడపియు, గ్రీష్మంబు లతిక్రమించియు,
వర్షంబుల వేగించియు, శరత్తులఁ దిరస్కరించియు, బహుళా

మయమ్ముగాఁ బహుకాలమ్ము గడువగడువ నొక్క మధు
మాస విజృంభణమ్మున. 30

# వసంతము

ఉ. భూసతికొప్పునం జెరువఁ బూచినభంగి, లత ల్వాను ల్వీగుల్
మాసరమై ఘుమంఘుమలు, మత్తమధువ్రతపాళిఁ దీర్చుచో
నాసవ సిక్తముల్ కిసలయాధరముల్ గసిగాటు తాఁకులన్
గాసిల, సంచలించె, ననుగాలుల, గోయిల గొంతులెత్తుచున్ 31

ఝుంకారమ్ములు కొన్ని పుట్టి సుమనస్సౌరభ్య శుంభద్ధను
ష్టంకారమ్ములు మన్మథాగమరహస్యవ్యాఖ్య కోంకారముల్
సంకల్పప్రభవమ్ములై, బహుజనుస్సంబంధులై, యుల్లసత్
పంకేజాత దళశ్రిమమ్ము లగుచుం బర్వె న్మనోభావముల్. 32

ఎన్నివసంతము ల్చనిన నెప్పటి కప్పుడు దాను గ్రొత్తయై
చెన్నులు దిద్దుచుండుటలు సృష్టిని నైజమొ పూర్వపూర్వమున్
చిన్నలు సేసిసేసి తనచెన్నును బెద్దతికంబు నిల్పికో [ఘుమల్.
నున్నదొ యీవసంత మన నొక్క మొగిం గవిసెన్ ఘుమం

అఱువదితీరులై యెసఁగు నామనులం దొకయందు, గాని యీ
గరగరికల్ ఘుమంఘుమలు గల్గెనె,యొక్కెడఁ గల్గెనేని, యీ
పరిణతు లీనవప్రణయబంధము లీసుకుమారభంగు, లీ
ఝరదురుభావ పుష్పమృదుసౌరభ రీతులు నిట్టు లుండునే. 34

జయజయ పెట్టెఁ గోకిలలు స్వాగతమిచ్చె శుకాళి, యెన్నినా
ళ్లయినదొ వీనిఁ జూచి యనినట్టులు, పుష్పఫలోపహారముల్
ప్రియపడి యిచ్చె నామనికి, వృక్షములున్ లతలౌర, వీని య
న్వయముల సంప్రదాయముల యాంతరము ల్బహుళాతి
ధేయముల్. 36

ఆమని యెవ్వ రాతనికి నర్ఘ్యము లిచ్చుటలేమి, యీవనీ
స్తోమసమృద్ధి గాక, యొకసుందరమూర్తియు వాని కున్నదో
ఏమొయిఁ దన్నుదాన మురియించునె ధర్మమొ, పెక్కురూపులై
యీమహితార్థగుంభనము లెప్పటినుండియొ యెంతఁదాకనో.

వింతలుగాఁగ నామనియు, వేసఁగి, వర్షమునున్, శరత్తు, హే
మంతమునున్ మనశ్శిశిరమంగళమూర్తియుఁ దాల్పదాల్ప నే
కాంతమనోహరప్రకృతి యయ్యయిరూపుల గొల్వుసేత సి
ద్ధాంతముగాదె యిమ్మధురతా మహనీయ పురాణవస్తువున్. 37

ఎన్నటినుండి వచ్చెడినొ యెంతటివృద్ధొ వసంతమూర్తి దాఁ
గన్నులపండువై నవవికాసముఁ జూపెడి నిచ్చనిచ్చ లీ
తెన్నున వచ్చు బాంధవు నతిప్రమదమ్మున నింతలింతలన్
మన్ననలిచ్చు నీప్రకృతిమాధురి చిత్తముచూఱవెట్టుచున్. 38

ఎఱిఁగియొ కాక తా నెఱుఁగకేనియు జాతిఁ బురానిబద్ధ మా
గఱువతనంబ యర్హమగు కాలములం బ్రకటప్రచారమై
తెఱఁగులు దిద్దుచుండుఁ బలుతెన్నుల నింతియగా కిదేమి, దా
నెఱిఁగియొ నేర్పినట్లు పిక మెజ్జనికంటఁ గుహూకరించెన్. 39

నిలువెల్లన్ బహుళానురాగవిభవోన్మేషంబు రూపించె నీ
లలితోద్యానము లెఱ్ఱయెఱ్ఱని చిగుళ్లన్ స్వామి యిమ్మాధవున్
దిలకింప, న్నిజవిటప్లో, తా హృదయమై దీపింప నీభూతికిన్
దెలియ న్నేరని యీజడప్రకృతిపై నిన్ స్వామికన్నెఱ్ఱలో. 40

ఎంతటితత్త్వదర్శనము లెన్ని యెఱింగిన నేమొనర్చినన్
స్వాంతము తృప్తి చెందమియు జాతిగుణమ్ము, సహానుభూతిమై
నింతలసంతలం దెలుపరే సరివా రటు తెల్పలేమి ర [నన్. 41
వ్వాంత గొఱంతయానె విమలాత్మఁ ప్రబోధము మిన్నుముట్టి

క. ఉత్తమనృపుఁ డిటుమాధవు
నుత్తమరూపమునయందు నున్మీలితమా
చిత్తమున నెఱియవిరిసిన
యుత్తలిరులమావులందు నవుఁ డొకఁ డయ్యెన్. 42

గీ॥ ఆకృతినిగన్న మధువైన యానృపాలుఁ
డాత్మసాత్కృతిఁ గన్నమోదాతిశయముఁ
జేతనాచేతనీకార శిక్షకముల
గీతములఁ దెల్పఁ గలకంఠ జాత మపుడు. 43

అనుపమ మారసార్ద్రహృదయానుభవమ్ము జడాజడచ్ఛిదల్
చెనకని యట్టివేళఁ బ్రభుచిత్తమునం దెటు లుప్పతిల్లెనో
తనప్రియుకై కిసాలయ భిదాచ్ఛద లెత్తిన మత్తకోకిల
ధ్వనుల శ్రుతుల్ స్మృతుల్ హృదయ బంధ విమోచన
కేళిచుంచువుల్. 44

గీ॥ నృపతి తలపోసె బహుళాత్మనిశ్చయమున
నెల్లప్రకృతియు నిట్లు రంజిల్లుచుండ
నేల బహుళామహాదేవి యెంచ దయ్యొ
నింతకింతకు నన్నుఁ దదేకహృదయ. 45

ప్రాణులయందు సర్వవిధభాగ్యనిధానము క్షత్రజన్మమున్
బూని ప్రజానురంజనవిభూతిఁ దనర్చితి, దేవిచిత్తమున్
గానఁగరాని కొండొకవికారముదక్క మఱొండులేదు నేఁ
బూనెద దీని నేఁ డొకయపూర్వవిధంబునఁ దీర్పరింపఁగన్. 46

క. సతియనెడి యంతమాత్రమె
పతివ్రతామాళి, రూపభావగుణములన్
జతగలదె యెన్నిచూచిన
సతికియు సతికనివె యయ్యొ నాలతకూర్మల్. 47

సీ. తావిని బూవునై ధరియింతు నేను, నా
తావి యీ పూవును దాల్పదయ్యొ
శబ్దమ్ము నర్థమై సవరింతు, నా యర్థ
మును శబ్ద మింతయు ముట్టదయ్యొ
చూపును దేజమై రూపింతు నేను నా
చూపు నీ రూపమ్ము చూడదయ్యొ
చవు లేర్పరింతు రసజ్ఞత న్నేను, నా
చవు లీరసజ్ఞతం గవియవయ్యొ

నేను సంస్పర్శభేదంబు లేర్పరింపఁ
బట్ట దయ్యెను నన్ను నా స్పర్శమెపుడు
నివియు సమకూడునట్టి వైభవముసాటి
నందునో లేదొ యద్వయానందసుఖము. 48

సీ. ఈశుకీశుకములై యీ పికీపికములై
ఈలతానగములై యెసఁగ మేమె
ఈనదిన్విహరింప నిచ్చనిల్చినది యీ
గిరిపీడ నదియిట్లు లఁఋుకునేల
మిన్నుముట్టఁగ సాఁగుచున్న దీలేఁదీఁగ
యంటునో దీని నయ్యాశసమ్మ
విభ్రమప్రదముగా వీతెంచె నీగాలి
యిట్టివిభ్రమము దా నేలచెందె

ననుచు నొకకొన్ని శకునమ్ము లరసినట్లు
బహువిధోపశ్రుతుల్ వినఁబడినయట్లు
పెక్కుదృష్టాంతము ల్గన్నవిధము దోఁప
నిశ్చయమ్ముల కెదురు నానృపతి యెపుఁడ. 49

భావనసేయుమాత్రమున, వాసనమాత్రన విన్నయంతటన్
కేవలదర్శనంబునను గేవలమున్ స్పృశియించునంత సం
భావిత మాఫలమ్ము, వెసఁ బట్టి భుజించినగాని చెందగా
నోవనిచందమై బహుమనోరథముల్ మినుముట్టఁ దాఁకినన్. 50

గీ. సమమనోభావ శుద్ధి వ్రిశ స్తిలేక
యన్యోన్యద్వేషాలు సుతుఁ గను టింది యనుచు
నాప్రజాపతి విజితాంతరరిసమూహుఁ
డొంగిని బనిపించెఁ బురి వసంతోత్సవమ్ము. 51

# ఉత్సవము

వసంత స్వారాజతుల్య నృప శాసనపుష్పమాలా
తిలక. సారస్య సంగ్రహణ చాతురు లా కుమారా
కారు ల్వసంతతిలకాయిత మూర్తు లంతన్
పౌరు ల్పురీవిభవ వార్ధితరంగ చంద్రిల్. 52

హెచ్చినకౌతుకమ్మున, ననేకులు వారును వీరు నాఁక వి
ద్యుచ్ఛపలేక్షణాసహితు లొక్క మొగమ్మున నాకుమారమున్
దచ్చనలాడు సోయగముదర్పము పిండులుగట్టి వచ్చె నా
వచ్చిరి మాధవోత్సవవిభాసుర మా యెలదోటపీఁటికెన్. 53

అఱువదినాల్గు సత్కళల నాటియు దేటిన యట్టివారలున్
పరఁగఁ జతుర్దశమ్ములును బైనొకనాలుగు నైన విద్దెలన్
బరిణతు లైనవారలును బ్రౌఢమహాకృతి నిర్మితి ప్రభా
పరపరమేష్ఠు లౌ సుకవివల్లభులుం జనుదెంచి రయ్యెడన్. 54

క. దశవిధ రూపకముల నన
దృశముగ రూపించు నృత్తనృత్యప్రౌఢుల్

విశద యశఃపరిణతులున్
బ్రశస్తగాయనులు నటకుఁ బఱతెంచి రాఁగన్. 55

వ. మఱియుఁ దేశీయంబులు, విదేశీయంబులగు బహువిధ నృత్య గీతాభినయవిశేషంబులం, బరిణతప్రజ్ఞు లగురసజ్ఞులును సహృదయులగుసామాజికులును సముకూడిన యమ్మహోత్సవంబు నవరాత్రంబులును ననునిమిష మ్మొక్కయుత్సవమ్ముగా నా రాజదంపతులసమక్షమ్మునం దమతమ గృహంబులయట్లు విస్రంభమధురగంభీరంబులై చెల్లునెడల, సామాజికనిర్విశేషంబు లగునరపాలదంపతుల యాకారప్రసన్నతల కచ్చెరువడుచు వారొసంగు నతిమాత్రకృపాసూచకంబుల నౌదార్యమాధుర్యధుర్యంబు లగుమన్ననలం బడసి ప్రఫుల్లహృదయు లగు కవిపండిత నటీనటగాయనీగాయనులు తమ తమ ప్రజ్ఞావిశేషప్రదర్శనంబుల కనురూపంబు లగు సత్కారంబులం, బరిషదధ్యక్షప్రదత్తంబుల స్వీకరించుచు నెదిరి చాతుర్యంబుల నాధిక్యంబు మెచ్చుచుం, బరస్పరసౌహార్ద సంపన్ను లగుచు మెఱయ, హృష్టపుష్ట జనాకీర్ణంబగు నందొకనాఁడు 56

చ. కరువునఁ బోసిదీసినటు గండరువుం బొనరించినట్లు, చి
త్తరువు లిఖించినట్టులు సుదాత్తమనోజ్ఞగభీరమూర్తి మా
ధురులు చెలంగ రంగమునఁ దోఁచె నొకానొకశిల్పచాతురీ
పరిణతవిగ్రహ మ్మట సభాజన చిత్తవిచిత్రకారియై. 57

క. స్త్రీపుం భేదజ్ఞాన దు
రావం బగు వెలుఁగువోలె నభిరామంబై
చూపరులచూడ్కి వెన్నెల
లై, పాలై హృదయశుద్ధు లయి యటుపాఱన్. 58

అభిరామం బగునట్టిమూర్తిమొగమం దంతంతటం జంద్రికా
ప్రభలై తేనెలునై దళత్కమలపత్రశ్రేణులై భృంగస
న్నిభము ల్భావులు పర్వి యప్రతిమతా నిశ్చాయి విజ్ఞానసా
రభముల్ నించె రసోజ్జ్వలామల మనోరాజీవరంగమ్ములన్. 59

స్త్రీపుంభేదనిబోధకమ్ము లగుచుం జిత్రప్రకారమ్ములన్
రూపుల్గట్టిన మూర్తివిభ్రమమునన్ రూఢమ్ములై యచ్చపుం
జూపు ల్పద్మకృతప్రదక్షిణములున్ జ్యోత్స్నాతివామమ్ములున్
స్థాపించె న్మధురప్రవాహములఁ గృష్ణాగౌతమీభంగముల్. 60

సీ. పుండరీకశ్రీ విఖండనోద్దండమ్ము
లిందీవరప్రభా మందిరములు
తొలిమెద్దు కన్నుల తెలిప్రసన్నతలును
మృగవధూ వీక్షణా మ్రేడితములు
ఉదయదర్క ప్రభాభ్యుదయ సూచకములు
గంధవహ స్పృగ్భగంధిలములు
ఋజుదీర్ఘ మధురతా మృదుగమనమ్ములు
భుజగేంద్ర గతిరయ స్ఫూర్జితములు

నగుచు దక్షిణవామ నేత్రాంచలముల
వెడలుచూపుల నామూర్తి విభవ మంత
నర్ధనారీశ్వ రాకార మగుచుఁ దెలిపెఁ
బరమవాగర్థ సంబద్ధబాంధవమ్ము. 61

అంకితనాగకుండల మహఃప్రతిబింబి కపోలమయ్యెఁ దా
టంకమణిప్రభా కృతివిడంబితమండితగండమై యుమా
శంకరమూర్తి వెన్నెలలసౌరును నచ్చఁదనం బొకొక్కచో
బింకము లెక్కఁ బొల్చుటకుఁ బేర్మిని దాను ననుగ్రహించె నాన్.

క. అందుండి వెడలి రవు డొక
సుందరి సుందరుఁ డొకండు చూపరులు గడున్
డెందముల విస్మయమ్ములఁ
జెందఁగ నమ్మధురనాట్యశిల్పగరిమకున్. 63

వ. ఇట్టులత్యద్భుతంబుగా నాది నొక్కమూర్తియై మెఱసియు వీక్షామిళిత దరహాసప్రవాహమ్ము లందొండొండు వేర్వేరుగా నిరూపించు పెరవున, నయ్యభినయకళా సిద్ధాంత సర్వస్వ మూర్తులగు నటీనటులు నిఖిలలోక సృష్టిప్రకార బోధకంబు లగునాట్యవిశేష ప్రదర్శనంబులం బొలిచి, రంగ స్థలంబు సామాజికహృదయ నిర్విశేషంబుగా నలంకరించి యొప్పి రయ్యెడల, నందు నొకమూర్తి 64

చ. ఇరువదియైదుగాఁగ నతికెక్కిన యీశ్వరులీలలందుఁ దాఁ
బురుషతఁ దాల్చుచుం బ్రకృతివోలిక సుందరియై నటింపఁగన్

పురహారణమ్ము దారువనభూమివిహారము నయ్యుమాతప
శ్చరణపరీక్షణమ్ము పుడుసాగుచునున్న యటుల్ నటింపఁగా. 65

క. పురుషుండు సాక్షిగా నా
తరుణి యట దశావతార దర్పణనాట్య
స్ఫురణముల మెఱసె హరిహర
పరమము దాంపత్యబద్ధభావము తెలియన్. 66

వ. ఆసమయంబున సద్యస్సముద్భవ దవిజ్ఞాతమాధుర్యకౌతుక
బహుళ యగుబహుళామహాదేవి ప్రకృతిపురుష సంబంధ
విజ్ఞానసూచకంబు లగు నపాంగావలోకన విభ్రమంబులు
దరహాసామలజ్యోత్స్నాబంధురంబులుగా నమ్మహీపతిపయిం
బఱపె, నంతట నయ్యభినయప్రదర్శనంబులు పరిపూర్ణంబు
లగుటకు సూచకంబుగా నానటీనటులు మధురగళంబు లెత్తి
మంగళగానంబు సేసిన, 67

తెఱ యటుడించి యెత్తువ్యవథిం గనిపించిరి యానటీనటుల్
చెఱుఁగని తొంటిరూపమునఁ జిత్తరువట్లు సభాజనమ్ము పై
మఱువఁగ గానరీతిమహిమమ్ములు రెండు నొకండు సేసె నా
వెఱఁగుపడన్ సదస్యు లటుపిమ్మటఁ గల్గినచేతనమ్మునన్. 68

వ. ఇట్లఖిలలోకాద్భుతప్రదాభినయవిద్యా జంగమస్వరూపంబు
లగువారిం దదర్హబహుమానంబులం గృతార్థచిత్తంబులం
బ్రభువును సభ్యులును సమ్మానించి కీర్తించి రయ్యవస
రంబున 69

చిమ్మనగ్రోవులం గొనుచుఁ జిమ్మిరి రాగరసప్రవాహముల్
ముమ్మరమై చెలంగి మినుముట్టఁగ మించుచు నొక్కరొక్కరిన్
క్రమ్మెడుకౌతుకమ్ము తమకమ్ముల వృద్ధులు బాలు రాచు నా
సమ్మదము ల్చెలంగఁగ వసంతములాడిరి సంభ్రమించుచున్. 70

అట నొకముద్దరాలు మునుపద్భుతము ల్గొలువిచ్చినట్టు ల
చ్చటఁ గనఁగొన్న నాట్యముల చందము లుల్లముబట్టి యార్పఁ
తటుకున నవ్వసంతమును దత్సఖియంచునొ మందిరాంతర [గా
స్ఫటికశిలాకృతిం జిలికెఁ జప్పటలిచ్చుచు నవ్వ నెచ్చెలుల్. 71

కొనకొని సోమిదమ్మ యొకకొంతగఁ దన్ను వసంతమాడినన్
మునుకొనె సోమయాజియుఁ బ్రమోదమునంది హుతాగ్నికీలి
చెనకినవేళలై యది విశిష్టముగాదె ప్రియావినోదముల్ [కల్
దనమతి నన్వయించుకొను తాలిమి వేలిమి కేమితగ్గునే. 72

మునుకొని రాచపట్టి ప్రియుమోహపుఁజూపులు నవ్వసంతముల్
వినిమయ మంచునట్టి కనువేదుఱుపాటునఁ జిమ్మెఁ జిమ్ముచో
ననిమొన నెత్త్రుటేఱులకు నగ్గులబారికి జంకుగొంకునున్
గనకయు వేఁచె సందుకొనఁ గామిని కైసరిచల్లుపోరులన్. 73

చలపడి యొక్కతీఱుగ వసంతపుధారలు గ్రుమ్మరించినన్
గళితసువర్ణము ల్పొగడదండలు కెంపులు వోయి యుంచెనో
తల మునుగంగ నెఱ్ఱనగు తాల్చినపుట్టము చూచి నెచ్చెలుల్
కొలకొల నవ్వినం దెలిసెఁ గోల యొకర్తుక నాథుధూర్తతన్.

గీ. రమణు నలరించి యలరినరాగరసము
పుక్కిలింతగ నంతంతఁ బొడమిపొడమి
ఒక్క మొగి మున్కలెత్తిన యుత్సవమ్ము
నొందె నొకధన్యుఁ డవ్వసంతోత్సవమున. 75

గీ. దేవి యంతటఁ జిమ్మనఁగ్రోవిఁ గొనుచు
చెలువతోఁ జల్లులాడెడి చెలువ మలర
రాజువయిఁ జిల్కెఁ దనయనురాగరసము
పూరములుగాఁగ నదియు నపూర్వముగను. 76

వ. అంతట. 77

జనపతియానతిన్ జనులు సందడిలేక సభాంతరమ్మునన్
వనమధుపానకేళి కొడబా టగువారలు కొల్వుదీర్చినన్
మనమున కింపుబెంప మిథునమ్ముల చూడ్కులు సందడింపగన్
స్తనయుగబాంధవమ్ములు సుధాకలశమ్ములు పెట్టి రంగనల్.

అమృతము పంచిపెట్టుసమయమ్మున మోహినినాఁగ నోర్తు దాఁ
గ్రమముగ రత్నభర్మచషకమ్ముల నించె మధుద్రవమ్ములన్
బ్రమసినచూడ్కికిం దెలియరాదకొ యవ్వి మధుద్రవమ్ములో
రమణి మనోజ్ఞహాసరుచి రంజితదృష్టి మరందధారలో. 79

ప్రియయుఁ బ్రియుండు త్రావి రట బింబితనేత్రరుచాసవమ్ము
ప్రియపడి దర్పణస్థలుల వేమఱు గోరియు నానరానివిన్ [లన్
ప్రియ యధరామృతమ్ము రుచిపెంపులుదద్దుట నక్షయమ్ములై
రయమున నిండెనో తెలియరాదకొ క్రోలుచు రెన్నిమాఱులో.

వన ఉత్తమమహీపతియు నుత్సుకభరమ్మున్
మయూ చిత్తమున గొల్వఁగొనఁజిందు లిడసాఁగన్
రము. చిత్తజునిరాణి యనఁ జెల్వయిన దేవిన్
మెత్త నగుచూపులను మేకొనఁగఁ జూచెన్ 81

## విక్షేపము

క. చూచి సుధారసమును గొని
యాచతురుఁడు దేవిచేతి కందీయఁగఁ దా
నేచదువు చదివెనో సతి
యాచషకము నెత్తివైచె నవ్వాలఁబడఁగా. 82

క. వైచుటయు గాక పతి నతి
నీచమ్మగు దృష్టిఁ జూచె నిలువెల్లనఁగా
పూచిన కింశుకలత యనఁ
దాఁచినతనకోఁకదొరిక్కు త్రాఁ చగుచూడ్కిన్. 83

సరస మెఱుంగదో మధురసమ్ములఁ గ్రోలదొ నాథుఁ డిచ్చినన్
విరసము పుట్టెఁగాక కడు వెంగలియై యిటు సేయవచ్చునే
సరసము పూర్ణకామము నిజప్రభు చిత్తముపోని పాత్రమున్
గిరటులువ్రేత పుణ్యరమఁ గ్రిందులుసేయుటగాదె నాతికిన్. 84

ఏకాంతమ్మున నెన్నొవారములుగా నిమ్మైఁదిరస్కారముల్
చేకొన్నట్టి నృపాలుచిత్తము సహించెంగాక, పెక్కండ్రు, దా

రేకార్థమ్మగు నుత్సవమ్మనెడనే నేపాటియుం గౌరవ
స్వీకారమ్మదిలేక పై నొకటి యొచ్చెంబైన నెట్లోర్చుటల్.

క. తన కది యిష్ట మ్మటు కా
దని తెలుపఁగఁ దలచెనే, నుపాయమె లేదో
తనపతిని సర్వసభ్యుల
మనములతోఁ జిన్నబుచ్చ మరియాదయకే. 86

క. తన యవమతికన్న సభా
జనావమానమ్ము మిగిలి జనపతి నొంపన్
వినిహతవికారుఁ డగుచున్
మనుజేంద్రుం డుత్సవము సమాప్తి యొనర్చెన్ 87

రాణి యొనర్చినట్టి పెనుఠాగతనం బది సభ్యు లెల్లరున్
ప్రాణములట్లుదాల్చి హృదయమ్ముల నియ్యది యెట్లుపుట్టె మా
రాణియు రాజు సర్వజనరంజకు లయ్యుఁ బరస్పరమ్ము నీ
స్థాణుత లీయపర్ణతలు దాల్చుట కేమికతంబు పుట్టెనో. 88

గిరటులు వైవఁగా దొరలుగిన్నియ ప్రోగిన ప్రోఁత లవ్వడా
వరసతి జీవితమ్మున నప్రశుతు లాడినచంద మయ్యె నా
నరపతి చిత్తమాధురి యనంగ రస మ్మొఁకు లెంత దొర్లియున్
బటియలుగాని గిన్నియను బోయని దయ్యె మహాద్భుతమ్ముగన్

ఎప్పుడు నిట్టులేయగునొ యిప్పుడ పుట్టెనొ యిన్నినాళ్లుగా
నెప్పుడు నెచ్చట న్వినని దిప్పటి కిప్పుడు పుట్టనేర్చునే

చొప్పడనట్టి కార్య మది శోభనముల్ ఘటియింపవచ్చునే
యెప్పటి మంగళమ్ము లివి యీ యశుభమ్ము నడంపనేరవే.

కలశమ్మున్ గిరవాటువైవ నృపునాకారమ్ము లక్షించితే
తెలియన్ రానిది దీర్ఘదీర్ఘతరమై దీపించె నాకన్నులన్
కలుషంబైన వ్యథాభరమ్మది మహాకాళిండు క్ష్వేళమ్మటుల్
చులుకించెం బళి కాని యయ్యది జగత్క్షోభంబు గావింపదే.

కనుకని సభ్యు లిట్లు చపలధ్వనిరీతులవోని భావముల్
మునికిన దారుదార మనముల్ సరిపుచ్చుచు భిద్రగూహనన్
ఘనశపథమ్ములం గొనుచుఁ గాంతలు దాము ను రాజదంపతుల్
మనవలె నెల్లకాలము సమగ్రశుభమ్ముల నంచు నెంచుచున్.

వ. ఎరవుపడిన యంతరంగమ్ములం గుదురువఱిచికొని యా రాజదంపతుల సమీపించి యధోచితమ్ముగా వీడ్కొనిచనిరి. రాజహృదయసన్నిహితు లగుకొందఱు దేవదేవి యపరాధంబు మాయదియకాఁ దలంచి క్షమింప వేడెద మనుభంగి చూపులం దొరయ నమ్మహీపతికి నమస్కరించి యతనియా మంత్రణంబు వడసిచనిరి. కొందఱు కామినులు బహుళా మహాదేవిచే ననిపించుకొని దేవి! ఇటు సేయఁదగునా యనునట్లు నిప్పటికి మించినది లేదిఁకనైనను బ్రకృతిమధురుం డగు మహారాజు ననునయింపు మనునట్లును జూచి వెడలిరి. అందొక సోమిదమ్మ బిడ్డా! గట్టుపట్టియగు పార్వతి బాహులేయుం గనినట్లు చక్కని కొడుకుం గనుమని

దీవించి చనియె. అవశ్యంభావులగు నాపుణ్యసీమంతినీ
వచనంబులు రాజహృదయంబునం గించి దుష్టంబులగు
వెన్నెలలు గాసె. ఇంతసేసియు నిర్వికారహృదయయై
తత్కాలోచితకృత్యంబుల నిర్వహించురాణి మనశ్శిలా
ఫలకంబున నవిరేఖామాత్రంబులై కతిపయహృదయసఖీ
క్ష్వేయ హాసచంద్రికోదయనిమిత్తంబులయ్యె. ఇప్పగిది నుత్స
వంబులు పరిసమాప్తంబు లగుటయు నాఁటిరేయి చింతా
పరవశుం డగు నాన్నృపాలుండు. 93

సతియగుఁగాక నన్నను బ్రజం బరిభావన సేసెఁగాన నీ
యతివ మహోగ్రదుర్గమమహాటవుల న్విడియింతుఁగాక త
న్మతిఁ బరిశుద్ధి గల్గి యిటఁ దా నయివచ్చినవచ్చుఁగాక దు
ష్కృతికిని శిక్ష సేయవలదే యని యెంచి విచారధీరుఁడై 4

వ. తనహృదయమ్మువోని యొక్కపరిచారకుం బిలిచి యాన
తిచ్చుటయు, వాఁడును గొండొకచింతించియు నొండు
మాటాడనేరక తనస్వామిభక్తి చరితార్థంబుగా, నిదియు
నొక్కశుభం బాపాదించుఁగావుత మని నిశ్చయించి
యతినిగూఢమ్ముగా సముచితప్రకారమ్మున నవ్వార్త
రాణికి నెఱిఁగించిన నామెయు నిర్వికారచిత్తమ్మున మహా
ప్రసాద మ్మని యప్పుడ యప్పరిచారకునితో నరణ్యమ్మున
కరిగె. వాఁడును గ్రమ్మఱివచ్చి నిజకృత్యమ్ము ప్రభువున
కెఱుకపఱిచె నంతట. 95

## సాలపోతకుండు

క. వనదేవతయో యనఁగా
వనతలము వెలుంగఁజేయు బహుళాకారూప
మ్మును గనుచు సాలపోతకుఁ
డనంగ భుజగేంద్రుఁ డొక డనంగవిశృంఖలుఁడై 96

భువికిం డిగ్గినచంద్రముఖకళయనం బొల్పారుచున్ జంగమ
త్వవిశేషోజ్జ్వలదోషధీలత యనం బట్టై యనాఘ్రాతపు
ష్పవిధాశోభ, విలోభనాకృతి స్థిరాసంచారివిద్యున్మహో
త్సవ మీబాలిక రత్నదీపిక శిరోధార్యమ్ము గాకుండునే. 97

కామవికారదూరములుగాఁ గనిపించియు గాంతచూపులు
ద్దామమనోరథావళి యతర్పణదర్పణశోభ లూనె, నీ
కామిని దానుగా వలవఁ గాదను పూరుషుఁడుం జనించెనో
కామినిచిత్తముం దెలియఁగానని మూఢత కన్నుగప్పెనో. 98

క. ఒకనిర్బంధము సడలిన
ప్రకార మీకాంతకనుల స్పష్టంబయ్యెన్
తెకతేరఁగ దొరకిన యీ
వికచసరోజాక్షి హృదయవిధ మెట్టిదియో. 99

మణిమంత్రౌషధయంత్రతంత్రమహిమం బండించి మద్భాగ్యమీ
యణుమధ్య న్మదధీనఁ జేసికొనియే నాపుష్పచాపస్ఫురత్

గుణనిక్వాణ విధా విభావి రమణీకూహూకుహూకార త
న్మణితస్వాన విలీన చిత్తమున బ్రహ్మాన్ జేరఁగా నేరనే. 100

నాకమునందు మర్త్యమునయందును నాదగు నాగలోకమం
దీకమనీయకాంతి కలదే యిదిచూడఁ ద్రిలోకసుందరీ
శ్రీకిని డీక యిన్నెలఁతచిత్తమెఱుంగుచు దీని నేలికోఁ
జేకొనగల్గెనే నవమసిద్ధియు నై నవసిద్ధులుండవే. 101

క. అని పసిపట్టినయట్లుగ
వనిత మనోవృత్తు లెఱుఁగఁ బాఱినమదిలో
మనసిజుఁడను బ్రహ్మము దనుఁ
గని పనిచిన కార్యకరణ కౌశలమొలయన్ 102

కనియెదఁగాక యియ్యతివ కాంతవపుస్సుషమావిశేషమున్
వినెదనె దీనియీమధురవిభ్రమభాషల నొక్కమాఱుగన్
కన విన నిట్టిరూపమునఁ గాదని యెంచెనొ కామరూపశ
క్తిని మనుజేంద్రసూనుఁడయి ధిక్కృతకామవిలాససంపదన్.

క. డగ్గఱిన బహుళహృదయము
బెగ్గడిలన్ వీడెవండు విచ్చేసెడి న
న్నొగ్గియు నుత్తమనరపతి
డగ్గఱఁ గ్రమ్మఱఁగ నీవిడంబనఁ గనెనో. 104

అని పరికించి చూచి యిదియట్టులుగా దివె వీనిచూపులన్
నన్ను మున్ను నెన్నఁడుంగనని నవ్యత తోఁచెడి వక్త్రపద్ధతుల్

వినివినముల్ ఘటిల్లి, కనువేదుఱులున్, గతివక్రిమమ్ములున్
జనపతియట్లగాక సహజమ్ములు వీసియెడం బొసంగెడిన్. 105

చీమచిటుక్కుమన్న వెఱ చెందినయట్టులు కన్నులింతలై
యీమహితుండు వచ్చెడు, మదేకనిబద్ధము చూపుగాఁగ దా
నే మనునో వినందగునె, యేమనిన న్వినరాక తప్పనే
ఈమెయి నేకతమ్మయిన యింతులు నిట్లు చరింపవచ్చునే. 106

నామది నెన్నఁడుం గనని నవ్యవిచారము పుట్టెనేఁడు. నా
స్వామిమనమ్ము నిత్యము ప్రసన్నముగాదొకో యేమి పాపమో
యీమతి నిత్య మవ్విభుని నెంచుచుఁ దత్ప్రణయప్రబంధ వి
ద్యామధు వాననేరదు, దురత్యయఘోరవికారబద్ధమై. 107

చెప్పఁగనైతి నింతకిది చేడియకేనియుఁ జెప్పనేర్చినన్
తప్పిద మింతలింతలయి, దారుణభూముల డింపనేర్చునే
చెప్పుటయెట్టు లివ్విధము చెప్పమియెట్టు లటన్న చర్చయే
గొప్పఁదనమ్ముఁ దాల్చి తుదకుం బరిభూతి యొనర్చెసర్వమున్.

అవమతి సేతగాదె, పతి నమ్మియుఁబల్కుట లంచునెంచి, యీ
యవమతి సేసియున్, విభుమహత్త్వము, విశ్వము నొక్కరీతిగా
నవనముసేయ, నివ్విధము నర్హత చెందిన, నన్ను నెవ్వరువ్
గవియఁగజూచుటల్, శలభకాండములగ్గుల దూఁకఁజూచుటల్

నిచ్చలు పండువెన్నెలల, నించెడుచందురు డాయలేదు, గా
కెచ్చటనుం గుముద్వతి సహించునె భాస్కరువేడిచూపులన్

నచ్చదుగాక డగ్గఱిన నాథుఁగనుంగొన దూరభూములన్
హెచ్చెడి సంభ్రమం బకట యీతనిరాకడ నేమి పుట్టునో 110

క. అని పెక్కు-గఁ బతిభావన
లొనరిన యాబహుళమనము నొప్పులు గనమిన్
తనసొమ్మకాఁగఁ దలఁచుచుఁ
గనువినుకులతేఁడు లలన కన్నులఁగనుచున్. 111

క. వనజాక్షి యెవరిదానవొ
వనముల నేమేమి వలచి వచ్చితివో నా
మనమిది మహాద్భుతమ్మున
మునిగెను నినుఁజూచి భువనమోహనమూర్తీ. 112

క. నకనకలాడెడికొనున
నకనకవడె నీదుమేనినవకమ్మను దే
నికినై యింత కృశించెదొ
వికచాంబుజనేత్ర తెలుపవే దయతోడన్. 1 3

చూపులలోన నర్థమును జూడఁగ నేర్తు వినంగ నేర్తు, నీ
చూపితుత్రిప్పినం దెలియఁజుమ్ము మదుక్తిని సత్యమెల్ల, నీ
చూపులవక్రిమమ్ములకు సుందరభావము గూర్పనేర్తు, నే
లా పలుమాటలాడఁగ నెలంతల వేణుల కేను బద్ధుఁడన్. 114

అంగన నిన్నుఁ జూచి హృదయమ్ము కరంగెడు నిట్టిరూపమై
యెంగిలికానిదున్నె యిదియిట్లుగఁ గాదని చెప్పు మీవు నీ

యింగిత మేనెఱింగి యాదియెల్ల నొనర్చెద నీదు మేనిసం
వంగులవాసనల్ మనసుపట్టకయున్నవి నిల్వరింపఁగన్. 115

క. ఎంతటి భావము సేసియు
నింతన పసిపట్టనేర్తు సేసతులేసన్
పంతములుదీఱ నను బల
వంతమ్ముగఁ దాఁ దాఁకపట్టను సుమ్మా, 116

కాంతలనేత్రపద్మములఁ గాసిలఁజేయఁడు చంద్రుఁ డెన్నఁడున్
చెంతకురాఁడు గాలి యటుచేరఁగ లేవు శుకీపికాళి, యే
ప్రాంతములందు నెంతవిరహాత్ములనైన, ననున్, స్మరింప, నీ
కింత వచింపనేల నను నేలినయప్పుడ నీ వెఱుంగవే. 117

వ. నా తెఱం గెఱింగించితిం గాని నీవు నన్నేలుమహాభాగ్యంబు దొరకొన్న నొక్కనిమిసంబేని నన్ను విడువంగ నేర్తువే యదియునుంగాక

కన్నులువీను లొక్కటియగాఁ గననేర్తు వినంగనేర్తు, నీ
చెన్నులు ముద్దుపల్కులును సిద్ధము కాకది, చిత్ర మిద్ది, నీ
చెన్నుల నెన్నచోఁ జెనకి సిద్ధరసమ్ముల నానువేళలన్
కన్నులఁజూడవే మొగమొగమ్ముల నాల్కలు రెండురెండగున్.

క. అనిన భుజగేంద్రు పలుకుల
నొనరిన యర్థములు తెలిసియును దెలియనిదై

కినుకను దాల్చియుఁ దాల్పక
యును సతి, కడు వెచ్చవెచ్చ నూర్పులు విడిచెన్. 120

ఏ నై పోవ నృపాలుసన్నిధికి నాయీతప్పు మన్నింపఁడో
తానై పొమ్మన, నేను జోఁదగవొకో, తత్సన్నిధానంబునం
దీ నావృత్తము పూర్వరూపమగునో,యెన్నాళ్లొదుస్స్వప్నముల్
తానై వచ్చుట కల్గునో నృపతి చింతంబాసి రప్పించునో, 221

క. అని తలఁచుబహుళహృదయముఁ
దనువుచు దపియించు తీవ్రితాపాగ్నికిఁ గ
ట్టనుఁగుంజెలులయి నులివె
చ్చని నిట్టూరుపులపొగలు చనుదెంచుటయున్. 122

క. ఘన విషవహ్నిజ్వాలా
వినిహతు లవి జీర్ణపడిన విషధరపతియున్
వెనువెనుక కొంది౯గె నాసతి
విన్నిద నిశ్శ్వాసపవన భీతుండగుచున్ 123

స్వాంతము జంకియున్ భుజగజాల్మెఁడ సహ్యపరాభవమ్మెనన్
వింతగఁ దన్నుఁదాఁ దలఁచువేళల నొప్పమియేమిపుట్టెనో
ఎంతటివైననేమి తమయిచ్చలమాఱెడి కామరూపముల్
వంతలఁ బెట్టవే సహజభావము డాగునె సత్పరీక్షలన్ 124

పలుకదు నవ్వదున్ గనదు పల్కులకుం బదులీయ నెంచదీ
లలన మనంబునం గల చలంబదియెట్టిదొ ఊఁతఁజేసెనో

నలువయె దీనిచిత్తమును నాదగునాలుక లింతసోఁకినన్
శిలలు గరంగవే తెలియఁజెప్పఁటయెట్టులు మన్మహాత్త్వముల్.

వనితలు పుత్రవాంఛమెయి వారక గొల్తురు నాగజాతి, నీ
వనితను నేను వేడుపొరపాటున గాదొకొ గాల్త్రిమింగు న
న్నను, నులిగాలియూరుపులనొవ్వఁగఁజేయఁదలంచెనోరయీ
చెనఁటికి బుద్ధిచెప్పుటకుఁ జేయఁగరానిది కార్యమున్నదే. 126

క. అని సహజమైన క్రౌర్య
మ్మున నతఁ డపు డటకువచ్చు పురుషార్థము సా
ధనకుం దగునిది తగదను
వినిశ్చయ మ్మొకటిలేక పెరిగిన వేళన్. 127

నాలుక లగ్నులం గురిసినన్ బ్రభవించె ననేకవిధామహోఘణా
జాలము లబ్ధివీచులయి సాగరఘోషము లైన బుస్సలన్
వాలము త్రొక్కినిల్చి వరభాగమున న్మినుముట్ట నూఁగుచు
త్తాలము దేహమున్, ధరణిఁదాఁకఁగ వంచుచు వంచియెత్తుచున్

చుట్టలుచుట్టి పై నిలిచి చూచుచు నాసతిఁ జుట్టి వచ్చుచున్
పట్టఁగ డాయుచున్, దొలఁగఁ బాయుచు గ్రమ్మఱఁగూడుచుం
గొట్టుచు, జిన్నపెద్దలగు, కుంచితవిస్తృతదేహభంగులన్ [బుసల్
గట్టెదురై భయమ్ము లొలుకం గనుపట్టుచు నిట్టటూఁగుచున్

పట్టఁగ నేరఁ డాసతివరిభావము, వాని మనోనురాగమో
నెట్టన, భీతయైన సతి నీవె శరణ్యుఁ డవంచుఁ జేరఁ జే

పట్టి యనుగ్రహింప, మఱువం దరమౌనొకో యాభిభీషికల్
పుట్టకపుట్టి యెన్నిచదువుల్ ప్రకటించెడి భోగి యిమ్మెయిన్.

పతి నింతేనియు లక్ష్యపెట్టని మహాపాపంబు, వెన్నాడుటల్
సతికిం దోఁచె, మహోగ్రపన్నగఫణాజాగ్రద్విషాగ్నిచ్ఛటల్
పతి కోపాగ్నులొ కాక నన్ను వెఱపింపంజాలునే యంచు, నా
కితర మ్మేటికి, నేఁటికీతనువు తా నేమైన నేమయ్యెడిన్. 131

క. పెక్కులగు గతులఁ దిరుగుచు
మక్కువఁ బెన్నిధినిగాచుమాదిరి నన్నున్
జిక్కులు వెట్టెడి సర్పం
బిక్కడ కక్కడకు నేఁగ కేకవిధమునన్. 132

క. ప్రతినిమిష మొక్కయుగముగ
బ్రతుకుట దుర్భరముగాదె; పతిఁ బ్రేమింపం
జతురత గలుగని పుట్టువు
కృతార్థమగుఁగాక కలుగు నీ జన్మమునన్. 133

క. అని నిశ్చయమ్ము సలిపెడి
వనితామణి యెడఁద వృద్ధభామినిపలుకుల్
వినిచినటులయిన, నవునవు
ననూనమాఫలము కలుగునా, యీజనికిన్. 134

కఱవగ నేరదయ్యె ననుఁ గాలభుజంగము నిట్టిపాపినిం
గఱవఁగరా దటంచు నొకో, కామమున న్ననుబట్టియార్పనో

యెఱుఁగుదుగాక తా నిపుడ, యించుక కోపము తెచ్చె నేనియున్
గఱవఁగ నేరదే యనుచుఁ గామినియుం దలపోయుచున్నెడన్.

చటులమహోగ్రకోపమున సర్పవిభుం డట బుస్సకొట్టినన్
పెటిలిపడె న్నగాగ్రమునఁ బిట్టలు నవ్విషవహ్నిలోపలన్
చిటిలిపడె న్నగమ్ములును జెచ్చెఱ నవ్విష వేగధూతముల్
తటుకునదూఱె నాబహుళ తానయి యవ్విషవహ్నిజిహ్వలన్.

పుటమిడినట్టి బంగరువుపోలిన యాసతి మెచ్చి వేలుపుల్
తటుకున బారిజాతములు ధారలుగా గురిపించి రామెపై
చటులతరమ్ము నాతరుణిసాహసముం గని విభ్రమించుచున్
చటులవిషాగ్ని లోనడఁగ సర్పవిభుం డదియెల్లఁజూచుచున్.

క. సుర లిటు లనుగ్రహించిరొ
తరుణిమహత్త్వమ్మొ నాదుదర్పము సెడెనో
ఉరువిషవహ్నులు నీసతి
శరీరమున కయ్యె నేఁడు జలజరజమ్ముల్. 138

అరుదులుగొల్పు నీయతివ నక్కట లోఁగొన నెట్లువచ్చు, నీ
తరుణి స్పృశింపనున్, మదికి ధైర్యముచాలనిదయ్యె నేఁడు నేఁ
జిరముగ దీనిఁగొల్వ దయసేయదె, పై నొకనాఁడు నేని నే
శరణిని గొంచుఁబోయెదనుగాక సతిన్విడనాడనోర్తు నే. 139

## అ ప హ ర ణ ము

వ. అని యప్రసన్నయగు మంత్రదేవతా ప్రసాదంబు వడయఁ దన్మంత్రధ్యానపురశ్చరణనిశ్చలుం డగు భక్తుండునుం బోలె గదలక, మెదలక వీతసంరంభుండై యున్న, యబ్భుజంగమ పతి నవలోకించి, తన తనూస్పర్శంబున, విషాగ్నులు శమించుట యెఱుంగ నేరని యాపతివ్రతాతిలకంబు, సురలు గురిసిన సుమవర్షంబులు, నాగేంద్రకల్పితంబులుగాఁ దలఁచుచు, నాతనియప్పటి నిశ్చలత్వంబునకుఁ గారణాంతరంబుల నిరూపించుచుఁ దానయి వానిశిరమ్ము పట్టి కఱపించుకొని మరణించు నిశ్చయమ్మునం, డగ్గఱి విప్పాఱుచేతుల నప్పాప జేనిఁ బట్టనుంకించిన.

క. తరుణికరమ్ముల గరుడుని
చరణనఖమ్ములును, దుండనదృశమ్ములు, సుం
దర రేఖ లఖిలదర్వీ
కరభయదము లయ్యహీంద్రు కన్నులఁబడినన్. 140

క. చఱచఱఁబఱుగిడఁ దొడఁగినఁ
జరణమ్ములు సాఁగవయ్యె సతి వెంటఁబడన్
బఱుగిడుచు విపులమాయా
స్ఫురణమ్మున మెఱసి యొక్కచో నెలమి మెయిన్. 141

వ. జగత్ప్రాణాంతకుండగు నాసాలపోతకుండు మాయావనిత నొకానొకతసృజించి, తత్సాహాయ్యంబున నాబహుళా

మహాదేవిం బాతాళంబునకుం గొనిపోయి, యొక్కరహస్య
మందిరంబున నయ్యమ భద్రపఱచి, శుద్ధాంతమ్మునకుం
జనియె. ఆ దేవియు మాయావనితా కరస్పర్శంబున, నొడ
లెఱుంగక, శయ్యాతలంబున, నిద్రాముద్రిత యట్టులుండె.
ఆసమయంబున నిజజనకదుర్లలిత కథా మర్షిణి యగు నంద
యను నాగేంద్రకన్యక.

ఎట్టు లెఱింగెనో తెలియ దింతలనంతల గూఢవృత్తి, నా
పట్టున కేఁగి మంత్రములపట్టున మాయ నడంగఁ జేసి, యీ
పిట్టిది యొందునుంగలదె, యీాయమకున్ సుతనౌచు నేలకో
పుట్టగనైతి మర్త్యమునఁ బుట్టినకాంతలు నిట్టు లుందు రే.

వ. వనితల నయితమ్ము వలపించు నీయమ సౌందర్యంబునం
దగిలి మాతండ్రి మాజనని నొప్పరికించుట ధ్రువమ్ము
కాదె. అట్లుకాకుండ వలయు. అంతకంటె నీమాతృసంరక్ష
ణమ్ముత్తమకర్తవ్యమ్మని నిశ్చయించి యంతకు విగళిత
మాయాబంధమ్మున నల్లనం దెప్పరిల్లి తన్నుంగాంచి చకిత
యగు నాసాధ్విని, జననీనిర్విశేషమ్ముగాఁ బూజించి బహు
విధమధురప్రసంగమ్ముల విశ్వాసమ్ము పుట్టించి, సత్వరంబ
నిగూఢవృత్తిం గొండొకరహస్యాగారంబునకుం జేర్చి
యామెవలనఁ గడచినవృత్తం బెఱింగి యుత్తమమహీపతి
చరితంబు నర్షించుచు దండ్రి దుర్లలితమ్మునకు
గర్హించుచు నాసతి పాతివ్రత్యంబునకు వెఱఁగుపడుచు

దల్లీ! యిప్పటినీచిత్తంబుభంగిఁ బరికింప నవశ్యంబుగ నుత్తమమహీపాలుండు నిన్నుం బరిగ్రహింపఁగలఁ డని తోఁచుచున్నయది; యావజ్జీవకఠోర బ్రహ్మచారిణి నగు నాయంతఃపురంబు నాయనుమతి లేక నాతండ్రికేనియుం జొరనశక్యంబు. ఇందెవ్వరిమాయలు పనిసేయ నేరవు ఇట నీవు నిశ్చింతమ్ముగ నుండుము. నేనెల్ల వేళల నిన్నుఁ గొలిచి యుండెద నని యోదార్చె. ఆబహుళయు నాతండ్రి కూఁతుల మనఃప్రకారంబుల కాశ్చర్యంబు నంది నందం గని, తల్లీ! నీయిట్టి గుణరూపసంపదకుం బ్రహ్మచర్యం బేమినిమిత్తంబున వలసె ననియడిగిన నాకుమారి యిట్లు నియె. మావంశంబునం బెద్దయగు వాసుకిచెలియలు జరత్కారు వనునామె యొక్క విశేషఫలంబు నిమిత్తంబుగా, నేఁటికిని బ్రహ్మచారిణియై యున్నది. అదినిమిత్తంబుగా మావంశంబునం, దరంబున కొక్కొక్క రీనియమంబు పాటింప వలయు. నేనిదిస్వీకరించితి నని పలికి, కావుననే యిది మాతండ్రికిం గూడ దుష్ప్రవేశమ్మని హెచ్చరించి, యాగ కేనియు నామెయీగడ యెఱుంగరాని యట్టికట్టుదిట్టంబు లలవరించె. ఇట్లు నందామధుర విస్రంభ సంవాదంబులం దవిలి కాలమ్ముగడపుచు నొక్కనాఁ డమ్మహాదేవి యుత్తమమహీపతిం దలంచు చిత్తమ్మున. 143

# పశ్చాత్తాపము

ఉన్నది సర్వమున్ సకలముండియు లేనిది యయ్యెనాకు నీ
సన్నుతసాహచర్య మవశమ్ముగ దూరములౌట నేఁడు నా
యున్నతియెల్ల నీవొసఁగియున్నది నేనయి నీకుఁ జేయుఁగా
నున్నది యిమ్మహోగ్రవిరహోన్నతిదక్క మఱొక్కటున్నదే.

చనియె వసంత మమ్మెయిని జన్నది గ్రీష్మముగూడ నేఁడు నీ
చనుటలు నిక్కమో మఱల సత్వరతం బఱతెంచుచుండునో
చనఁగనె లేదొ నేఁదెలియజాలన యన్నియు నొక్కరీతిగా
మనమునఁదోఁచితోఁచి యనుమానముగొల్పెడి నేదియేనియో.

నదులు నిరంతరమ్ముఁ దమనాథునికై నిలువెల్ల నీరుగా
హృదయము మ్రోఁతలెల్ల ధ్వనియింప స్రవించెడి నౌర యిట్లు తు
మ్మెద యిది జంటగట్టినతమిం బ్రియుఁ డంటక పూవుదేనె ము
ట్టదు నటె యింతయుం గని వెడంగుఁదనమ్మిది యెట్లు
సైచుటల్ 14

అర్థము నీవు నిన్ దెలుపునట్టిది నాపని నిక్కమిట్టులై
యర్థము నన్నుగాఁ దెలుపనైనది నాటిది నాట్యపున్ రహ
స్యార్థ మెఱింగి నిల్పఁగ సమర్థము చిత్తము కాని దాచు నా
వ్యర్థత నాకుఁగాఁ దెలుపుటయ్యెను నేఁటివియోగవేదనల్.

ఎఱిఁగియె కాక యేనెఱుఁగకేనియు నిన్నె కొల్చియుండుటే
నెఱిఁగియెఱింగి నన్నును గ్రహింపఁగ నీవయి వచ్చువేళలన్

మఱచుట లయ్యె నెంతటిప్రమాదము దీని సహించు టెట్టులీ
మఱకువ లెల్లఁ బోనడఁచుమార్గ మెఱుంగ నెఱుంగఁ జేయవే. 148

ప్రకృతిని సర్వజీవులు పరస్పరరాగరసప్రపూర్ణ తాఁ
వికలమనోజ్ఞతాప్రణయవీథుల నొక్కట సంచరింప నా
ప్రకృతి యదెట్టిదో యెఱుఁగరాదు ప్రతీక్షితమాఫలమ్ము వా
రక దయసేయువేళలఁ బరాఙ్ముఖియై పిదపం దపించెడిన్. 149

దినదినము న్నిదాఘరవి తీవ్రకరమ్ముల నొచ్చివిచ్చి పో
యినహృదయమ్ము నీయవని నెంతయు జల్లఁగ జేయనేర్చె నీ
ఘనుఁడు కృపారసమ్ము వెలిగ్రక్కు మెఱుంగు వెలుంగుచూపులన్
దన కిది ధర్మమా హృదయతాపము దీర్పక నన్ దహించెడిన్.

తనువునఁ జోఁకి కొంతపరితాపముఁ దీర్చినయట్టు లయ్యె నీ
ఘనరసనవ్యసంగమునఁ గమ్మన వెచ్చనయైన యావిరుల్
నను నిటు లూరడించెడియిలాసతి యూర్పులొ ప్రాణనాథు వె
చ్చని కనునీటియూర్పుల ప్రసంగతు లిమ్మెయి దీర్పవచ్చునో.

ఎదురుగ నున్నవేళఁ దను నెంతప్రియంపడి వేడువేళలన్
హృదయమువోని యాసవము లిచ్చి కరంచెడివేళ లందుఁ దా
నిది చదు రంచు నేర్పుఱుప నింతకు నేరని చిత్తమింతటన్
బదునులుతీఱునో హృదయవల్లభుఁ గన్గొని సంభ్రమించునో.

గాలులఁగట్టు మేడలనఁ గాఁ బఱతెంచెడి యిట్టిభావముల్
చాలవు ప్రాణనాథుని వశంవదుఁ జేసి వసింపఁ జేయఁగా

చాలునుగాక యీబహుళసంతమసాకృతి నార్పఁజేయు ను
య్యాలలుప్రాణవాయువుల యాకృతిఁ దాల్చి చరింప నేర్చుచో

జలదవిలీనమూర్తి నయి సాగుదునో జలదప్రచోదనా
లలితవిధిజ్ఞ మైన యనిలమ్మయి పోదునొ వీని కాత్మగా
నొలయు నభమ్మునై చనెదనో పతిసన్నిధిఁ జేరఁగన్న, న
య్యలఘుఁడు నియ్యుదీర్ఘబహుళాకృతి నంటునొ యంట నెంచఁడో

అనుచుఁ గృతాపరాధమననాధికజృంభితదుఃఖవీచికా
వినిమయమూర్తి యీబహుళ వెక్కెనకంఠము నెల్లెఱింగెనో
మునిజనధర్మ నందయు సముద్భవదర్కమరీచివీచినై
చెనకుచు నేను లేననియొ చిత్తము నిట్లుడికింతువే చెలీ, 155

వినుము మహాద్భుతం బొకటి వింటినిగంటిని నేఁడు నేను గా
వినిచెద నీకు నా ప్రియము వేగమ నీవును నీప్రియుండు ని
వ్వనజమరాళదంపతులవైభవ మందెదునట్టివార్త యీ
తనువుఁ దొఱంగుబుద్ధి నిఁకఁ దాల్పకు చిత్తమునందొకప్పుడున్

క. అనినఁ గుతూహలవిద్యు
ద్వినిద్రనేత్రముల మనసుపిడిసినయటు లే
మనియెదవో యనుము నెచ్చెలి
వినియెద నీపలుకుకన్నఁ బ్రియమును గలదే. 157

వ. అని యాదేవి నందాప్రతివచనములకు సముత్కంఠిత యగు
నవసరంబున. 158

క. సద్యః ఫలదానశ్రీ
విద్యాపారాయణపరివీణ మునిమనః
ప్రద్యోతన బహుళాగమ
విద్యారణ్యప్రకాశవిభవ కటాక్షా. 159

స్రగ్విణి. మంగళాంధ్రీయశో మాధురీలాసికా
రంగభూమీ స్ఫురద్రాజధానీమనో
నంగరూపా ! విరూపాక్షలింగా ! కృపో
త్తుంగవీక్షాఝురీ తుంగభద్రానదీ. 160

విద్యారణ్యపునఃపునశ్చరణ గుర్వీభూతగర్వస్స్పృహా
భిద్యద్దండ మదేభడిండిమ మహావిద్వద్ధిరణ్యాన్నభి
త్సద్య శ్శ్రీనరసింహ జృంభిత కటాక్ష బ్రహ్మ నిర్వర్తకావి
త్సద్యానోత్సవ సార్వభౌమవిజయ స్తోత్రార్థ భావాకృతీ. 161

క. ముదిగొండ వంశజలధి కు
ముదబాంధవ నిరత శంభు పూజావ్రత సం
పదధిక శరభారాధ్య వి
శదహృదయ విహారపరమ సామిశరీరా. 162

క. అనిశ శివధ్యానపరా
యణ గురువర మల్లికార్జునారాధ్య కుమా
ర నిగదితో త్తమమనుభవ
మున నివి ప్రథమానసంబు పొలుచు శివకృపన్. 163

శివమ్

శ్రీరస్తు

# ఉత్తమ మను సంభవము

## ద్వితీయాననము

క. శ్రీ నూర సుకవి కవితా
భాసుర సౌవర లతాంత పరిమళ లహరీ
వాసితకపర్ద గిరిజా
సానూయ కటాక్ష లక్షితార్ధాంగ శివా!

వ. దేవా! అవధరింపు మానందాకుమారి యారాణి కిట్లనియె.

క. అది చాల గలదు చెప్పెద
మదిష్టసఖి సావధానమతివై విను నీ
హృదయవిభు వర్తనమ్ముల
పదునులు దా మెంత వఱకు వచ్చెనో తెలియన్. 3

వ. ఇందుల కుపశ్రుతిగా నొకానొక కథ చెప్పెద నీవు కాదనక
యాలింపు మే నెప్పటియట్లు. 4

### జ నా వ లి

అరుగుచుఁ గామరూప గమనాతిశయమ్మున నిందునందు భా
సుర మగు నొక్కపట్టణముఁ జూచితి నత్యమరావతీపురీ
సురుచిర భాగ్యముల్ సకలసుందరముల్ ఘనహేమకూట భా
స్వర సువిశాల శైల విలసత్కటకమ్ము నిలాతలమ్మునన్ 5

సావరపట్టణమ్మునకు జాహ్నవిపోలిక సంతరించి నా
గావతిలోన భోగవతికై వడి మించి యతిద్వయీకథా
శ్రీ విలసిల్లు నాపురికి జీవనమై నది యొండు పొల్చు నా
నావిధ తుంగభద్ర గమనప్రియమూర్తి సదానుకూలమై. 6

బహువిధ మహా ప్రవాహములఁ బత్తనవీథులఁ బ్రక్క
సాఁగుచున్
గృహగృహమున్ సమృద్ధజలమిచ్చుచుఁ బంటలతల్లియౌచు ని
స్పృహులకునైత మందు నివసింపఁగఁ గోర్కులు పుట్టఁ
జేయుచున్
మహిసతి జన్మసిద్ధ మగుమంగళసూత్ర మనంగఁ బొల్చుచున్.

ఆనది వింతనింపెసఁగు నాపుర మన్నశరీరధారికిన్
మానిత రక్తనాళముల మాదిరియై బహుసారణీచ్ఛలాఁ
నూన వితీర్ణ జీవన మనోహరమూర్తి ధరించి సార్వకా
లీన నిజప్రవాహ సఫలీకృత సస్య సమస్తతాకృతిన్ 8

ఆ పురలక్ష్మిఁ దాల్చు గిరియంగమునం బ్రభవించు సాత్త్వికీ
శ్రీ ప్రథమావతారములు స్వేదజలమ్ములౌ జాతిగుండియల్
జేపి స్రవింపఁజేసెడి పురీరమణీయ శరీరకాంతులో
చూపఁజనిర్ణయమ్ములకుఁ జొప్పడ నేరని వాప్రవాహముల్. 9

క. ఎంతటి నిసర్గకవినుని
స్వాంతమునను దాగియున్న సరసతలను దా

మింతలు నంతలు నేర్లగు
కెంతయు గనుపట్టు దాని నీక్షించునెడన్. 10

మిన్నులుముట్టు భోగముల మించెడి నాకపురమ్మొ సర్వసం
పన్నత నెల్ల భోగులకుఁ బట్టగు నాగపురమ్మొ తాముగాఁ
దన్నొకమధ్యవర్తిఁగొని దర్పణదృష్టనిజాకృతిస్మృతిన్
జిన్నఁదనమ్ముఁ దాల్చుటలు చెప్పక చెప్పను దత్పురప్రభల్.

క్రిందును మీఁదు గాఁగ బరికించి గణించిన నెన్నిమార్లు వే
ఱొందని మధ్యమస్ఫురణ నున్నతిఁగాంచుట నద్వితీయమ
య్యుం దనసద్వితీయతను నుత్తమరీతి సమప్రధానతన్
బొందుపడంగఁ జేసి పురి పొల్పగు నాదిమభావసంపదన్. 12

క. తను విడువఁ దనకు నొంటరి
తన మగునను భీతిఁ జేసి తాఁ గలిసినచోఁ
దనసిరి ముమ్మడు గగునని
మును వెనుకల దాని విడిచిపో వాపురముల్. 13

సారములైన లోకముల చాలులహద్దులో దీవు లెన్ని వే
ర్వేఱుగఁ జూపుపద్ధతులో వింతగ నాపురిఁ జుట్టివచ్చుఁ బ్రా
కారము లేదు సూర్యతురగ స్ఫుటమండలచార ధోరణీ
స్ఫోరకముల్ చెలంగు నృప సూర్యగృహామరశైల సన్నిధిన్.

క. గృహగృహము పుష్పవనమై
మహీంచర చ్ఛంచలాసమన్విత ఘనమై

యహరహ రభివర్ధితమై
ముహుర్ముహుః కూయమాన పుంస్కోకిలమై. 15

శ్రుతిహిత వేదగానములు సూరికవీంద్ర కలస్వనంబులున్
స్మృతిహిత ధర్మచారములు సింధురఘీంకృతు లశ్వహేషలుం
బ్రతిగృహ మంగళావసర వర్తితనర్తనగానమాధురుల్
సతతములైన యీపురముసంగతి కన్నులు వీనులొక్కటం. 16

గీ. చూఱవెట్టిన నేఁ గడు చోద్యపడిన
మతిని మద్బ్రహ్మచర్య సంగతికిఁ గొంత
తగుల మొనరించె నౌర యున్నిగమభూతి
వింత యిదిగాదె మత్పురావృత్త మరయ. 17

క. రాజస్వాతి యగు నీపురి
రాజెంతటి యుత్తముఁడునో, ప్రజ లెల్లరు న
వ్యాజ మగురాజభక్తి, వి
రాజిల్లెద రింటనింట రాజస్తుతులన్. 18

పరిశీలింపఁగ నొక్కవింత కనఁగా వచ్చెన్ ప్రజల్గుంపులై
పరమోత్సాహముతోడ నుత్సవముల న్వర్తింతు రేకాని, యొ
క్కరుఁడున్, సక్తుఁడుగాఁడు వాన ననఁగాఁగన్పింతు రస్పష్టముల్
చిరనిర్వేద భరప్రసారములు దాల్చెన్, వీరి నేత్రద్యుతుల్ 19

క. జ్ఞాని శిఖామణు లనఁగా
నానావిధ కర్మచయము నడపుచు వీరల్

వానను సక్తులు గారటె
యీనెటి కన వినఁగఁ గలదె యేలోకమునన్. 20

క. కాకున్న నాడుచిత్రము
నాకర్షింపగను జాలుసంతటిదే? యీ
లోకచరిత్రము వీరల
కీకాశల మిడిన రాజఋషభుఁ డెవరోకో. 21

క. అరసెదను గాక యింతకు
నరయన యిది యేపురమ్మొ హర్షితజనవి
స్ఫురితమ్మొ ఒనావతి యనఁ
బరఁగునొ వేఱొండుపేరు వహియించునోకో. 23

బహువిధశిల్పకావ్యము లు బాపురె యీపురిసౌధము ల్గుడుల్
మహితములై పురాజనన మానససంస్కృతి బోధకమ్ములై
బహుతర కౌతుకోజ్జ్వల శుభప్రదదివ్యత రాత్మదర్శన
స్పృహ లవశాత్ములై యచట నెల్లెడఁదాముగఁజూడ నేర్పెడిన్

వ. అని తలంచుచు బహుశ్రీక జనసమాకులం బగుట శ్రీకాకుళంబును నిఖిల ధనధాన్య పరిపూర్ణం బగుట ధాన్యకటకంబును సతి లోకసర్వపుర సంపదధిష్ఠానంబగుటం బ్రతిష్ఠానంబును సకలవిజయ నిదానం బగుట విజయవాటికయు త్రైలోక్యవిజయ సాధోత్సేధంబును రాజమహేంద్ర నివాసయోగ్యంబు నగుట రాజమహేంద్ర పురంబును

బ్రతాప రుద్ర రాజకుల బహుళం బగుట నేకశిలానగరం
బును మహిత గోబృందావనం బగుట బృందావనంబును
భువనవిజయోద్భాసి నిఖిల విద్యానర్తన విశేషంబుల
విద్యానగరంబు ననం దగియున్న యమ్మహాభాగ్యనగరీ
విశేషంబు లనాసక్తం బగుచిత్తంబున నపూర్వవస్తుదర్శన
కుతూహలబహుళనై యయ్యవిశేషంబులు పిలిచినకడలకుం
జూపినతావులకుం జనిచని యెన్నెన్ని ప్రాకారంబులు
నెన్నెన్ని శాఖానగరంబు లెన్నెన్నికక్ష్యాంతరంబు లతిక్ర
మించితినోగాక యిప్పుడు దలంచిన నద్భుతం బావహిల్లెడు
మదీయతిరస్కరిణీవిద్యాప్రభావంబునం జోరశక్యంబులైన
ప్రదేశంబు లెల్లం జొచ్చిచొచ్చి. 24

## రాజదర్శనము

శ్రవణసుఖమ్ములై మధురసమ్ములవాఁకలు సామగానముల్
వివృత నిజాంతరాంతర విలీన జగమ్ములు నాదుచిత్తమున్
దవులుటయుం దదాగమనధన్యపథమ్ములఁ బోయిపోయి రెం
డవ శశివోని రాజఋషి నాలవయగ్నిని గంటి నయ్యెడన్. 25

ఆ ప్రభు వామపార్శ్వమునయం దొకకాంచనసాలభంజికా
దీప్రశుభప్రకార, యువతీభవదుజ్జ్వల శిల్పనైపుణీ
శ్రీ ప్రథమావతార, విధిసృష్టికలాపరసీమరూపధే
యప్రథమానమూర్తి మహితాద్భుతవిభ్రమ మోదధానినై.

కన్నులనాచె నేనెపుడుఁ గన్నవి విన్నవి కానియట్టులై
యన్నలినాక్షి సోయగము లక్కజ పాటొదవించె నాకు, న
య్యున్నతు తెల్లఁ బ్రాణవిభు నొద్దవసించిన పెంపుకల్మినో
యెన్నఁడు నట్లయౌనో యిదమిత్థమటం చిపు డాడనోడెదన్.

నీడయుపోలెఁ బ్రాణపతి నిష్ఠనొసర్చెడి యగ్నిపూజకున్
దోడయి, యీడుజోడగు వధూమధురాధర హాసచంద్రికా
మ్రేడితవహ్నికీలికల, వ్రేల్చును జిత్తమువోని హవ్యమున్
జేసియు మెచ్చఁగా నదిభుజించు హవిర్భుజు బ్రొక్కుకన్నులన్

స్వాహయు, వహ్ని యాసతి నృపాలుఁడునై యదియొక్క లీలఁగా
సోఽహమటంచుఁ బల్కుతొలిసూక్తికి వ్యాఖ్యలచందమందిరో
స్వాహయు వహ్నియా ప్రథమజన్మ వపుస్స్మరణానుభూతి, దా
సోఽహమటంచు నమ్మిథున మర్చల నమ్మొయి నాచరించునో.

ఊహల కందరాని మహిమోన్నతి యయ్యది, దేవిరూప మా
స్వాహకు రాజురూప మటవహ్నికిఁ జిత్తవిమోహనమ్ములై
స్వాహయు నగ్ని యొండొరులు శంకితులై రననొప్పి రాజగ
న్మోహనమూర్తు లామిథునముం గని యెవ్వరు నేమికారిలన్.

సమధిక పుణ్యదర్శన వశంవద చిత్తసమీలనమ్మునన్
రమణిరో నేను ఆప్రతిమ నా నటులెంతకు నిల్చియుంటి నా
క్రమము నెఱుంగ రాజఋషిఁ గన్గొను వేళలు ధర్మఘంటికా
సముదితనాదముల్ చెవులచాయలఁదామయిమ్రోయునంతకున్

గీ. ఒరులదృష్టికిఁ గనరాక యొదిగియున్న
ప్రాణవల్లభతోడి స్వాహావిభునకు
నంజలిఘటించి ప్రార్థించి యధిపుఁ డంత
ధర్మఘంటిక మ్రోయించు తగవుఁదలఁచి 32

## వైశాలి

ఆరయఁ బంచె నొక్కభటు నాతఁడు ధీరవిచారమూర్తియై
ద్వారముడాసిచూచి యరయం గనిపించినయొక్కవిప్రునిన్
గారవ మొప్ప నగ్నిశరణమ్మునఁ గొల్వగు రాజుసన్నిధిన్
దేరఁగఁ జూచి వానిని బ్రతీక్షయొనర్చెడి ఱేఁడు నర్మిలిన్.

క. ఎదురేగి తోడితెచ్చిన
మదిఁగొనె విప్రుండు రాజుమన్నన లెల్లన్
కుదురువడనట్టి హృదయము
చెదరిన కన్నులను దోపఁ జిఱచిఱపడుచున్. 35

ఆతని తీఱుఁజూచి హృదయమ్మున నీతని చందమెట్టిదో
కాతరపడ్డభావము ప్రకాశితమయ్యెడి నాదుపాలనన్
భీతులులేరు నేఁటికిటు వింతలుపుట్టెనొ విప్రునోట నే
నీతతి నేమివిందునొకొ యింతకునంచు నృపుండు నెంచుచున్.

పలుకుము బ్రాహ్మణోత్తమ భవత్పరిపాల్యుఁడు స్వామియాన
నిలిచినవాఁడు ఫీడె మది నిల్పఁగరానివికార మెద్దియో [కుఁ

కలచెడివా_ర్త నీయెడఁ బ్రకాశితమయ్యెడి నింతయేటికిన్
తెలిపి ప్రతిక్రియం జలిపి తీర్చెదుగావుతఁ జి_త్త మన్నచో. 36

ఆతఁడు పల్కె నోయినృప, యాడనిదయ్యెను నాల్కనేఁడు ము
త్తాతలు తాతలుం జనిరి తండ్రులు నేఁగిరివారి వేళలన్
నీతులు నిట్టివింగలవె నీవు మహిన్ సరిదిద్దు వేళలన్
గాతరమయ్యె నీప్రజకుఁ గాక మతేమని చెప్పనేర్చెదన్. 27

ఇంతకు నిన్ను నేమియన నింతయి నాదురదృష్ట మున్నచో
స్వాంతము కొల్ల వోవఁగఁ బ్రశాంతిగ నెట్లు వచింపనేర్తు నీ
యంతటివానియేల్బడి మహాఘము లింతలు పుట్టనేర్చునే
ఎంతటి దుష్టకాల మిపుడేర్పడెఁ బుణ్యతరార్యభూములన్. 38

చెప్పినఁ దప్పు తప్పగును జెప్పకయుండినఁ గానఁ జెప్పెదన్
చెప్పఁగ నెంచి నన్నిటకుఁ జెచ్చెఱఁదెచ్చిన చి_త్తమేలకో
ఇప్పటినిన్నుఁ జూచి యొకయించుక జంకినచందమయ్యె, నేఁ
జెప్పినదాని నీవు నఱసేయక చేయుదు చేయ వన్నటుల్. 39

భాస్కరసన్నిభుండవు నృపాలక నిన్ను నమస్కరుంబలెన్
మస్కరు లెల్లరు న్నతినమస్కరణంబులఁ గొల్చుచుండ, శ్రే
యస్కరముల్ త్వదాజ్ఞలు ధరావనదీక్షము లుల్లసిల్ల, నీ
తస్కరశబ్ద మెట్లు వసుధంజనియించె నెఱుంగనయ్యెదన్. 40

క. శృతియంద తస్కరాణాం
పతయేనమ యంచు శివుని భావించుచు, నీ

క్షితిఁ దస్కరశబ్దార్థము
మతి కింత కెఱుంగరాదు మామనుగడలన్. 41

క. తడబడు సుడిబడుచిత్తము
వెడలెడు నానుడులయందు విశదపడియెనో
పడదో వివక్షిత మ్మని
నుడివెద మన్నింపు నామనోరుజ లధిపా 41

అని యతఁ డిట్టునట్టుగని యగ్నులరాణిని రాజు నాభటున్
ననుగనియుండగ గ్రహింపని మనమ్మయి యోయిప్రజాపతీయెటన్
వినుటకు సైత మోర్వనివి వింతలు చెప్పగనయ్యె సర్వమున్
ధన మెటువోవఁదీర్చెడి మనమ్మెటులోర్చు నిజార్థచౌర్యముం

ముచ్చిలరాని యాత్మగుణముం భజియించు విశుద్ధచిత్తముం
ముచ్చిలు నిందియమ్ములయి పోయిన యద్దమువేయివేళఁబా
టచ్చరు లేమిచెప్పఁ బ్రకటంబుగ మాయిలుసొచ్చి గేహినిన్
ముచ్చిలినారు పెద్దతలువు ల్గడె పెట్టినయట్లయుండఁగం. 44

క. ఎచ్చటకుం గొనిపోయిరొ
యెచ్చటఁ దా నెవరిచేత నేమయ్యెనొకో
చెచ్చెఱ నాసతిఁ గైకొని
వచ్చి మహాయజ్ఞఫలము పడయు మహీశా. 45

ఎప్పటియట్ల యగ్నిగృహ మేమఱ కేనొకకూర్కు జెంది నా
చెప్పినపాఠముం గునననసేసెడి శిష్యులసందడింపు లే

నెప్పఁటియట్ల వించు నట నేర్పడుతప్పుల దిద్దిచెప్పుచున్
జప్పుడులేని నాగృహముచాయల గాంచుచు ఱిచ్చపాటునన్

ఎప్పుడునట్టివేళల శయించియెఱుంగని ధర్మపత్ని నే
నప్పటికప్పుడే పిలువ నందొకమాఱు జవాబురామికిన్
చొప్పడనట్టి చిత్తమునఁ జూతునుగా యటుపోయి లోఁగడెల్
తప్పినద్వార మొక్కటియు దాగనిపింపమి సంభ్రమించుచున్.

వ. మదంతేవాసులంబిలిచి ప్రియత్నవిశేషమ్మున గవాటమ్ము
లెత్తించి లోఁనెల్లం గలయనరసి యెందును నాగేహినిం
బొడగాననేరక పెట్టినవస్తువులెల్లం బెట్టినయట్ల యుండె.
ఒరులెవ్వరు వచ్చిన జాడయు నేర్పడుపరాకున్నయది.
ఇదియెట్టి విచిత్రంబొకో యని మ్రాన్పడినచిత్తమ్మున
నెంతతలంచియు నాకువిద్రోహులగువారల నిరూపింపనేరక
గజేంద్రకబళితం బగుకపిత్థంబునుబోని నాగృహమ్ము వెలు
వడి యశేషపరిజారక్షకుండ వగునిన్నుం దలంచి సత్వరంబ
యిట వచ్చితి. మజ్జాయాపహరణంబున నాయెఱింగిన తెఱం
గెల్ల వివరించితిఁగదా కావున నీవు వైళంబచని నాదార
నాకునొప్పింపు మని యతిదీనాలాపంబులం దన్ను వేఁగిరించు
నమ్మహీసురుం గని యతని కలఁగినడెందంబు నలజడిం
బలుకు నప్పలుకులెల్ల సవిత్కారంబుగా నవధరించి కరుణా
రసార్ద్రహృదయమ్మున నమ్మహీపతి సాదరమ్ముగా. 48

తెచ్చెద నేనవశ్యమును దేవరపత్నిని మ్రుచ్చిలించువా
రెచ్చటనుండి రెవ్వరయి రేనియు దండితులం బొనర్చి నీ
కిచ్చెద నీదుజాయను మహీసురవర్య ధ్రువమ్ముగాఁగ నీ
సచ్చరితమ్ముబల్మికి నసాధ్యము నున్నదె ముజ్జగంబులన్. 49

అడుగకయే క్షమించితి మహాత్మక నావరిపాలనంబునం
దాడిసినతప్పు నింతటిసమున్నతు నిన్నిటు లాశ్రయించి నే
నడుగఁగరాని యర్థమదియాటఁ గడుంగడు సంశయించియే
నడిగెదఁగాక తప్పకిటులాడుట మీరయి చెప్పనేరమిన్. 50

మ్రుచ్చిలినారు సొమ్ములును భూములు గోవులు నంచుఁ జెప్పఁగా
వచ్చినవచ్చుఁగాక తనదారహరించిరి దొంగ లన్నచో
నెచ్చట విశ్వసింతు రెవరిద్దివచించుట యెట్టులంచునన్
నొచ్చి కలంగు నీదగుమనోభరముల్ దెలియంగవచ్చియున్.

ఇచ్చట సంశయింతు సతియెట్టిదొ రూపగుణమ్ము లెట్టివో
ఇచ్చ నెఱుఁగ కేవెదికి యిచ్చుటయెట్టులు నీదుబార్యగా
నెచ్చట నెవ్వరిం దెలిసి యేనెటుదెత్తు ననుగ్రహించి నీ
యిచ్చనువేఱుగాఁ దలఁప కిమ్మయిచెప్పవె కార్యసిద్ధికిన్. 55

క. అటుగాక యామె వెదకఁగ
నటనిట నాతోడ నీవు నరుదెంచిన నం
తటఁ దీర్పవచ్చు నిది నీ
పటుబుద్ధి నెఱింగి తెలియంబలుకుము పేర్మిన్. 53

అనుటయు విప్రుఁడిట్లనియె నక్కట యేనెటువచ్చువాఁడ నా
యునికిన యింతసేసిన మదోద్ధతు లేనిలువీక వచ్చినన్
మునుకొనికాల్పరే గృహము మ్రుచ్చిలిపోరె సమస్తవస్తువుల్
జనవర శిష్యులుం జదువుసంధ్యలు నగ్నులు నే మెఁనర్చెదన్.

క. కావున నడుగఁ రానిది
యై వచియింపంగ రానిదైనను నగుఁగా
కా విధము దెలియఁబలికెద
భూవర విధిసేత దాటఁబోలునె మనకున్. 55

గీ. అది యనాచారసరణికి నవధిభూమి
మన్మనో భావలతల కున్మత్తకరిణి
సకల వైరూప్య సంపదాస్థానసీమ
వాసిఁగన్నది వైశాలినీ సమాఖ్య. 56

క. అని యతఁడు చకితపడున
జ్జనపతిఁ గని గుఱుతు లివియు సంగ్రహములుగా
వనిత నెఱుంగఁగ జాలవొ
వినిచెద నటులేని కొంత వివరముగాఁగన్. 57

వ. అని యిట్లునట్టులుం దట్టాడినటులఁ జూచి. 58

సీ. వ్రేల్మిదర్భలసిరుల్ వెక్కిరించెడికురుల్
స్రుక్స్రువమ్ములకు నెచ్చెలులు కేళ్ళు
ఆవు వెనుకటికాళ్ళ కన్నదమ్ములు కాళ్ళు
వహ్నికుండము నాడపడుచు మొగము

శ్రవణముల్ పూర్ణ పాత్రల మాఱుదల్లులు
సవతులు కనులు ప్రోక్షణులసిరికి
కూర్చులకును దోడికోడండ్రు కనుబొమల్
దొరసాని నాస దుత్తూరమునకు

హోమధూమమ్మునకు నింటిచెుజ్జులైన
మేనిచాయలు నిధ్మము ల్వోని వ్రేళ్ళ
నగ్ని యుదయించువేళల నరణిసిరుల
నధరపతిచెడి యధరమ్ము నలరు సతికి. 59

క. శివునకు మూఁడవకన్నుగ
నువిద లలాటమ్మునచ్చ యొక్కటి తెలుపున్
నవకాశ్మీర స్థగిత
మ్ము విశదముగ నాదుభార్య పోలికలెల్లన్. 60

క. ఇట్టిది సతిరూపం బన
నెట్టులగున్ శిల్పిఁ గవిని నే గాకుండన్
బుట్టి యిఁక శీలగుణముల
వెట్టివొ యెఱిఁగింతుఁ దెలియుమీ మహీపాలా. 61

సీ. మూఁడువేళల నన్ను మ్రొక్కిపూజించు నా
యొడలు సోఁకిన మైలపడితి నసును
పతిభక్తి బోధించుఁ బడతుల కేవేళఁ
బిలిచిన నెపుడు విన్పించు కొనదు

ఆసక్తి ప్రకటించు నగ్నిపూజలవేళ
నేకాంతమునఁ దలయెత్తి కనదు
సాగించు నైష్ఠికాచారమే వేళల
నవరించు నాదునాచారసరణి

నేను వలదన్నపని చేయుటే వ్రతమ్ము
ఏను నియమించుపని మానుటే తపమ్ము
ఉఱక యెదిరించి పలుకుటే యొక్కనోము
ఎపుడు చిఱచిఱలాడుటయే గుణమ్ము.

గీ. కారణము లేక కలహించుఁ గాంత యెపుడు
నపుడ వెలయించుఁ బ్రేమవర్షాగమమ్ము
సతి మనోగతి తీవ్రఝంఝలను వెడలు
సుడులమబ్బులు నామనుగడలు కడలు. 62

క. ఏయే వేళల నెమ్మెయిఁ
జేయునుగా కడ్డమొకఁడు సెప్పక యెపుడే
నాయింతిహృదయ మెఱుఁగుచుఁ
బోయెదఁగా కెట్టి కనలు పోకలఁ బోవన్. 63

అనునెడ జేని నేత్రముల నద్భుతదిగ్ధ విషాదభావనా
చనముల కొన్ని రేఖలయి జాఱెఁ గదుష్ణకదశ్రుబిందువుల్
కనియె భటుండు నేను నవికాంచితి రాణి మొగమ్ము చూచుడున్
కనఁబడియెః బకాలుమని నవ్వైనచందము లై విచిత్రముల్. 64

ఎఱుఁగడు విప్రుఁ డింత యిది యింతినిగోల్పడు నవ్విపాదముల్
మొఱఁగినచిత్తమై తనదుమొత్తుల జేనిమన మ్మొఱుంగమిన్
మఱిమఱియున్ వచించు ననుమానము లేక సతీవియోగముల్
వఱచినకన్నులై పలుకఁబాఱిన కుత్తుక నిండునశ్రులన్ 65

# విప్రరాజసంవాదము

శ్రోత్రియు నమ్మహీసురునిఁజూచి మహీపతి చాలుఁజాలుఁ జా
రిత్రవిశుద్ధ నీసతి నెఱింగెడుపొంటెను జెప్పినంతయున్
మైత్రిని భక్తిఁ జేసి యొకమాటవచింతు ననుగ్రహించి యీ
ఛాత్రునివిన్నపంబును బ్రసన్నమతిన్ గ్రహియింప వేడుచున్.

శీలము రూపము న్వలయు శీలములేనిది రూపమేటికిన్
శీలమునన్ జగమ్ములు వసించుట లీవు నెఱింగినట్టి ద
శ్శీల యశీల యంచ నెడి చేడియ పోవఁ దపింపనేటికిన్
శీలము రూపముంగలుగు చెల్వలునన్ గఱవైరె యీధరన్.

క. హృదయారుంతుద యగునీ
ముదితను గ్రహియించి పుణ్యముం గొని రెవరో
యదియేల తడవ శీలము
కుదురగు వేఱొక్కసతిని గొని సుఖపడుమీ. 68

వ. అశ్లీలయగు సతిని స్వయముగఁబరిత్యజించుటయు దోసమ్ము
గాదంద్రు. రూపహీనయునగు నీ సతి నీకృతంబునఁగాక.
ఖెడఁబడుట యిదిదైవ మిచ్చిన మేలుగాదె. ఏ నెల్లవి

ధంబుల నీకుందగినకన్నియ వెదకి తెచ్చియర్పింతు నన్నొం డుగాఁ దలంపక నీవు పునఃపరిణీతుండవు గమ్ము ఇందులకు సమ్మతింపు మనిన మునికోలతాఁకున నొచ్చివిచ్చిన యొద లగు వృషభేంద్రుపోలిక నప్పలుం డులికిపడి యొక్కింతన తన్నుఁదాన యుపశమించుకొనుచు నారాజుం జూచి.

క. ఒంటనియపూర్వములు గడు
వింటిని నీనోట నెట్లువెడలెనో యిపుడే
మంటి మహీశ్వర చిత్తము
నంటిననాదుఃఖ మిట్లు లనిపింపదుగా. 70

అనయము రక్షణీయ యగు నాలన భర్తకు నెల్లవేళ నొ
ప్పనిపని యేమిసేసె నదిపాటిగఁబట్టుట పౌరుషమ్మువ
ర్తనమొ యఖండబోధనమొ తప్పదిసేయక తా నొనర్చునే
యొనరిన యొక్కదోసమున నొప్పమి దానును జేయవచ్చునే. 71

ప్రకృతి ఘటిల్లునొప్పమికి బాధ్యతఁ గాంచునె పూరుషుండు నీ
వికృతికి దూరదూరముల వెల్గెడువానిగఁ దన్నెఱుంగడే
సుకృతములన్ సమన్వయము చొప్పడుఁ జొప్పడనట్టివేళ నీ
ప్రకృతి నిరాకరించు టొకపాడియె దానను హానివుట్టదే. 72

ఒనరఁగ జాయయందుఁ దనయుండయి పుట్టు మగండు కావునన్
తనకు నలంఘ్యధర్మమగు దారను బుత్రుని రక్షసేఁత యా
తనికది యాత్మరక్షణవిధం బనిపల్కెడి నెల్ల వేదముల్
వినవె నిరంతరంబు పృథివీవర నీవును నిమ్మహార్థమున్. 73

అరయ నిజార్థదేహ మయినట్టి కళత్రము దుర్విపాకమై
పరకరలబ్ధ దానయినఁ బాడఱిపోవును జాతిశుద్ధి సం
కరమగు దాన దాన నరకంబగు నూర్ధ్వగతిస్థిరస్థితుల్
దొరఁగుటఁ బూర్వులెల్లరు నధోగతులం దపియింతు రాత్మలన్.
గృహిణిఁ దొఱంగఁ గర్మగుణహీనతగల్గు గృహస్థధర్మసం
గ్రహమఱఁబోయెడిన్ జనపరంపరచూడ్కుల కల్కుయౌనుబై
నిహపరముల్ చెడన్ నరకమే గతియౌఁ దుదినౌఁగాన నా
గృహిణిని దెచ్చియిచ్చి పృథివీశ్వర పుణ్యముగట్టుకొమ్మిఁకన్.
వ. మఱి యొకమాట చెప్పెదనది యెద్దియంటేని. 76

ధర్మార్థమ్మగు దారసంగ్రహము విధ్వస్తమ్ము గావించుచున్
దుర్మేధుల్ సకళత్రులై పరవధూద్యోగక్రియా కర్మఠుల్
నిర్మేఘంబగు నంబరంబున జలాన్వేషంబు గావించు చా
కర్మభ్రష్టులు కొందఱుందురు వృథాకర్మందితాధూర్వహుల్.

క. కావున జీవద్భార్యుఁడ
నై వలఁతునె యొండుసతిని నాలుమగలకున్
కేవలము సరియకావే
భావింపఁగ నెందు నేకపత్నీవ్రతముల్. 78

క. వలవదు సన్న్యాసమ్మును
వలవదు వేఱొండు జాయ పార్థివ నీకున్
దలమేనిఁ దెచ్చియిమ్మా
పలుకక నాధర్మపత్ని బహుభాషణముల్. 79

క. తపములపష్టాంశమ్ములు
నృపుల కొసంగెదరు విప్రు లెల్లరు నాకీ
విపుల ఋణ మ్మదితీఱినఁ
బ్రపుణ్యుఁ డాదాత వలదె వంశము వెలయన్, 80

క. అని యించుక నగి విప్రుఁడు
జనవర! యేనొందు వేడఁ జలిపెద నేనొం
డనుటయుఁ జదురే న్యాయ్యమె
మనుకులమున నేటి కిట్టిమహిపతి కలఁడే. 81

మతి యిది సత్తపోబహుళమానిత యయ్యును నీవు నుత్తమ
క్షితిపతి వంచు నొక్కవని చెప్పుటలర్థ్యొ నిజార్థసిద్ధికిన్
కృతము తపమ్ముచాలియును గేవల మీభవదీయకృత్యని
త్యత నెఱఁగించెఁగా కిటు పరాధికృతిం గలయొల్లఁ బాటునన్ 82

అరసి నీవ చెప్పుము ప్రజాధిప నీదగునాత్మవృద్ధికిన్
కారణమైన మత్తపమునన్ ఘటియించుట మేలొ దీని నా
చారపవిత్రమై వెలయుక్షాత్రమునన్ నవరించుటొప్పునో
నేరనివిద్యలుం గలవె నీవయి చూడుము తారతమ్యముల్, 83

గీ. తల్లిఁ బాసిననాశిష్యతతిఁ దలంచి
బిడ్డపోనిది నావేల్పుగిడ్డి నెంచి
మానరానిది నాయనుష్ఠాన మరసి
సందడించెడిఁ జిత్త మాశ్రమముఁ జేర. 84

క. అని విద్యున్నిశిత కటా
క్షనిరీక్షణరోచు లటులు సారించెడి వి
ప్రునిఁ గనుచుఁ బ్రబోధించితి
వనఘా! నీయాన దాటనగునే నాకున్. 85

వ. నా తెలిసినకొలందిగ విన్నవించితింగాక ఎల్ల విధంబుల నవశ్యపరిగ్రహణీయం బగునీపరిగ్రహంబు నెందున్న వెదకి తెచ్చియిచ్చెద. నేఁడు పున్నమగదా. ఈతొలినెల పోడుపున కొక్కపక్షమ్ము వ్యవధికలదు. కావున నామేరగడు వోసంగుమని యుప్పుడ సర్వతోముఖగమనంబును సకల సాధనసనాథం బగునొక్కమహారథంబుఁ గొనితేరఁ బరిచారకు నాజ్ఞాపించి యమ్మహీసురవరుని సవినయమ్ముగా నభ్యర్థించి యుచితగతి వీడ్కొలిపె నంత దేవీద్వితీయుం డగునమ్మహీపతి నలుదెసల పరికించియు నన్ను లక్షింప నేరక రత్నపుత్రికాకృతి యగునమ్మహారాజ్ఞి నుపలక్షించు నెడల. 85

జలజల రాలె నశ్రులు విశాంపతికన్నుల బొట్టుబొట్టునన్
తళతళఁ దోఁచె నప్రతిమతాస్పృహణీయము దేవిమూర్తి ని
శ్చలములు రాణికన్నులఁ బ్రజాపతితోఁచిఁయుదోఁచడయ్యె నా
కలకల నవ్వినట్లగు మొగమ్ము మెఱుంగులఁ జూడనొప్పియున్.

చెలి నటుచూచిచూచి మునుచేసిన పుణ్యములింతెగాక యో
లలనరో మున్ను మాదెస శిలామయమైనది నీమనమ్మొ నీ

చెలువము రత్నపుత్రికల శిల్పగుణమ్ములఁ దీర్పరించుదు
ర్లలితము లెన్న నీదుమృదులం బగు మేనికి నెట్టిసత్క్రియల్.

శీలము రూపమున్ గనని చేడియ నెవ్వరో మ్రుచ్చిలించినన్
తూలినచిత్తమై తనవధూమణిఁ దేరఁగఁ బంచె విప్రుఁ డా
శీలము నెంచి నన్ బరిహసించెదొ యాపని కేన పూనుటల్
మేలములయ్యెనో మనసు మెత్తఁదనం బిఁక నేని గల్గునో 89

క. పలుకులె బంగారములై
ఫలియించెనో మేనుగూడ బంగరు వగుచున్
తొలిఁ జెలులమంతనమ్ముల
వెలసిన పలుకులును నేఁడు వినరావయ్యెన్. 90

అని యిటులెంచియెంచి బహులార్తి మునింగిన తేని చిత్రపుం
దనువునుజూడ దుఃఖితమనమ్మున నాదు శిలాకృతిస్మృతుల్
చినిఁగినయట్టులైన నొకచింతయుఁ దోఁపని రాణిమోము రూ
పునుగని విస్మయమ్మొకఁడుపుట్టుటయున్ శిలనైతిఁ గ్రమ్మఱన్.

ఎంతటికాల మట్లరిగె నేనెఱుఁగన్ వివరింప నింత కా
ప్రాంతము చేరవచ్చిన మహారధబద్ధము లశ్వరాజముల్
వింతగ హేషలన్ జలుపువేళ జనించిన చేతనత్వ మం
తంతలఁ జూపె రాజఋషి నాతనిభృత్యశతాంగసన్నిధిన్ ;92

వ. అనుటయు బహుళామహాదేవి యానందం గనుంగొని
చెలీ! ఇది యేమిచెప్పెదవు. హృదయస్పంది యగు నీకథా

కథనసంవాదంబు కడఁదాక వినుదాక నెట్టిప్రశ్నంబు చేయ రాదని నిశ్చయించియు హృదయసంవాది యగు నీ వృత్తంబు వినుకోలఁది కుతూహలబహుళంబగు చిత్తంబు శిథిలితశపథం బగుచున్నయది. ఇదేమి? నాయట్టి యధన్య లింకనుంగలరో లేక యిది కల్పితంబగునో. ఇంతకు నా థారెవ్వరు? ఆరాణి యెవ్వతె? పేరు లేనియుం జెప్పవైతి వని యడిగిన నంద యిట్లనియె. తల్లీ! ఇది యంతయు నీవ నిశ్చ యింపఁ గలదానవు. అప్పటికి నా తెలిసినంత వివరించితిఁ గదా. ఇట్టివి కల్పితంబులగునే. తుదిదాఁక విన నీసందియంబు లెల్లం దొలంగెడి. అదిగాక నేటియీపర్వదినమహోత్స వమ్మున నాగలోకమ్మువారలకు సర్వశక్తులు నెక్కువ యయి యుండు. అప్రతిహత పరితస్సంచార లగునాతండ్రి దూతికలు నేఁడు నాయంతఃపురమ్మునకు వచ్చునాచారమ్ము కలదు. కావున నాకథనమ్ము పూర్తి యగునంతకు నొండే మియుం బ్రశ్నింపకుండునది. నా యనుమతి లేక నిన్నిట నెవ్వరుం దేఱిచూడనయిననుం జాలరుగాక. ఇదివినుము.

## అ న్వే ష ణ ము

ఆరోహించె నృపాలుఁ డయ్యరద ముద్యద్దృష్టి మందారమా
లారాజన్మధువాహినుల్ తనదులీలామూర్తి యా దేవికిన్
సారజ్యోత్స్నలు గాయఁగా మధురహేషాధీర సప్తాశ్వ జి
హ్వార మ్యానలబద్ధసఖ్య సఖితా స్వైరప్రచారోగ్రమున్. 94

ఆతఁడు కర్మసాక్షిబలె నారథమెక్కె మహాబలోరువి
ఖ్యాతుఁడు సూతుఁ డశ్వములకళ్ళియముల్ సడలించునంతలో
నాతియొ రత్నపుత్రియొ కనన్ వ్యవధానము నాకులేమి నా
కేతన పట్టవస్త్రమయి కేవలమున్ రథమంటి పోయితిన్. 95

ఆరథ మేఁగె నంత గమనాతిశయమ్ముల మించునోడయై
వారిధు లేడునుం దిరిగివచ్చువిధమ్మునఁ బత్తనమ్ముప్రా
కారరమా ప్రదక్షిణవికస్వరలీలల సప్తలోకసం
చారపరీక్షణక్రమ విసర్పణము ల్గడునుల్లసిల్లఁగన్ 96

చైత్రము తద్రథమ్మపయి స్వామి యతర్కితలీల వచ్చుటన్
చిత్రితచిత్తు లాప్రజలు సేసలువెట్టిరి మాత్తికప్రభా
చైత్ర నిరీక్షణాక్షతలు చల్లిరి పూవులు నిత్యమంగళ
శ్రీ త్రిదశీకృతాకృతివిశేషలు పౌరసతీమతల్లికల్. 97

ఎదురై వచ్చుచుఁ గన్యకాజనముతో హేరంబమాతృప్రభల్
కుదురుల్వోటినమూర్తియై శివకథాగోష్ఠీరసాలీఢయై
ముది సీమంతిని గౌరిపూజకొఱకై పుష్పమ్ములాబాలికా
మృదుహాసమ్ములతోడ జేనిపయి వర్షించెం బ్రమోదమ్మునన్.

కేతనరాజిరాజిత నికేతనమధ్య మహాపథమ్మునన్
శాతశరమ్మునాఁ జనుచు జంగమసౌధముఁ బోలెఁ దేరు సం
ప్రీతిగ బంధువుం బనుచు వేళల వెంబడువృద్ధబంధులై
చేతులు కేతనమ్ములుగఁ జేసెను హెచ్చరికల్ గృహావళుల్.

తనరాజ్యంబున లేఁడు దుష్టుఁ డగుచోఁ దప్పేల సంధిల్లె నొ
ప్పనిదే దేని నొకండు దాఁజలుప నుత్పాతంబొ యీచౌర్యమెం
దనిగాలించు టచోర మీభువనమందా విప్రునర్థాంగి నం
చనుమానించుచు నెల్లఁజూచెఁ బతి నిద్రాహారదూరస్థుఁడై.

ప్రతిగిరియున్ గుహాగుహముఁ బత్తనపత్తనము న్నదీనద
ప్రతతులు దుర్గదుర్గమతరమ్ములు ఘోరవనీవనాంతర
క్షితు లవి దా ననంగఁ బరికించియు నయ్యయిరీతులందు శం
కితములు తావులెల్ల వెదకెన్ బలుమాఱులు నిర్వికారుఁడై.

వ. ఇట్లు సప్తభువనమ్ములు సప్తవాసరమ్ముల ముమ్మాఱు
పరిభ్రమించి. 101

పదునులుతీఱుబుద్ధి నరపాలశిఖామణి భూప్రదక్షిణం
బది యటు సేఁతలై తలఁచె నక్కట తీవ్రపరీక్ష గాక దా
నిదినిజమే గనంబడదె యింతట నేమగు దైవచోదితం
బిదియగుఁ బౌరుషమ్మిటనొకింతయుఁ జెల్లునెయంచు నెంచుచున్

## త్రికాలవేది

క. తలఁచి త్రికాలజ్ఞుని ముని
తిలకుని నాతండు తప్పఁ దీర్పఁగ నెవరుం
గలరే యని యయ్యాశ్రమ
తలమునకుం జనియెఁ బరమతాత్పర్యమునన్. 103

అరదము డిగ్గి తేఁడు వినయాకృతి తానుగఁ బాదచారియై
పరిసరచారి గోవృషము స్వాగతమీయ ఘణిల్లుఱంకెలన్
సరిగొనుచున్ సుధాబ్ధినడిచాయలఁ జంద్రునిపోల్కి,నాశ్రమాం
తరములలేఁటిచూపుగమి తారలు క్షీరములై యెదుర్కొనన్.

భరములు తత్తతత్తపరిభావన లల్లనఁ జల్లచల్లఁగన్
చొరఁగనిజాశ్రమమ్మెపుడుచూచెఁ ద్రికాలవిదుండుమౌనియో
సురుచి కుమార నిన్నెదురుచూచెద నింతకు నిమ్మహావనీ
సరణుల దేనినో వెదకుచందమునన్ గనిపింతు వెట్లొకో. 105

క. అనుచునె శిష్యుంగని య
మ్ముని యర్ఘ్యము తెమ్మ యుత్తముని కన నతఁడీ
యన కర్ఘ్య మీయఁదగునే
యన శిష్యుఁ దలంచి గురుఁడు నమ్మహిపాలున్. 106

తనపదపద్మసన్నిధిని దామరతూఁడయి మ్రొక్కువాని మె
త్తనికృప నెత్తి కౌఁగిటికిఁ దారిచి రమ్ము కుమార యెంతగాఁ
జినిఁగినవస్త్రమయ్యె నృపసింహమ నీచెలువ మ్మటంచు నా
తని కుచితాసనం బొసఁగి తాను దదర్హతఁ జేరి యిట్లనున్. 107

ఎఱుఁగనె నిన్ను నే నెఱిఁగియే యిటులాడెద రాచకార్యముల్
కొఱఁతలు గావుగాదె ప్రజలున్ సుఖయుందురె చిత్తమింత లో
కొఱఁతలఁ దీర్చికో నెఱిఁగికో నిటవచ్చితె కర్జ మొందుగా
నఱవఱలా నరణ్యముల నారయ నేఁటికి నిన్నినాళ్ళుగన్. 108

అనిన మహాత్మ నీయెఱుఁగ నట్టివి లేవు చరాచరమ్ములం
దనెడిప్రసిద్ధి నిక్కమగు నైనను దానయి వేడికాక నా
మనమిది తృప్తిఁజెంద దను మాటయెగాదు తలంచిచూడ, నీ
మనమునునట్ల తండ్రులు కుమారులపల్కు లెఱింగితీర్పరే. 109

క. అది చాలగలదు హృదయము
నదవద లోనరించునట్టి దట్లుండఁగనీ
పదపడి తీర్చెదు దానికిఁ
బదింత లౌ విప్రకార్యభర మిది వినుమా. 110

క. వైశాలిని యనుభామిని
వైశాలియనంగ నొప్పువిప్రునిసతి మా
యాశక్తి నపహరింప దు
రాశాపరుఁ డెవడో కాని యమ్మహిసురుఁడున్. 111

క. తనశక్తికలిమి యెఱిఁగియు
నను బనిచెను దారఁదేర నాపుణ్యమునన్
వననిధ్యవధి మహీతల
మును వెదకితి నింతి నిటకు మున్నాళులుగన్. 112

క. ఎయ్యెడల నామొకనఁబడ
దయ్యెడ నయ్యెడల నీమహత్త్వము విని యే
నియ్యెడల కరుగుదెంచితి
నయ్యమ యెటఁగలదొ పేర్మి నానతియీవే. 113

వ. త్రికాలములందు నీయఖండబోధమ్మున కెఱుకపడనియది లేదు. విశేషించి యిదివిపరీకార్యమ్మగుట నవశ్యమ్మ ననుగ్రహింప వేడెద ననిన నమ్మునిపుంగవుండు. 114

క. నలుదెసలు చూచి యదె యు
త్పలావతారణ్యసీమ వైశాలిని య
త్యలఘుం డద్రికుమారుఁడు
బలాకరాక్షసుని దేశవర్తినియగుచున్. 115

క. అట కరుగు మన్న యెఱిఁగెద
విటకిటు లాబాట యనుచు నెఱిఁగించిన యా
వటుబోధమహితు ననుమతిఁ
దటిజ్జవన రథ్య మారథ మ్మతఁ డెక్కెన్. 116

లక్ష్యారసిరశీల వాజులు త్రికాలజ్ఞాని మాహాత్మ్యవై
లక్ష్యాత్మ క్షితిపాల మానసజవ శ్లాఘాపరిబోధపిరియాఽఽ
ధ్యక్ష్యమ్ముల్ రథమున్ విభుండుమఱియున్ దామైనచందమ్మునన్
లక్ష్యస్థానము నుత్పలావతము లీలన్ జేరె నొక్కింతటన్. 117

## వైశాలిని

క. ఆ నిర్జనవని ధ్వాంత
ధ్వానకఠోరమ్ము శోకభావార్ద్రమ్మున్
వీనులు చుఱఁజూఁడెడియొక
మానినికంఠస్వరమ్ము మహిపతి వినుచున్. 11

క. ఆధ్వని యటు లేతెంచిన
యధ్వమ్మున నరిగియరిగి యత్యబ్దధ్వాం
తధ్వాంత నైల్యవికృత వ
ధూధ్వజలక్ష్మీ పటద్వధూటిని గాంచెన్. 119

కాంచి యతండు సేరఁజనఁగాఁ దన వ్రేళులు నోటఁ గ్రుక్కుచున్
పెంచిన మేన నిట్టునటు నిక్కుచు నేడ్చుచుఁ గేకరించుచున్
గొంచెము గొంచెమున్ గొణఁగికొంచుఁ దలంబడిఁ గోకికొంచు, న
ర్తించినయట్లు కాల్నిలువరింపక తాఁదను వెక్కిరించుచున్. 120

గీ. ప్రకృతిసిద్ధమ్మె వైరూప్యభాగ్యమునకు
వికృతు లొకకొన్ని తనుదాన పెంచికొనుచు
గడియ కొకరీతి నున్మత్తకరిణికరణి
నడవి నందందుఁ దిరుగుచు నడలుచుండి. 121

కటకట యాయజూక త్రుటికాలము సాఁగదు తోఁచదయ్యె ని
చ్చటను, విశుద్ధిసేయఁగ నిశామయ గోమయవారిధారలున్
దటపటలయ్యె నగ్నులును దాళదళీకృత సంపుటమ్మె ల
చ్చట ననుబోలె నెవ్వ రనిశమ్ము నొనర్తురు నీకుశుద్ధులన్. 122

అగ్నులపూజవేళఁ బరనావసరమ్మున బోధవేళ, నా
భగ్నము భ్రూకుటిన్ గరిచెపూనిన చేతిని జూచి నీవు ను
ద్విగ్నుఁడవై కృతాకృత వివేకము లేక క్రియావిశేషముల్
భగ్నముసేయు, ఛాత్రు లొకపాటిగ నవ్వుట లింకఁ జూతునో.

సీ. సాధింవఁగలదె యోజంజపజ్జీవన
శుచులెంచి నిన్ను నే సోమిదమ్మ
భాషింవఁగలదె యోభాష్యాంతపండిత
యెదిరించి నిన్ను నే చదుగురాలు
చూడఁగాఁగలదె యోశ్రోత్రియాగ్రమణీ
చివురింప నిన్ను నే శీలవతియు
దిద్దికోఁగలదె యోదినదినకర్మర
ఇలుతీర్పు లరసి యే గృహిణినిన్ను

అరరె వృథపోవె యీపాటి కఖలవిధులు
రక్షవెట్టెడి నామేటిశిక్ష లేక
ఇచట నెవ్వరు నాశిక్ష లెఱుఁగకునికిఁ
జాగఁకున్నది నాసదాచారపథము. 124

ఏటికిఁ దెచ్చెనో దనుజుఁ డిచ్చట నాయధికార మింతయున్
చోటుకొనంగ లేదు ననుజూడఁడు రక్కసి చూచెనేని నె
చ్చోటను నింతులం దగులుచూప్కలు నేరఁడుగాక యొక్కటన్
కూఁటికి ముద్దగా నమలికోఁ దలఁపం డిదియెట్టి చిత్రమో. 125

ఎన్నఁటికైన నీదనుజ నీచెఱఁబాసెడి పుణ్యమబ్బి నా
మున్నువిధమ్ములం బతి సమున్నతి దిద్దికొనంగ నున్నదో
క్రిన్నన సాటిబోటు లతిరాత్రినికూఁతు రిదెంత దయ్యో నా
నున్నతు లందికోఁగలుగు టున్నదా లేదా లలాటరేఖలన్. 126

క. అనియేడ్చె నాపె బాష్పము
చినిచిసికి క్రమక్రమమ్ము సెలయేఱై యా
వనమెల్ల మాఱుమ్రోసెడి
ధ్వని ఘూకీకంఠకఠినదర్పము లుఱలన్. 127

శీలవిదుండు నానృపతిశేఖరుఁ డాసతి యట్టిరూపు గ
య్యాళితలంపు లాదనుజునద్భుతచర్యలు నాకళించి వై
శాలిఁ దలంచి, యానుడు లసంశయితార్థములాటలెంచి వై
శాలినిగాక యిత్తెఱఁగుచానలు నుందురె యంచునెంచుచున్.

వ. అయ్యుద్ధమురేయి నందునుం బరసతీ సందర్శన సంభాషణ
రూప పాపమ్మునకు వెఱచియు, విప్రునాజ్ఞయు నిజధర్మ
మ్మునుం దలంచి సవినయమ్ముగా సమీపించి, తల్లీ ! ఇదె
నమస్కారమ్ముకొనుము. నేను బ్రజాధర్మపరిపాలకుండనై
చరింతు. వైశాలియను విప్రువనుపున నాకిటకు రానయ్యె.
అయ్యనఘుధర్మపత్నిని జోరు లపహరించి రట. నేనామె
వెదకి యాయనకు నర్పింపవలసియున్నయది. ఆమె
చందంబులు నీయందుం గొన్నికనియు నిశ్చయించి పలుక
వెఱచెదం గావున ననుగ్రహించి యియ్యర్థంబున నీయెఱింగి
నది కలిగె నేనిం దెలుప వేడెద ననిన నమ్మహాపురుషుని యాగ
మనదర్శన విశేషమ్ముల నంకురించియు నయ్యత్యపూర్వ
మధురసంబోధనమ్మునం జేసి యతర్కితోపజాతంబు ననను
భూతచరంబు నగు మాతృభావసంపన్నం బయిన విజ్ఞానమ్ము
నం బల్లవించినచూడ్కుల నతనిం జూచి, 120

అన్న! మహోగ్ర మీయటవి నాదనుజాధముతీవ్రదృష్టికిన్
పన్నినమాయ కెం దెదురుపాటులులే వెటు లిందుఁజొచ్చితో
నన్నెటుగంటివో తెలియ, నాదుచరిత్ర మెఱుంగనట్లుగా
నున్నదిసర్వమున్ బలికియుం బ్రియివెట్టెదు నేన చెప్పఁగా.

అన్నిటికేమి నీపలికినంతయు నిక్కము, విందుఁగాక నేఁ
డెన్నఁగ నేడువాసరము లేఁగెను నే నిటఁజేరియుండి, నా
కన్నలు దమ్ములున్ గలరు నందఱకన్నులఁ బ్రామితెచ్చె నీ
చెన్నటి తన్మనోగతి విచిత్రము నేఁటి కెఱుంగనయ్యెదన్ 131

ఆరయనారయన్ దెలియనైనది యొక్కటి, తొంటినా సదా
చారపరంపరాక్రమము సాఁగఁగనీయని చంద మీ దురా
చారునివర్తనమ్ముల వశంవదు శ్రోత్రియు దిద్దుకొన్న యా
చారమహత్త్వముల్ తెలియఁజాలని చిత్తము పట్టియార్పఁగన్

గోమయము న్విశుద్ధి కొనఁగూడనిదయ్యెను వీనిభూమి, నా
స్వామి ప్రమాణ మిన్నిదివసంబులు స్నానము బోన మెల్ల కే
నీమెయి చిక్కిశల్యమయి యీవనభూముల సంచరింతు, నీ
వేమెయి నన్నుఁ గైకొనుచు నేఁగెదొ రక్కసికన్నుఁ బ్రాముచున్

నాదుదురంతవేదన లనంతములై బహుశాంతరాంతర
చ్ఛేదివిలాపము ల్మొదుల జీర్ణములైన విశీర్ణరూపముల్
గాఁ దలఁపించునీలతలు గంటె నగమ్ములు నోర్వరాని నా
ఖేదముల న్సహించెడి నకించనపక్షి నికేతనమ్ములై. 134

సంతల వేదముల్గలఅచుచాడ్పున నాదువిషాదసూక్తముల్
సంతత మాలకించి తమశక్తికొలందిని నేర్చినట్లుగాఁ
బంతము లెక్కి యొండొరుల వంతులుమీఱుచు నాలపించు నీ
ప్రాంతము పక్షులెల్లను గృపాపర నీవటు లాలకింపుమా. 135

ఎంతగఁ జెప్పినం దఱుఁగ వీ మరణాంతవిషాదగాథలే
నింతకుమున్న విన్నడుగ నెంచియు నాదురవస్థ లెన్నుచున్
గొంతగ విస్మరించితిని గొండొకరీతిఁ దలంపకయ్య న
న్నింతకుఁ దల్లిగాఁ బిలుచు పెంచుచు నాడెద నాడుదాననై

ఇంతకునీవు నీసతియు నేకమనమ్మున నుండువారె, నీ
కాంతవచించుపద్ధతులు గాదనకుండువె ధూర్తపూరుషుల్
కాంతల నేలికోఁ దెలియఁగాననివారలు నున్నవార ల
త్యంతనిజాధికార ఘనదర్ప తిరస్కృత దారదారుణుల్. 137

అందును నీవు చేరవుగదన్న యటంచును రాజుఁ జూచి యే
మందును నిన్ను నేనడుగునర్థము చిత్తము నొప్పివెట్టెనో
ఎందుల కీ ప్రసంగ మనియెంచెదొ యంగననై జనించి నే
నెందును సాఁటిబోఁటులకు హీనతగల్గిన సైఁపనేర్తునే. 138

ఇంతకు నేమియంటి నిదియెంతటిమాట మదాత్మనాథుఁడున్
కొంతగ జంకి నాపలుకు కొండుకసేయఁగ నేరఁ డెందు వే
దాంతవిదుండు కర్మఠుఁడు దాంతుఁడు శాంతుఁడు శీలశాలి నే
నెంతన నంతసేయు నదియెంచి వచించెడు గాక నాకటన్. 139

నాపతిఁ బాసి యీఘనవనమ్మున నుండియు నెల్ల వేళలన్
స్త్రీపర దేవతామహిమసిద్ధుల తెల్పుట నాకునైజమై
ఈపగిది న్వచింతు నిది యెల్ల నెఱింగి కుమార! పల్కు మీ
కాపురమందుఁ గష్టము సుఖమ్మును దల్లిని బోని నాకడన్. 140

క. అని వైశాలిని నిజధా
రణిఁ బలికిన విననొ వినఁడో రాజచలుండై
వనితవికారము రూప
మ్మును జెయ్వులు పలుకులును నపూర్వము లగుచున్.

మనమును బట్టి యూర్ప ననుమానము లేదలవిప్రపత్ని యీ
వనితయె యొక్కగుర్తతఁడు పల్కెనుగా కదియెల్లెఱింగెదన్
ఘనశితమార్గణమ్ముల ప్రకారములై హృదయమ్ము గాడి పా
ఱినయవి పల్కులీయమ యెఱింగియె యిమ్మెయిఁ బల్కనేర్చెనో.

క. అటుగాకయుఁ గృతదోషుల
కెట నెట నెవ రేమియన్న నెయ్యది గనినన్
స్ఫుటముగ లక్ష్యము దానయి
చటుకున్ మనితోఁచు నెందు సహజమ్మగునో. 143

క. మతిఁ దఱచి తఱచి కన నీ
పతివ్రతాచరిత చిత్రబహుళమ్మయ్యెన్
శ్రుతియగు విప్రునకుం దగు
సతి యీస్మృతిఁ బాయ నతఁడు శక్తుండగునే. 144

క. అని యతఁడు పెక్కువిధముల
మనమునఁ దలపోసిపోసి మ్రాన్పడునటులై
నను గని వైశాలిని యీ
యన పలుకనిచంద మెట్టి దగునో యటంచున్. 145



క. పలికించి నన్ను మొదటనె
పలుక విదేలయ్య నాకుఁ బ్రతివచనమ్ముల్
తలయెత్తి యయినఁ జూడవు
కలదొకొ యేమేని శంక గలుగుట కిందున్. 146

క. అన నిందు శంక లెయ్యవి
జననీ! నాకాంతచరిత సర్వమ్మును నే
వినిచెద వైశాలినివి
వనుటకుఁ గల గుర్తు తెలిసినప్పుడ యనిన్. 147

కలకల నవ్వి యెట్టెటులు గాంతుఁడు వల్కెనొ నేనునింతకుఁ
దెలియఁగనైతి నానుదురుతీర్చినమచ్చఁ గనందలంచెదో
వలను కుమార యగ్ని ప్రభవంబగుదానిఁ గనంగ నేర ర
స్ఖలితము బ్రహ్మచర్యము వశంవదచిత్తము లేకతక్కినన్. 148

క. పతిఁదక్క నాకుసరియగు
సతిఁదక్కిన నొరులు చూడఁజాలరు దాసీ
శ్రుతిశీలశాలులు సతీ
పతులకుఁ దనయంత నదియ ప్రత్యక్షమగున్. 149

వ. ఇది మాతండ్రియిచ్చినవరమ్ము. పదంపడి యిదియెల్ల నీవు నెఱింగెదవు గాక. ఇంతకు నేనతిరాతుగ్రికూఁతు రగువైశాలి నిని గానరియూతఁడనినప్పుడుగదా యప్పుడు చూచు కొందము. నాపగ్రిశ్నమ్మునకుం బదులాడ నేర వైతివి. ఇమ్మహారాక్షసుబారినుండి నన్ను రక్షించు నుపాయమ్ము నన్వేషించు నీమనమ్ము దానిం జెప్పఁ గుదురువడకున్నదో యను నెడల, నప్పుడ వేటవోయి వచ్చుచు నుత్తముఁడగు నమ్మహీపతి మేనిపరిమళమ్ముల నపూర్వమ్మగు వనమ్ము శంకించుచు నలుగడలుం బరికించి మహోన్నత కేతనోజ్జ్వల మ్మగు నరదమ్ము లక్షించి యది వైశాలిని నివాసమ్ముగా నిరూపించి యబ్బలాకాసురుండు. 150

## బలాకుఁడు

స్వాగతము. జంగమాద్రిశిశు చంక్రమలీలా
రంగదాత్మ గతి రమ్య తనూ సం
సంగి సంభ్రమముస్వాగతలక్ష్మీ
మంగళక్రియ సమగ్రము గాఁగన్. 151

వసంతతిలక. వారాశికాంచికృత వల్లభతావిశేషున్
కారుణ్యధర్మకృత కారణజన్మ వేషున్
సూరప్రభున్ సురుచి సుందరు విప్రపత్నీ
చోరక్రియా ఘటకశూర జనుర్ద్విదృక్షున్. 152

వసంతతిలక. ఆరాజు గాంచి వినయమ్మున వాఁడు మ్రొక్కెన్
సారేభ మస్తక కచాకచి దానశౌండ
స్ఫారోత్తమాంగ రుచిజాలము తత్పదశ్రీ
నీరాజన మ్మయి వినిద్రశుభమ్ము దెల్పన్. 153

ఆవైశాలిని యాత్మతస్కరణవిద్యాధూర్తతాశాలి వాఁ
డేవంరూపము భక్తిసూపుటలు దానీక్షించి యారాజుతే
జోవైశిష్ట్యము నెంచి యద్భుతము మెచ్చుం గొంత లజ్జాభర
శ్రీ వర్ధిల్లెడిచూపులెందొలయఁజూచెన్ జేని మాహాత్మ్యమున్.

క. ఆనృపతియు నాదనుజుని
యానిర్మలభక్తియుక్తి యద్భుతపఱుపన్
లేనెత్తి కరముప్రియమున
వానిం గను గొనెడి వేళఁ బ్రముదభరమునన్. 155

పలికె బలాకరాక్షసుఁడు పార్థివ నీవయిరాకఁజేసి మా
యిలు వని బంధులున్ సఖులు నేను గృతార్థుల మైతి మెల్ల నే
వలచినబంట నేలుకొను పంపు మదెంతటికర్జ మైన నీ
తలఁచినలోనఁ దీర్చెద ముదంబొనఁగూర్చెద నీదుబుద్ధికిన్. 156

క. అని యప్పుడ తనమంత్రులు
కొని తెచ్చిన రత్నపీఠిఁ గుదురుగ నిడి యో
జననాథ యిందుఁగూర్చుం
డి ననుం బనిగొమ్ము వీరె నీపరిజనముల్. 157

అని పూజించిన మెచ్చి యానృపతి నీయాతిధ్యసత్కారముల్
మనమున్ జూఱలువెట్టి నెల్లపనులు న్నాకిందు సిద్ధించె, నీ
వినయ మ్మాదృతి వింత వింత లగుచున్ బెంపొందఁ జిత్రమ్ము లీ
వనితం దెచ్చుట లెట్టివో తెలియ నీవైశిష్ట్య మూహించుచున్

క. నీవై తెచ్చితొ యిటఁ దా
నై వచ్చెనొ యిమ్మహీసురాంగన రెండున్
కేవలము విరుద్ధము లై
యీవిధములమిమ్ముఁ జూడ నేర్పడ వయ్యా. 159

ఆరసి యేర్పఱింపు నిజమైన విధ మ్మిట నీకు నిట్టి యా
కారములందు నొక్కమమకారము నైజమొ లేక యిట్టి యా
చారవతిం బలింగొనెదు సత్క్రితివొక్కటి సేయనెంచితో
కారణమేమి యీభయదకాననసీమల కీమెఁ దేరఁగా. 160

అనినను వాఁడు మొ్రిక్కుచు ధరాధిపయొక్కటి చిత్తగింపు నా
మనవిక్షమించియీదొసఁగు,మానుషఖాదులమేముగాముమా
తనువులు కూ్రిరభావములు దాల్పవు చిత్తము లొక్కవేళనై
నను ఘటియిల్లుఁ బుణ్యజననామము మాకొక కారణమ్మనన్.

ఫలములుగోరి యీజనులు పాటిగఁ జేయు కి్రియావిశేషముల్
కలఁగి దురంతవిఘ్నవికలత్వము గాంచినవేళ లందు నా
ఫలములు మేముతించుము నృపాల మఱొక్కటిపా్రిణిహింసకున్
పోల మగు నట్టి జన్మములపొంతకుఁబోవరు మాకొలమ్మనన్.

అరయఁగ దుర్భర మ్మయినయట్టిది కోపము పుట్టువేళ నీ
నరులస్వభావజమ్ములు గుణమ్ములు శాంతియు దాంతిఁదిందు మ
చ్చరలను మించుకన్నెలు వశంవదచిత్తలు కామినుల్ మనో
హరగుణరూపభావ మహిమాఢ్యలు నాకుఁబరస్సహస్రముల్.

కలిగియు నిట్టిసంపదలు గారణ మే మిట నీమెఁ దేర నాఁ
దెలిపెద, నీమెభర్త యతితీవ్రము లాసురనాశనమ్ము లు
జ్జ్వలములు మంత్రసిద్ధులు వశంవదముల్ దనుఁ గొల్వుసేయు, వి
చ్చలవిడి జన్నముల్ సలుపుఁ జాయల కేనియు మేము రానటుల్

చలుపు రెగాదు పై నొరులఁ జల్పఁగఁజేయుచుఁ దాను రక్షయై
నిలుచుచు మాకు నెయ్యెడల నిల్వఁగ నీడయు నుండనీయమిన్
కలఁగి క్షుధావ్యధాకులమనమ్మున నేఁ బగ పట్టి పట్టి నా
చలమున దెచ్చితిన్ వనిత స్వామియొసంగిన సాహసమ్మునన్.

ఆటది లేని పూరుషున కధ్వరముఖ్యము లెల్లసత్క్రియల్
వీటిగఁబోవుఁ గాన నలవిప్రునిపత్నిని దెచ్చి యస్మ దు
చ్చాటనమంత్రపాటవముఁ జక్కఁగఁ జేయుచుఁ బాలు నే నను
ద్ఘాటితసత్క్రియావికలతాఘనకూపము లందుఁ ద్రోచితిన్.

చేయుంగావుతఁ దానుగాఁ దనకునై చేయింప నెచ్చోట న
ప్రాయశ్చిత్తము లైనకర్మముల మాప్రాణమ్ము లేమానో తా
నీయన్ రాదొకో యొక్కయాహుతియు నైఋత్యాంభువిస్రావ
నా యజ్ఞంబులఁ జేవిదుర్పఁడమ్మృతాంధః పక్షపాతమ్మునన్ [యేత్

అనుచు విషణ్ణుఁడై నృపతియాననముం బరికించిచూచి, వాఁ
డనియెఁ బ్రభూ మదిం దెలియకాడితివో పరిహాసపుమాట, మీ
మనమునఁ గలంచునట్టిది యమానుషనైజము పట్టియార్పఁగన్
ననుఁ దమియించి తెల్పు సుజనప్రియ యంచును మ్రొక్కి క్రమ్మఱన్.

క. మీయంతలు నరపతులకు
నాయంతటి బంటు కలిగిన న్వాగతేలా
నీయాన యేమిపని యిటఁ
జేయఁగ నాకయ్యె నదియు సెలవిండనిసన్. 169

క. ఆధీరచిత్తుఁ డటు గని
సాధీయశ్చరిత నీవచఃపద్ధతులన్
బాధించునవియుఁ గలుగునె
నీధర్మము దాట నగునె నీ కౌకయందున్. 170

పలికితి వీవు ప్రజావళి స్వభావగుణాళి హారిఁ తు నంచు నీ
వెలఁది యభాగ్యశీలమును వెల్వడఁ జేయుము దానవిప్రుఁడున్
ఫలితమనోరథుం డగును భర్తృవశంవద యైన యీమెయున్
చెలఁగెడిఁగాత, మెల్లఫలసిద్ధియు నింతకు నాకునున్నదే. 171

అనుటయు వాఁడు నా మెవికటాకృతి కారణదుష్టశీలమున్
తనఘనశక్తిచే నపహృతం బొనరించుడు నవ్వేలందియున్
మనమున వింతవింతలయి మాటగరాని యఖండపుణ్యభా
వనము లపూర్వముల్ మగనిపైఁ గలభక్తులు సుల్లసిల్లఁగన్.

క. తనపూర్వకృత్యములకున్
మనమున లజ్జించి నృపతిమహిమమ్మును, నా
తనిపనుపున దనుజుఁడు చే
సిన యుపకృతి కనుల కొక్కసిరి గలిగింపన్. 173

క. మీయిరువురపుణ్యమ్మున
నీయెడ జనియించి యేను నిల్లాలైతిన్
మాయన్నలార! చేర్పరె
మీయన్నపదాబ్జ మధురమ్మృదుసంగతికిన్. 174

అనవిని యబ్బురమ్ముఁ బ్రియమందినరాజునుజూచి వాఁడు మీ
పనుపున నివ్వధూమణిని భర్తృపదమ్మునఁ జేర్చువాఁడ నిం
కను బనిగొమ్మ నా నతనికన్నులఁజూచి విభుండు నౌర నీ
వనిచినకూర్మి కెంతటి ఋణంపడినాఁడనొ యన్నయట్లుగన్.

క. అలఘుగుణ చాలదే యిది
తలఁపునవర్తించు నిన్నుఁ దలమే మఱువన్
వలఁచినస్మరింతు నిను, నీ
పొలఁతుక నెట్లప్పగింతువో విప్రునకున్. 176

వ. అనుటయు నప్పుణ్యాజనుం డన్నరపతికి మ్రొక్కి, దేవా!
భృత్యుండు క్రిమ్మఱివచ్చి విన్నవించువాఁ డనునెడల
నావైశాలినియు, మహారాజ! మహాదేవి సముఖమ్మున
శ్రోత్రియద్వితీయనై మఱల సందర్శించెదంగాక సెల

వొసంగు మని యతనియనుమతి నుచితప్రియోక్తుల నందు
టయు నయ్యద్రినందనుండు, నప్పుడ పరిచారకులు సన్నద్ధ
పఱచి తెచ్చినపల్లకి నప్పుణ్యసతి నెక్కించి, తనవచ్చువఱకు
నారాజు నందుండఁ బ్రార్థించి, యందులకు వలయువిధు
లలవరించి యంతన విహాయసమార్గంబు నధిగమించె నని
చెప్పి యా నంద బహుళామహాదేవిం జూచి. 177

క. వనితను దాఁ గొని చనఁ డకె
మునువనితను మ్రుచ్చిలించు మ్రుచ్చునె పనిచెన్
తనపతిని జేర్ప జనపతి
వని నాతని కెట్టికార్యభారము గలదో. 178

ఆరయనెంచి యేనచట నాఁగితి నాతఁడు నప్పు డప్పురీ
వార మొనర్చుమన్ననలు పట్టియు బట్టనిచిత్తవాచు, లో
నారసిచూచె విప్రునుడు లాదిగ నప్పటి కైనవృత్తమున్
దారవిహీనహీనతకు దర్పణమున్ విషదిగ్ధశల్యమున్ 179

రక్కసియే యితండు నొకజాఁగయె యీసతి వీరివృత్తముల్
మిక్కిలిపాటొనర్చెమది మేలు సుఖించెడిగాక విప్రుఁడున్
దక్కెనె యంతలేసిసుకృతమ్ములు పూర్వజనుఃఫలమ్ములై
చిక్కనఁగాక యింత లఱసేసినపుణ్యము లై మహార్థముల్. 180

క. ఆ రా జి మ్మొయిఁ బెక్కులు
రారాపులుపడుచుఁ జేయరాక ఘొటకటియే

నాఁ రేయి వేఁగుబోకల
కేరాజై యరుణతరుణ రేఖలు వాఱన్. 181

కన్నులఁదెల్ల వాఱినఁ ద్రికాలమునీందు ప్రదర్శనమ్మునన్
దన్నుఁ గృతార్థత ల్గనువిధ మ్మగునిశ్చయ మొందఁజేసి యా
పన్నచరుండు చారుని నిశాచరభర్తకుఁ జెప్పఁబంచి యా
పన్నమనోజ్ఞ శారద దివాకర చారుతరాత్మమూర్తియై. 182

రథ రథగమన మనోహారంబుగా ధరిత్రి
గమన రథ గురుతేజములొప్ప రాజమార్గి యంతః
మనో పథము ముని పవిత్ర పాదచార పుణ్యా
హారము గ్రథిత పథదిదృక్షు రథ్య మాచునేఁగెన్. 183

క. అరసెదనుగాక నిజసతిఁ
దొరగుట జనియించు చిత్తదుర్భర బాధా
గిరు లురలఁబడవె యమ్మని
గురుచరణుల తీవ్రదృష్టి కులిశనిహతులన్. 184

క. అని తలఁచున్నృపతిమనమునఁ
గనిపించెడియాశ్రమమ్ము కనుఁదమ్ములకున్
కనుపడె నాహారు లాతని
మనోజవనములొ తదేక మతిరూపములో. 185

క. ఆరాజర్షియు నటుచని
యాఋషికిని మ్రొక్కి తెలిపె నటవృత్త మతం

డారయఁగ నాదరమున ను
దారవచోరీతు లాలయఁ దత్క్రియు మెల్లన్. 186

తెలిసె నృపాలుఁచిత్తగత తీవ్రవిషోద్ధురభల్ల మల్లనన్
వెలికి మఱొక్కభల్లమున నెట్టెడు వేదనలై నిసర్గధీ
రలలితభాషణమ్ములు తిరమ్మయి యాశ్రమసీమ తత్కథా
చ్ఛలవిదితాత్మవృత్తములచందములై యొకనిశ్చలాకృతిన్. 187

క. తెలిసియుఁ దెలియనియటు ని
శ్చల మాశ్రమమూర్తి వోని సంయమివరుఁ డాఁ
దెలిపెడిచూడ్కులఁ జూచియుఁ
దెలుపఁగ నేరండు పతి మతింగలయార్తిన్. 188

తెలిపెనుగాక విప్రుఁడు మంతింగలయార్తిని, నేను నెట్లుగాఁ
దెలిపెద నీస్వయంకృతముఁ దెల్పకయున్న నెఱుంగఁడేమి య
స్ఖలితగుణాత్మవృత్తియుఁ ద్రికాలవిదుం డగుమానిబుద్ధికిన్
గలదె యెఱుంగరాని దొకకార్యముచూడ జరాచరమ్ములన్.

తెలుపుట కేనెవండ నిది తెల్పఁగ మాసియె కర్త గాడొకో
తెలియక ప్రశ్న మెవ్వరును దెల్పఁగ నేర్తురెయుత్తరమ్ము దాఁ
దెలిపిన నొక్కవేళ నది తెల్లము నానొకొ మందబుద్ధికిన్
దెలియవచింప నేరనివి తెల్పుటలేగద స్వామినైజముల్. 190

తలఁచి నృపాలుఁడిమ్మెయిని దప్పనిప్రశ్నము సేయ నెంచుఁ దాఁ
దలఁకుఁదలంచుఁ బ్రశ్నమువిధ మ్మదియెట్టులొయంచు నంత నె

వ్వాలనను బౌరుషంబు బలవంతమె దైవము పేర్మిలేక యున్
దలఁపులఁ బొఱు బ్రశ్నమిడు ధైర్యముచాలక విజ్ఞసన్నిధిన్.

తలఁప శిశూదయమ్మునకుఁ దల్లియుఁబోలె నృపాలుబుద్ధి వి
హ్వాలత భజించె నెట్టిపొరపాటున నేమిటఁ బుట్టునో యటం
చలఘుఁడు నమ్మునీంద్రుమహిమాతిశయమ్ము నెఱింగియుండుటన్
పలుకఁ దలంచె నెట్టిపొరపాటులు తీర్పఁడె మాని యన్మతిన్.

తెలిసినపెద్దలం గనిమతింగలసందియ మొప్పొతప్పొ తాఁ
బలుకుట దోసమౌనొకో స్వభావము నందొకతప్పు తోఁచుటన్
తెలుపఁగ లేఁడుగా కనుమతింపక, వారొకతప్పుతోఁచినన్
తెలిసి శపింపరే మునుల తీవ్రమతుల్ దొసఁగుల్ సహించునే.

అలుగుటయే స్వభావమొ మహాత్ముల కల్గకయుండిరేని, ని
ర్మల మగుచిత్త మొక్కయపరాధము సైఁచినసైఁచె నేనియున్
వెలసినతప్పు దా ననుభవింపక తప్పునొ యంచు మిక్కిలిన్
గళవళపాటు తెల్పు తెలికన్నుల మౌనిని జూచెఁ జూచినన్ 194

కలకలనవ్వుకన్నులఁ ద్రికాలవిదుండు, కుమార! మేలు, నీ
తలఁపు లెఱుంగుదున్ సకలధర్మవిదుండ వటన్నమాత్రమే
సలుపఁగ నేర్చు నీకొక విచారము నేటికి నాదుసన్నిధిన్
పలుకుము శ్రోత్రియప్రమదఁ బంచితిగాదె నిజార్థసిద్ధికిన్. 195

క. మేలగుఁ గీడగుఁ గాకది
యేలా? సంశయితమడుగు మేర్పడఁ బ్రశ్నం

బీలాగు లెల్ల నెఱిఁగియు
నీలాగు నెఱుంగఁదలఁతు నీవచనములన్. 196

అన విని యిట్టునట్టుగని యాతఁడు మున్నిట నేనురాఁ గనుం
గొని నను నర్ఘ్యమిమ్మనుచుఁ గొంకక శిష్యుఁడు మాఱుసెప్ప నే
మనియును బల్కవైతి వటులంతగఁ గొల్చిన యబ్బలాకుఁడున్
ననుఁ గని యర్ఘ్యమీఁ డిది వినందగునే సెలవీయు వేడెదన్. 197

అతిథి శివస్వరూపుఁ డనియందురుగా తమవంటి పెద్ద లే
నతిథినె యయ్య నీయెడల నందకపోయితి నర్ఘ్యమేని, నీ
గతిని నికృష్టతాగరిమ గాంచుట కెంతటి దేమితప్పుఁ జే
సితి నదియెల్లనుం దెలియఁ జెప్పఁగదయ్య దయార్ద్రచిత్తతన్.

వ. అని యూ రా జడిగిన. 199

# ప్ర బో ధ ము

నవ్వుచుఁ బల్కె నమ్ముని వినందగు నియ్యది మున్ను నీవుగా
దవ్వులఁ బాపికొంటి సహధర్మిణిఁ గావున నీకు నర్ఘ్యమిం
దెవ్వ రొసంగువార లిదియిట్టులు సేయఁగవచ్చునయ్య, నీ
చివ్విన చిత్తమెట్లదుపుసేయుమి నొప్పమి పుట్టకుండునే. 200

అవునవుఁ బూవువోని దిసుమంతయునొచ్చిన వీడిపోవునో
ఉవిదప్రియానుబంధ మది యొప్పుకుమార సమీరభావమున్
తవిలియు సైపరాని దొకతప్పు తలంచి లయాభ్రచాలన
స్థవిరము ఝుంఝువై వనపదమ్ములఁ ద్రోచితి నిర్దయమ్ముగన్.

క. అతిదుశ్శీలయు సతత
ప్రతికూలయునైన విడువరాదని గనవె? భూ
పతి వీవ యిట్లుసేసిన
గతియెయ్యది? యెవరు శిక్ష గావింత్రు నినున్. 202

క. వలవనియెడఁ బోషింపఁగ
వలయునుగా కెందు విడువవచ్చునె సతి నీ
వలననగు తప్పుగా కిది
బలాతుఁ డెవ్వండు విప్రభార్య హరింపన్. 203

తే. సకలధర్మపరిత్యాగ సదృశమైన
యఘము జాయావిసర్జన మ్మటెనరుని
దగదు స్పృశియింప ననుచుఁ బెద్దలు వచింత్రు
కాన లేవయ్యె నర్ఘ్యయోగ్యతలు నీకు. 204

క. స్వాయంభువ మనుకులమున
నీయంతటి నృపుఁడు లేమి నిన్నీక్షింపన్
నాయెడఁద చల్లనగుటయు
నీయన కర్ఘ్యంబు నీయుమీ యని యంటిన్. 205

క. ఈకుట్ర మత్ప్రసాద
స్వీకృతిని త్రికాలవిషయవేది యగుటచే
నాకుఁ బ్రబోధ మ్మొనరుప
నూఁకొంటిని వినఁగవలదె యొప్పెవరనినన్. 206

సప్తద్వీపములందుఁ జూచితివి రాజా యెందు నీదృష్టికిన్
ప్రాప్తంబయ్యెనె యార్యభూమిబలె దాంపత్యార్థభావంబు లు
ద్దీప్తంబుల్ నిజధర్మరక్షణకలా తిగ్మాంశుపుత్రింబునై
లుప్తంబయ్యెనొ నీస్వభావము పురాలోపపరిభావమ్మునన్ 207

స్త్రీ యొకపుణ్యమూర్తి కులశీలగుణమ్ములు జాతివృద్ధులున్
పాయక యెల్లకాల మనపాయత నిల్పెడిభవ్యశక్తి భ
ద్రాయితమూర్తి దానికిఁ దిరస్కృతి సేఁత సమస్తధర్మముల్
మాయఁగఁజేఁత గాదె గుణమాన్యుఁడ వీ విటు సేయవచ్చునే.

స్త్రీ యొకదివ్యశక్తి కలసృష్టికి నెల్ల నిదానభూత శా
క్తేయులు నాతిరిమూర్తులకు దేవిని మాతగ సంభజింతు రా
మ్నాయము లెల్ల విద్యలు సముంచితమూర్తులుగాఁగ వెల్గు దు
ర్జ్ఞేయమహాస్వరూపిణి తృణీకరణ మ్మొనరింపఁబాడియే. 209

స్త్రీయని పూరుషుండని వచింతురుగాని తదేకరూపతా
జ్ఞేయశివస్వరూప మిది నిత్యము విశ్వము లోకసిద్ధికై
మాయనిజంట యందు నవమానము లొండొకటన్ జనించినన్
మాయగఁదన్నుఁదా నెయవమానము సేయుటగాదె చూడఁగన్

స్త్రీయట లేక పూరుషు వచించెడివారలు నుండనేర్తురే
మాయనియద్దమై పతిసముంచితమూర్తి వెలుంగఁజేయు వి
ద్యాయితమూర్తియాచుఁబరమార్థము స్పష్టము సేయనేర్చునా
తీయనిశక్తి కెగ్గులు మదిం దలపోయఁ గొఱంతపుట్టదే. 211

మాయనిశక్తిచేఁ బురుషుమన్ననలం గని వెల్గుచుండు న
మ్మాయకు లోఁగి యొక్క యవమానము సేసి జయమ్ము నెంచుఁగా
కా యవివేకి యాజయముసందుట యారయ మాయగాదె వి
జ్ఞేయము గేయవా ప్రకృతిజీవము స్త్రీయన ధిక్కరింతురే.

పాయసమెత్తి తామ్రమయపాత్రనో యాయసపాత్రమందునో
పోయుజనుండునున్న కిలుమున్ భజియించిన యెట్టిపాత్రలన్
పోయునుగాక దానిగుణముల్ చెడిపోవాకా పాత్రశుద్ధులన్
మాయఁగఁజేసి పై నొకటి మాన్పఁగవచ్చునె యవ్వికారముల్.

ఇంతయు నీవెఱుంగవె మహీశ్వర ! సూత్రపథమ్ముపట్టి యేఁ
గొంతగఁ జెప్పితిన్ సుదతిఁ గొంకక కానల డించెఁగాక నీ
స్వాంతము లో వసించుసతిఁ బాయఁగ నేర్చెనె రత్నపుత్రికా
కాంత తదీయమూర్తి మధురత్వము లెంచుచు నూఱడిల్లదే.

అరయుదు నింత దోసము రవంతయు లేదలరాణియందు మీ
పరిణయవేళ నిన్ను రవిభౌమశనైశ్చరులుఁ భవత్సతిన్
సురగురుశుక్రులున్ గనుటఁ జూవె పరస్పర మిట్టులయ్యె నో
సురుచిరమార భోగ్యములుసుమ్ము పురాకృతకర్మబంధముల్.

అరయఁ బృథక్తనూవిభవమైన సతిం బెడఁబాసియుండి యాం
తరమున జాయఁ బాయకయె ధర్మపథమ్మునఁ దమ్ముఁగొల్చుటన్
వరకరుణావిశేషమున స్వాహాయు నగ్నియుఁ గన్నరూపముల్
ధరణిసురుండు వాసిసహధర్మిణిగాఁగ నెఱుంగు మింతకున్.

అరుగుము నీపురమ్మున మహిమాతిశయమ్మున నీవు దేవి యు
ర్వారను బ్రజానురంజనకరమ్ముగఁ బాలనసేయుచుండ మీ
యిరువురఁ జూడవచ్చెద మహీసురుపన్నినయోగశక్తి నొం
డొరులు మహానురాగవిభవోదయ మంది చిరాయురున్నతిన్.

క. అని దీవించిన విస్మయ
మున మునిఁ గని నృపతి మనసుమూఁగవడంగా
తనుఁ దా నెఱుఁగక కొంతకు
జనితమ్మగు తెలివికతన సంయమిఁ గనుచున్. 218

అనఘ యిదేమి విస్మయము లాడెద రింతకు నాదుపత్ని, యా
వనమున మ్రిందకున్నదియె శ్వాపదసర్పవిషాగ్నిబాధలన్
ననుఁగరుణింపు మొందులలనన్ గ్రహియింపని యావ్రతమ్ము నా
కొనరినయట్టి దీయసువు లుండినయంత కలంఘ్యధర్మమై 219

క. వెఱచెద నెదురాడఁగ మీ
యెఱుఁకువ నావనిత యెందునే నున్నదియో
తొలఁగక జీవమ్మింతకు
నెఱిఁగింపరె యనుచు నమ్మహీపతి వేడన్. 220

కలదు కుమార నీ బహుళ కన్యాగుణస్మరణైకశీల, యు
స్ఖలితపతివ్రతామహిమసంగతి నింతకుఁ దన్మహత్త్వముల్
తలఁచినవిస్మయప్రదవిధమ్ములు నాకును మీరు దంపతుల్
వెలయుట విశ్వభద్రముగ వేల్పులు గూర్చిరి లోకరక్షకున్. 221

అనునెడలన్ బలాకుఁ డట కద్భుతరీతిని వచ్చి మ్రొక్కె న
మ్మునిపతికిన్ మహీశునకుఁ బూర్ణనిజార్థుఁడు వానిచూపులన్
కనఁబడె నపత్రిరక్ష్య మవికార మఖండము సంతసమ్ము, వా
నిని బనిచెన్ మునీంద్రుఁ డవనీపతిఁ దెల్పఁగ నవ్విశేషమున్

వ. అని పలికి యక్కన్యకామణి యమ్మహాదేవిం జూచి తల్లీ!
వినుమిది నాకు విస్మయము వేడ్కయు నయ్యెడు నెంచ నెంచ, నే
మనునొకొ వీఁడు నేఁ గననియట్టిది యచ్చటివృత్త మంచు, నే
వినిచితి నింత కెయ్యదియొ వింటివి నీవును, విందుగాక, నీ
మనము ప్రఫుల్లమై భువనమంగళ మాతనివల్కురీతులన్. 224

క. అని నంద బలాకుఁడు చె
ప్పినగాథ వచింపఁబోవ వినఁబడెఁ జెవులన్
తనతండ్రి తన్నుఁ బిలుచుట
వననిధిగంభీరఘోష భయదమ్మగుచున్. 225

వ. ఆ నాగకుమారిక యవ్వాడా విషయమ్ము నెఱుకపడనీయక యమ్మహారాజ్ఞింగని వినుటనభినయించి అమ్మా! యే నిప్పుడ వచ్చెద, ఇందాఁక నీ కథాకథనమ్మునం దగిలి యవశ్యాచరణీయమ్మగు నొక దేవకార్యమ్ముఁ దడసితి. అది తీర్చివచ్చెద. అందాఁక నీవిందు నిర్భయమ్మున నుండుమని పలికి, తననిర్గమనమ్మునకు నేమియు ననవేరక కథాశ్రవణ విఘ్నశంకిత యగు నమ్మహాదేవిం గని కౌఁగిలించికొని యిదె నీతలంపులోనన మగిడివత్తుఁ జూడుమని యామె యనుమతి నా నంద యటుచనియె నంత నా రాజపత్ని 226

# వితర్కము

ఈకథయెల్ల నుత్తమమహీపతివృత్తము నాదువృత్తమున్
కాక మఱొక్క టెయ్యదియుఁగా దటులేలకొ దాచిచెప్పెడున్
నాకిట నంద యింతకు వినంబడదయ్యెను బూర్తి కాఁగ నీ
నాకథ యంతలంతలు గుణమ్ములు మంగళముల్ ఘటిల్లుటల్.

అతఁడు త్రికాలవేది యని యాడిన దాతఁడు బొంకువల్కనే
అతఁడును బల్కఁడయ్యె నొకయందును బేకులు స్పష్టరీతులన్
కత లివి యిట్టులల్లునొకకౌశలమో నను నూఱడింప సూ
నృతమె యిదెల్ల నంద యెపుడేర్పడఁ జెప్పునొ పూర్ణవృత్తమున్

అతఁడొకవేళఁ బేరు లివియన్న నవిన్ సరిపోవ నొక్కచో
నతఁడును నామె నాపతియు నారయ నేనునుగాక యొండుగా
కత ముగియంగనైనఁ బెనుకష్టము సైఁపఁగ నెట్టువచ్చు నీ
కత యతిచిత్రమయ్యె వినఁ గౌతుకమిచ్చియు నీయదందునే.

కత యిదిచెప్పఁగాఁ దెలియఁగానదొ నందయుఁబై నొకింత యే
యతివయొ చెప్పఁదా వినినయంతయుఁ జెప్పెనె లేక చూచెనో
కత తుదియంటనుం దెలియఁగాఁ జనెనో, యిపుడేమివచ్చె, నా
మతికిఁ బురార్థదర్పణసమమ్మగుదీనిఁ దలంతుఁగా కిటన్. 230

క. అని బహుళ మధురకథ యిది
మననము గావించుకొనుచు మతిపోని చెలిన్

తనమది మెచ్చుచు మాటికి
ననునిమిషము యుగముగాఁగ ద్వారము గనుచున్.

వ. అయ్యుత్తమపత్ని హృదయానందమ్మగు నంద యాగ
మనమ్ము ప్రతీక్షించుచున్నంత. 232

క. అపృథక్సిద్ధమిథునతా
వపుర్విశేషా శిరస్థబాలేందుకలా
కపటస్ఫుట పంపావీ
చి పయోరేఖా ప్రసార చిహ్నకపర్దా. 233

వసంత శ్రీకాకుళేశ్వర వరిష్ఠమహావిశేష
తిలక శ్రీకృష్ణరాయ నృపసింహవిభుత్వభూమీ!
శ్రీకాశికాంచిముఖసిద్ధపురీనివాసా!
లోకైకసాక్షి గుణలుబ్ధ తమోవిదారీ.! 234

సారక్షోణిభృదుత్తమాంగ విలసత్సౌభాగ్యభూ స్వర్ణదీ
నారాసేకవివాదజృంభి నవసాంద్రజ్యోత్స్నికావాహినీ
శ్రీ రాజద్ధరహాసదుగ్ధజలధి శ్రీనాథదుద్యత్కృపాం
కూరాకార కటాక్ష రక్షితజగత్కూటా! లలాటేక్షణా. 235

క. భారద్వాజసగోత్ర కు
బేరవనీ విహృతిరసిక వృషభేశ్వర మ

ల్లారాధ్యాత్మజ హృదయమ
హారజత నగాధివాస యంబరవాసా. 236

క. జనవినుత కాంచికాఖం
డ నవీనసహోదర ప్రణయ మధురంబై
చను నుత్తమమనుసంభవ
మున రెండవయానమ్ము పొదలు శివుకృపన్. 237

శ్రీరస్తు

# ఉత్తమ మను సంభవము

## తృతీయాననము

క. శ్రీపింగళి సూరవచ
స్థాపిత శబ్దార్థ బహువిధాశ్లేషకథా
దీపిత వాగర్థమయ
వ్యాపృత దాంపత్య సుకవితావననిత్యా. 1

వ. స్వామీ ! అవధరింపు మట్లు పరమధ్యాన బహుళయగు
బహుళామహా దేవి యెట్టయెదుర 2

శ్రీకరమూర్తి నంద యటు సేరెను దా నొక పుణ్యసాంధ్యరే
ఖాకృతి మూకమూక పదహంసకయాననిసర్గ యుత్తమ
శ్రీకరపద్మరాగరస చిహ్న పయోధరగూఢ చంద్రరే
ఖాకృతి యైనలేఖఁ గొని యానిశవోసిది దేవిసన్నిధిన్. 3

చీఁకటు లింతనంత వెనుజేరిన యట్లొకమూర్తి వెంట రా
నా కమనీయమూర్తి చెలిహాస్తమునన్ మృదురీతి నుంచె సు
శ్లోకము నుత్తరమ్ము నది చూచియుఁ జూడనిదయ్యె రాణి య
ప్రాకృత భర్తృచింతన పరమ్మగు చిత్తనిమీలనమ్మునన్. 4

క. ఆనందాకృతి యగుసతి
నానందయుఁ దెలుప నిప్పు డవసర మనుచున్
మానమ్మునఁ జేసన్నల
చే నియమము సేసె వెనుక చిక్కనమూర్తిన్. 5

వ. అంతదనుక స్పష్టాస్పష్టప్రకారమ్ముల నందందునున్న యమ్మూర్తి విశేషమ్ము నందాకుమారి యాదేశమ్మునం బ్రిస్ఫుటపురుషాకృతి భజించి భూమాతకు నంజలించు నంగారకు మంగళాకారమ్ము దీపింప నమ్మహాదేవి పాద కమలమ్ముల కంతంత మ్రొక్కి భక్తి వినయ వినమిత గాత్రుండై ప్రిస్ఫుట గంభీర మనోజ్ఞ సాంత్వన మృదుల స్వరమ్మున. 6

తల్లీ! యేనల యుత్తమప్రభుని దూతన్ మీకు భృత్యుండ న
స్మల్లక్ష్మీపరిణామముల్ శుభములై మా నంద రూపమ్ములై
ఉల్లాసిల్లెఁ ద్రికాలమాని కరుణాయోగమ్ములై విప్రు భా
స్వల్లీలాకృత యజ్ఞమూర్తులయి మీచారిత్ర సంపన్నతన్ 7

వ. అని యతండు మఱల సాష్టాంగ దండప్రణామమ్ము సేసి యాసతిదృష్టి కించుక తొలంగి నిలుచు నెడల నారాణియు నప్పలుకులు వినియు భావనాబలమ్మున వినుటలుగాఁ దలంచి యవి యట నిక్కమ్ములగుటయు, 8

అక్కట యీగ్రహమ్ములకు నంతటిశక్తియె యట్టులౌటనో
సొక్కదు నామనమ్ము పతిఁ జూచుట కేనియు నింతలింత లీ

చిక్కులఁదీర్పఁగాఁ దలఁచిచేయునొ జన్నము భూసురుండు పెం
పెక్కిన పేర్మిఁబూర్వకృత మెంచుచు మమ్ము ననుగ్రహించునో.

ఇంత కెఱుంగనయ్యె నొకయింతయు దోసము నాకులేమి సి
ద్ధాంత మొనర్చె నమ్ముని యథార్థముగాదొకొ వానిపల్కునే
నింతన పోదునో యెవరినేనియుఁ బంచునొ తాన వచ్చునో
కాంతుఁడు నన్నుఁ గైకొనఁ ద్రికాలమునీంద్రునిబోధనమ్ములన్.

అంతకు నాఁగఁజాలుదునె యచ్చట కేనయి పోదునన్నఁ బ్రా
ణాంతకుఁ డీ భుజంగపతి యక్షులఁ బ్రాముచుఁ బోవనిచ్చునే
ఇంతగ నన్నుఁ గాచుఁ జెలి కేనియుఁ జెప్పకపోవు టెట్లు దా
నింతన వత్తునన్న చెలి యేలొకొ యింతకు రానిదయ్యెడున్.

క. అని యామె నంద నయ్యెడఁ
గనఁ దలఁచుచు విచ్చుకనులఁ గనఁబడుటయు నా
తనుఁ డతఁడు బెదరుచూపులఁ
గనియును నా సౌమ్యమూర్తిఁ గడుబెదరుమదిన్. 12

పురుషులు చేరలే రనుచు మున్ను వచించెను నంద యిందు, నీ
పురుషుఁ డెవండు నాగపతి పూనిన వేషమొ కాదు సౌమ్యతా
స్ఫురితము వీనిమూర్తి పతి చూడఁగఁబంచిన దూతయో కథా
స్మరణబలమ్ము గాక యిది సత్యమె యంతటిపుణ్య మబ్బునే. 13

తలఁకియుఁ వీనిఁజూచి యొకతాపముఁ బాసినచంద మయ్యె దుః
ఖిలెడి మన మ్మి దెట్లొ చెలి క్రేవలనుండిన విప్పిచెప్పదే

అలఘువిచార యంచుఁ గలఁగంబఱికింప శిరమ్ము నెత్తుచోఁ
గలకల లీనుసవ్వులఁ బకాలున నవ్వుచు నంద యాసతిన్. 14

కరము కరమ్ము గీలుకొనఁగా దరిఁ జేరుచు, స్వామిదూత యా
వెరవరి చెప్పఁగాఁ గొదువ విందువుగా కనురీతి సైఁగలన్
బరిచయుపెట్టె నెంత మృదుభావమొ యెంత రహస్యమో వచ
స్సరణుల కందదో పరిణయబంధము తెల్పెడిరీతు లట్టివో. 15

నంద యపూర్వవృత్తము కసన్, గడువిస్మయ మందెరాణి యా
నందయు వానిఁ జూచుడు ఘనమ్మగు భక్తిని గేలుమోడ్చి యా
నందను రాణి మ్రొక్కుచు మనమ్మున తేనిఁ దలంచి మ్రొక్కి యా
ఐందవరేఖ మున్నుఁ దనయాడినపల్కుల నూహసేయుచోఁ.16

తల్లిరో ! యుత్తమప్రభు పదప్రియభక్తుఁడ నేబలాకుఁడన్
తెల్లముగా నెఱింగి నినుఁ దేఁబని చెన్ నను స్వామి నందచే
నెల్ల యెఱుంగు దాకొదువ యించుక యేర్పడఁ జెప్పనెంచి, నీ
యుల్లము విశ్వసించి నను నుత్తమభృత్యునిగా నెఱుంగఁగన్

వ. అనుటయు నాబహుళ నందచెప్పినవృత్తమ్మున వినంబడిన
యాతం డీతండో కో వైశాలిని హృదయవికారంబు నపహ
రించిన యిమ్మహితుని పుణ్యదర్శనమ్ము నాకు మేఁగొనఁ
గూర్పదే యని సబహుమానమ్ములగు చూడ్కుల నతని
సంభావించి ఓయన్న ! నీవిందుఁ గూర్చుండి నీయెఱిఁగిన
వృత్తాంతంబు పలుకుదువుగాక. ప్రతిపదమ్ము నద్భుతమ్మగు

నియ్యది నిక్కమ్మని నిశ్చయింపలేకున్నదాన. అత్యంత
హృదయసంబంధి విషయమ్ము లిట్లు శంకితమ్ములగుట
సహజమ్మగాదె. అది నీ పలుకుల నేర్పడం దెలిసెదఁగాక
యనిన. 18

ఇది విని యద్భుతమ్ము జనియించిన నమ్మవో తల్లి! నంద నీ
కెది మునుచెప్పె వృత్తమది యెల్లను దథ్యముగా నెఱుంగు మీ
కొదువ కథం దలంచి తుదకన్ ఘటియిల్లిన నిర్ణయమ్ము నీ
హృదయమ యేర్పఱించు నదియే యగు మార్గ బ్రమాణ
మన్నచో. 19

క. వరవర్ణినీశిరోమణి
వరవర్ణిని నంద యిడిన వరలేఖను దాఁ
గరమునఁ దాల్చియు నెఱుఁగని
పరవశతను బలుకు మనినఁ బయికథ నతఁడున్. 20

క. జననీ! వైశాలిని నేఁ
దనపతి కర్పించి మునిని ధరణీపతిఁ గ
న్గొనుట యెఱుంగుదు మునిపతి
యనుమతి నా తెలిపినట్టి దాకథ వినుమీ. 21

## బ లా క క థ న ము

అలవైశాలిని గొంచు నట్లరిగి యేన వ్విప్రుఁ దర్శింప నా
యలఘుస్వాంతుఁడు మెచ్చఁగాక మును చౌర్యంబెంచి కోపింపఁడా

తలఁపు ల్పుట్టెయు నుత్తమపతిభుని భృత్యప్రీతిమో కాక యె
వ్వలనం దప్పని వానినైజమొ ప్రియాప్రాప్తిస్ఫురన్మోదమో.

ఆవైశాలిని మ్రొక్కి నాథుని నపూర్వాకార భక్తిప్రియ
శ్రీ వైశిష్ట్యమెసంగఁ బూర్వకృత దుశ్శీలంబు మన్నింపవే
దేవా! ప్రోవవె దాసురాలినిఁ గృపార్ద్రీభూత చిత్తమ్మునన్
నావిజ్ఞాపనఁ గొంచు నా నతఁ డనంతస్మీతచిత్తాత్ముఁడై. 23

అల వైశాలిని గాదొ యీమెయి నపూర్వాకారశీలమ్ములన్
తలఁపం జిత్రములయ్యె నిద్ది యతిరాత్రశ్లాఘ్యపుత్రీభవత్
విలసత్తేజము గాదె యంచును సతి స్వీక్షించివీక్షించె నా
లలనా ఫాలతలప్రభాకర విభాలక్ష్మమ్ము దివ్యాకృతిన్. 24

చూచియు నమ్మనట్లు ననుఁజూచుఁ బ్రియం బరికించిచూచి తా
నేఁచినవిస్మయమ్మున నిదెట్లొకొ యంచును శోత్రియుండుమున్
నోఁచనియట్టి పుణ్యసతి నూతనశీలము రూప మెంచుచున్
తోఁచియుఁదోఁచనట్టియొకతోయమువాఁడగునాథు నెంచుచున్

క. ఏ నా వైశాలినిగా
దే నాథా! యేల యింత యేర్పఱుపఁగ లే
వీ నానూతనసంపద
లీనిర్మలచరితు కరుణ లింతలుసేసెన్. 26

క. అని నన్నుఁ దెలిపి భూపతి
పనుపున నాసేవఁ దెలియఁబలికి ప్రియమునన్

జననాథుని వృత్తాంతము
తనయెఱిఁగిన యంతవట్టు తప్పక పలికెన్. 27

పలికియు నంతఁ దా నిలక భర్తను గన్గొని సోమిదమ్మ, యీ యలఘుచరిత్రముం దెలియునంతనకా దిఁక మీాదుసత్తపః ఫలములు నగ్నిపూజ లనివారితసిద్ధ మదీయపుణ్యముల్ ఫలితములై యొసంగు నొకపాటి మహాకృతి సేయఁగావలెన్.

## విప్ర దంపతీ నిశ్చయము

క. ఇదియొక ప్రత్యుపకృతియే
ఇదియొక నిజధర్మరతియె, యిది నృపకృతియే
ఇది యెమ్మెయి రూపించెద
మది నాపయి నీదు ప్రేమ మహిమ యవధిగా 29

అది యటు లంతగాఁ జలుపనైన దవశ్యము నన్న, విప్రుఁ డ మ్ముదిత పరోపకారగుణమున్ మది మెచ్చుచు సోమిదమ్మ యె ట్టిది యది యేర్పడంగఁ బ్రకటింపుము శక్తికొలంది నేను జే సెద నది నీతలంపులకు సిద్ధిఘటించుట నేఁడు క్రొత్తయే. 30

క. తలఁచినది నీవటే, నీ
తలఁపుల వర్తించు నేను దప్పుదునటవే
కలదె యిది మున్ను చేయఁగ
వలదే యుపకృతికి బదులు పౌరుషమునకున్ 31

ఇది గడు లెస్స, యిమ్మహీతునిష్టముఁ దీర్తునో తేని కొక్కసం
పద ఘటియింతునో తెలియఁబల్కు మటంచును నాథు మెచ్చు
మొదటిదిసిద్ధ మెట్టులునుభూపతివృత్తము చిత్తముంగనన్ [చున్
చిదురుపలయ్యె నాకరినచిత్తము నవ్వాడునివ్వ డేమనన్. 32

వ. ఇంతయేల? తొల్లింటినా చందమ్ములు మీర లెఱుంగుదుర కాదె? అట్టి నాచిత్తమ్మున కేని యిది యాతనిదోసంబని నిరూపింపనయితి కానట్టి యుత్తమచరిత్రు వలచి వలపింప నేరని యారాణి యెట్టిదియో. అంతలు సేయు నారాణిం దలంచి తలంచి కృశించు నాప్రజాపతి యెట్టివాఁడో. ఏ నెఱుంగ నేరనయ్యెద. ఇదియెఱింగి నిరూపింతురు గాక. ఇంతటి యుపకృతిమ్మె చెల్లింప నా కెట్లువచ్చు. ఇదియెల్ల మీదివ్య బోధమ్మునం దెలిసి తీర్పరింప వలవదే యనిన నద్భుతాక్రాంతచిత్తుం డగుచు నాభూమీసురుం డిది యెట్లు? మా రాజదంపతుల యాంతరవృత్తమ్ము లిట్టివానిగా ఇందాక నూహింపనయితి నని తలంచి, తా నా రాజు నగ్నిశరణమ్మునం గాంచిన, రత్నపుత్రికామనోహార యగు రాణిని నప్పటి యా ప్రజాపతి యాకారవిశేషమ్ముల స్మరియించి, నిజ గృహిణీ ప్రశ్నసమయ విశేషమ్ము జ్యోతిర్విద్యావిశేషమ్మున నిరూపించుచు నాంతరదృష్టి నవియెల్లం బరిశీలించి యేర్పడిన యొక నిశ్చయమ్మున నన్నును దనసాధ్విం గనుంగొని, మీయిరువుర యభీష్టమ్ముల కాదు. సకలజనమనోరథ

మ్ములు సిద్ధించుశుభసమయ మ్మాసన్నమయ్యె. తన్మహా
సిద్ధి నలవరింప నేను నిమిత్తంబ నయ్యెదంగాక. అంతట
నాజన్మమ్ము కృతార్థమ్ము గాదె యనిపలికి మఱియు నిట్ల
నియె. 33

క. రవి భౌమ శనైశ్చరులున్
కవి బుధ గురు లెలమి నిలిచి కనుఁగొనుటను ని
ట్టి విశేషమ్ములు పుట్టెను
వివాహలగ్నమ్ము గతుల విభుని కీ సతినిన్. 34

గతము గతమ్ము నేనిపుడ కైకొని చేసెద మిత్రవింద వి
శ్రుత మగునిష్టి దాన నవిరోధిత నుందురు రాజు రాణి, యీ
శ్రుతములు నగ్ను లెన్నఁటికిఁజొప్పడు నంచుఁ దలంచియాప్రతి
శ్రుతవచనుండు పూనికొనె రూపితదీపితమా కృతజ్ఞతన్. 35

వ. అంతట నమ్మహీతు ననుమతమ్మున 36

క. అయ్యిష్టి విశేషమ్మున
కెయ్యవి కావలసె వస్తు లే నవియెల్లన్
జయ్యన సమకూర్చుచుఁ బయి
నియ్యెడ కేతెంచువేళ నింతియుఁ బతియున్. 37

మఱువఁగరాని చుట్టమవు మాకిపుడై తిగదన్న నీవు చె
చ్చెఱఁజని యెల్ల నా నృపతిసింహునిచిత్త మెఱుంగఁజెప్పవే

కొఱఁతలులేవు రాణినిటకుంగొని తేరఁ దిరికాలవేది దా
నెఱుకయొనర్పఁ జేయఁగలకర్జము లన్నియు నీకునయ్యెడన్.

క. అని పనిచిన జనుదెంచితి
నసఘా మీదివ్యచిత్త మరసినయది నన్
బనిచినపని చేసెద నని
వినయమ్మున మునికిఁ బతికి విజ్ఞాపింపన్. 39

ఇదియెటు లిట్టులైనదియొ యిమ్మహి దేవునిసేవ యంచు స
మ్మదపడు రాజు చూపుల సమగ్రములై భవదీయవృత్త సం
పదలును బ్రస్తుతమ్మగు నివాస మెఱింగెడి ప్రశ్నరీతులై
హృదయముచొచ్చినన్ మునియు నేర్పడనిట్లని యెన్ ముదమ్మునన్

సీ. ఉత్తమక్షోణీశ ! ఉవిద నీవొంటిమై
నడవులఁ ద్రోపింప నతివఁ జూచి
సాలపోతకుఁ డనుసర్పేంద్రుఁ డొకండు
వలఁచుచు నాబిడ్డ వలవకునికి
ఆసతి నంటగా నైనను దలఁకుచు
మాయచే నందొకమగువఁ జలిపి
తననివాసమ్ము పాతాళలోకమునకుఁ
గొనిపోవ నదియెల్ల గూఢవృత్తి
వానికూఁతురు నంద యన్వర్థసంజ్ఞ
బ్రహ్మచారిణి పసిపట్టి రాణిఁ దనదు

నంతిపురమున నిలిపి యత్యంతరక్తు
కొనియెఁ దనతల్లి సవతి కాఁగూడదనుచు. 41

క. అక్కరణి బహుళ రక్షా
ధిక్కృతనాగేంద్రి యగుచు దేవి గలదు నీ
విక్కడ నక్కడ వెదుకక
యక్కడకు బలాకుఁ బనుపు మన్నియుఁదీఱున్. 42

వ. అని పలికి యమ్మునిచంద్రుండు నలుదెసలు గలయం
గనుంగొని. 43

క. అక్కామిని నోదార్పఁగ
నొక్కట నీచరితఁ దెలియ నొగి నీనీడం
ద్రొక్కుచుఁ దిరుగుచు నందయు
నిక్కడ నిందాక యుండి యిప్పుడ యేఁగెన్. 44

కావున నోనృపాలక జగన్నుతశీలురు నీవు దేవియున్
కేవలమర్త్యులే ? యొకఁడు గీడది విప్రనిమిత్రవిందచేఁ
ద్రోవఁగబడ్డ దింత కొకదోసము లేదు ప్రజాభివృద్ధులై
నీవును రాణి వర్ధిలుఁడు నిర్భరలీలల నేకచిత్తులై. 45

వ. అని భూత భవ ద్భావి విషయమ్ములు దెలిపి యాశ్చర్యభర
నతుల మమ్ము నాదరాతిశయమ్మునఁ గనుంగొని. 46

క. మీయిరువురు నతిథులరై
మాయాశ్రమమందు నేఁటిమాత్ర నిలువుఁడీ

పోయెదరుగాక మీఁమీఁ
చేయంగలపనులు దామె సిద్ధిని జెందన్. 47

వ. అని పలికి య య్యంతేవాసి దెసం గనుంగొనిన 48

అమ్మునియానతిం గొనుచు నాయనశిష్యుఁడు నంతవాఁడు మా
కిమ్మగుపట్టులందు విడియించుచు సర్వ మెఱుంగఁ జెప్పె, నో
యమ్మ భవన్మహాత్త్వము లహంకృతసర్ప విషాగ్నివర్ష ద
భ్రమ్ములు నాకలోక సుమవర్ష నిమిత్త నభోనభస్యముల్ 49

క. అమ్ముని యాతిథ్యవిశే
షమ్ముల నాశిష్యజనుల సౌహార్ద వచ
స్సమ్మిళిత బహుళ గోష్ఠీ
సమ్మోద క్షణద యగుచు జనె నాపగలున్. 50

## సందేశము

అమ్మహిపాలవరాళి రవియ స్తమయమ్మఁ బ్రదోషమున్ దమ
స్సమ్మిళిదభ్రసాంధ్యము సిశాగమునమ్ము నెఱుంగ కే నిశీ
థమ్మునఁ బ్రొద్దిశన్ దనవిధమ్మునఁ జిక్కిన మేనికాంతు లు
గ్రమ్ములుసుందరమ్ములయికిన్నసమిన్నులువ్రాఁకుచంద్రునిన్

తనమతిపోలెఁ జూచి వివిధమ్ములు కాంతులనూహ లెన్నుచున్
వనగత బాంధవావళి జన ప్రియసంఘటనైకశీల! నా
వనితను దెచ్చి కూర్పఁగలవాఁడవె మానివరేణ్య! నేత్రి సం
జనితమహాస్స్వరూప! కడుచల్లఁ తండ్రి వనుగ్రహింపవే. 52

కువలయబాంధవుండవు చకోరసఖుండవు సర్వమంగళా
ధవకృతమస్తకాభరణతా సుమనస్స్పృహణీయమూర్తి వై
భవుఁడవు తారకాజన సభాజన దక్షుఁడవున్ నిశావధూ
త్సవ నవమూర్తివిన్ గట! నిశాచరనామము నీకుఁ జెల్లునే. 53

ఫణిపతిలోక బద్ధమగు ప్రాణము తెమ్మని వేఁడుకొందు నా
ఫణులకు నీకు బద్ధపరిపంథిత తెంచియు రాజశేఖర
ప్రణుతశిరః ప్రసిద్ధసహవాసనిబద్ధము మైత్రిచేఁ బ్రతి
క్షణద విభాసమాన తనుకల్పిత సర్వబుధాళి జీవనా. 54

కలితాభ్రాపగరాజహంసవు బలాకభ్రాంతిఁ గల్పింతువే
లలనాచారులలాట బాంధవ మహోల్లాసమ్ము నీమూర్తి రే
ఖలు చిత్తమ్మున ఖడ్గపుత్రికలు వక్రభ్రూవిలాసానుకా
రి లసత్ప్రకటాక్షరేఖ లగుచుఁ జృంభించె నేట్లోర్చెదన్.

క. నలదమయంతీ దౌత్య
చ్ఛలకలహంసా వియోగిజన వృత్తవిని
ర్మల ముకురా సందేశక
వలాహక నిగూఢ పరమవార్తాలేఖా

పాతాళమ్మునుండి వచ్చితివె విశ్వమ్మిద్ది వెల్గింపఁగా
నేతత్కార్యముఁ జేసిపెట్టఁగదవోయీ వెండియున్ బోదువే
నీతోయమ్ము ముఖమ్ము గండములునై నీచెల్వకందోయి యై
పాతాళమ్ముననున్న నా బహుళ సంప్రశ్నమ్ము గావింతువే. 57

బహుళపదమ్ము విన్న వెనుబాటు వహించెనో చిత్త మిప్పుడా
బహుళ నవీనశుద్ధగుణబంధుర గానవె దేశకాలముల్
బహుళములై ఘటిల్లుపొరపాటు జనమ్ము వహించుగాక, యీ
బహుళసితప్రభేదములు పట్టునె నీ కెట విశ్వవర్తికిన్. 58

అపుడే చొచ్చితె యభ్రవీధియను కృష్ణాంభఃప్రవాహమ్ములన్
విపులాభ్రమ్ముల కొత్తవెల్లువలలో విస్పష్ట మస్పష్టమై
ఎపుడీరీతిని బోవుటే సహజమో జృంభింతు రేమైనఁ గ
ష్టపుఁ జిత్తమ్మిది జంతు నెన్నిసుడిగుండమ్ముల్ ఝరీవేగముల్

మనమున కందరానియతిమాత్రము వేగము నందిపోకు, మొ
క్కనిముసమాగు నీవిధికిఁ గాదొకయడ్డు నిదొక్కమాటయే
విని యటుపొమ్ము సుంత వినవేళయె లేదొకొ నీవె లేఖవై
చనియెదుగా కెటన్ బహుళ సంతమసమ్ము నడంతువే కదా. 60

వ. అని మధురప్రకృతియగు నమ్మహారాజు ప్రకృతివిధురుండగుటయు, మదేకభృత్యకృతోపచారశిశిరవచనమ్ముల నంతంత విశదహృదయుండయి కన్నులువిచ్చి ప్రసన్నవీక్షణమ్ముల నాపయిం బఱపు నెడల బహుళయామ యగు నాత్రియామ యరుణకిరణు కరమ్ముల నులివేడిమికి వెఱచఱచి పఱచినటులయి, యీఁగరాని పగల వెనుఁదగిలిన యా పగటియంద శరణార్థినియై లీనమ్మగు చందమ్ములు పగటు చాడ్పున వెలవెలంబాఱె అవ్విజయమంగళ నిస్స్వనమ్ములనువదించు విధమ్మునం గులాయమ్ముల ద్విజకులమ్ముల

కలకలమ్ము లెసంగె. ముని శిష్య పాఠపఠన ప్రబోధ
బంధుర మ్మగు నయ్యెడల నేమును గాల్యకరణీయమ్ముల
నిర్వహించుకొని య క్కులపతిం దర్శింప నుత్సహించు
నెడల 61

అంతకమున్న మమ్మరయ నచ్చటవచ్చినవారిని, రాజ, నీ
వింతట విప్రజన్మమున కేఁగుము నీవట నేరులోన, నీ
కాంత నితండు దెచ్చు నటఁగల్గిన యజ్ఞమహాఫలమ్ము, నీ
కాంతయు నీవు నంది చిరకాలము వర్థిలుఁ డిష్టసిద్ధులన్. 62

క. విజయాకరకృతశిశిరము
లు జయ వసంతోత్సవమ్ములును బహుళామో
దజములు మంగళములు నీ
ప్రజలకు నుత్తమతనయ విరాజితములగున్. 63

వ. అని దీవించి శుభశకునమ్ములు నిరూపించుచుఁ జరణ
చారమ్మునన యా తపోవనమ్ము మమ్ము ననుపు ను నమ్మౌ,
పతి తలంచికొని యానృపతి కేకాంతమ్మున నొక్క రహ
స్యమ్ము నెఱిఁగించి యిదియిట్లు చేయింపు మనుడు న మ్మహీ
పతియు నదియట్ల యగుంగాక యెల్లశుభమ్ములకు దేవర
యనుగ్రహమ్మె ప్రమాణమ్మనియె. పదంపడి యమ్ముని
నన్నుపలక్షించి నీవు సాలపోతకు నెఱుంగుదువుగాదె నందా
కుమారి నర సెదవుగాక అని హెచ్చరించి పలుక నేనమ్మహా

మునీంద్రు చరణాంభోజమ్ముల కభివాదనమ్ము గావించు
టయుఁ బునఃపునరాశీర్వాద ప్రసన్నమధురమ్ము లగు
చూడ్కుల మమ్ము నభినందించుచుఁ బునర్దర్శనంబయ్యెడు
మీకుశుభం బగుఁగాత మని యెట్టకేలకు వీడుకొలిపి మగి
డిన నేనును బ్రభువులయనుమతమ్మున రథమ్మధిరోహించు
నవసరమ్మున నాస్వామి 64

హృదయమువోని చుట్టమవు నిష్టుఁడ వంచును నిన్నెఱుంగఁగా
నిది యలదేవి కిమ్మనుచు నెంతయు నన్ను బ్రియమ్ముపల్కుచున్
హృదయమువోనిలేఖ యొకఁడిచ్చిన నేను మహాప్రసాద మం
చది వినయమ్మునన్ గొనఁగ నాపతియెక్కె రథమ్ము నర్మిలిన్.

ఏనును స్యందనమ్మపుడ యెక్కితి భూపతియాజ్ఞఁ జేసి నా
మానస మా నృపాలుమహిమమ్ముల నెంచఁగ తేనిచిత్తమున్
దానయి నాకురక్షణవిధమ్మును దాల్పఁగఁ బొంగిపొంగి కృ
ష్ణానది పాయువిచ్చుగమనమ్ములఁ దేరులు రెండుసాగినన్. 66

ప్రాతస్సూర్యవిభాసురుం డగుచు నారాజేగ నుద్యద్గతిన్
పాతాళాభిముఖమ్ము నారథము పర్వంబర్వ విచ్చేసి యే
నేతత్పత్తనసీమఁ జొచ్చునెడ న న్నేవారు ప్రశ్నించినన్
చూతున్ నంద కుమారి నేననిన నెచ్చో నడ్డులేకుండియున్.67

## పాతాళాభిగమనము

భుజంగప్రియాత స్ఫుటాధ్వమ్ములందున్
నిజాకారరేఖల్ నిగూఢమ్ము లౌచున్
భుజంగప్రియాత స్ఫురన్మూర్తి నందన్
నిజేచ్ఛాపథమ్ముల్ నిరాతంకముల్ గాన్. 68

నిరాఘాటలీలన్ నిరాడంబరశ్రీ
కరాఽకార వారాఽకరోత్తుంగ వీచీ
స్ఫురన్మూర్తి శోభాభుజంగేంద్రకన్యా
వరావాస సౌధ ప్రభాబద్ధదృష్టిన్. 69

ఇచ్చటిపర్వవేళ ఘటియిల్లిన యుత్సవలీల లెన్నుచున్
వచ్చుచు నేను నీగృహము ద్వారము సేరెడునంతలోఁ గనన్
వచ్చెను నాగరాజు తగువారును దానును బుత్రిఁ జూడఁగన్
హెచ్చినకౌతుకమ్మున కొకింతయు దగ్గని చిత్తరీతులన్. 70

ఎఱిఁగియు మున్ను నేనతని యేఁచినయప్పటిరూప మొంచి నా
కఱపెడివేళ గా దితని కర్జము చందము లెల్ల నింతకే
నెఱిఁగెద నంచు నందతని యిష్టులలోపల నొక్కరుండనై
మొఱఁగితి నింతయున్ దెలియఁబోఁ డతఁ డన్యనిబద్ధదృష్టియై.

ఇమ్మెయిఁ జొచ్చి యాగృహబహిస్స్థిత దివ్యగృహాంతరమ్మునం
దిమ్మగఁ గొల్వుదీర్చి యొకయింతిని బిల్చి కుమారిఁ దానుగా

రమ్మను వార్తపుచ్చి సుత రాకడ వార్చెడునంతలోన, నే
నిమ్మహిళాలలామ నట నేర్పడఁ గాంచి ప్రబోధసంపదన్.

క. నందయు భద్రియు జయ యన
నెంమను నుతిగన్న తిథులయేకాత్మశ్రీ
నందుచు హృదయానందము
లందించెడి యీమె నంద యగు ననుకొంటిన్. 73

స్వాగతము వ్యాకులత్వ మసియాడినచందం
బీ కుమారి మొగ మించుక చూపన్
మూకముల్ గమనముల్ నయనమ్ముల్
మూకమైన మనమున్ వివరింపన్. 74

మ్రొక్కెం దండ్రికి ముగ్ధ యతండా
డిక్కుం జూడక తీవ్ర రుషా ము
గ్దృక్కుల్ నించుచు జృంభితరీధా
వాక్కుల్ వక్కె సభన్ వివశుండై. 75

## నందా జనక సంవాదము

ఏటికి నేను దెచ్చుసతి నింతటిలోన హరించితేర నీ
కేటికి దాచికోఁగ నిదియేమి యొనర్చితి వేనెఱుంగనే
బోఁటులు చెప్పరే తెలియమో యిటఁజెల్లక నాదురాక యూ
బోఁటిని నాకొసంగు మిఁకఁ బుత్రివి గావున నింత చెప్పితిన్.

క. గాటముగు పేర్మిఁ దెచ్చిన
బోటికిఁ దుల్యమ్మ సేయఁ బోలునె నీ కే
నాటం దండ్రులకూర్ములు
పాటింతురుగాక విఘ్నపఱతురె పుత్రుల్. 77

అరుదగు బ్రహ్మచర్యమున నాదరణమ్ము వహించునీవు నీ
వరసతి నీదుబోధలకుఁ బాల్పడఁజేసెదొ చెడ్డక్రోఁతివై
వరమిడువాఁడఁ గోరు మనివార్యముగాఁగ నొకండు నీకు నా
తరుణి నొసంగునాకు వెడదారులఁబోకుము కిన్కదేకుమీ. 78

క. కన నీదుతలనె పుట్టెనొ
జననిప్రబోధమ్ము యెంతసాహస మవురా
చనవు లవియెందుఁ జెల్లినఁ
జనునే కన్యకల కిట్టిచందము లందున్. 79

క. ఎఱిఁగియొ యెఱుఁగకొ చేసిన
తెఱుసంటితనమ్ము దీనిఁ ద్రవ్వఁగ నేలా
అఱసేయక నీదాచిన
తెఱవను నాకొసఁగు మంతఁ దీఱెడినెల్లన్. 80

వ. అని యిట్లు విశృంఖల పరికారమ్మున 81

క. తగు నిది తగదని వగవక
భుగుభుగులాడినబుద్ధి భుజగేంద్రుఁడు పో

రగిలిన తాపాగ్నుల వెలి
దిగిచెడు పలుకులఁ గుమారిఁ దీవరపెట్టన్. 82

కనలి భుజంగరాజసుత కావఁగరాని మనోవికారముల్
తనమదియం దడంచి, యటు తండ్రిమొగమ్మయి నీకుఁజెల్లునే
చనవులు చెల్లవే యిదియు సాహసమే సరివారు నవ్వరే
జనక! భవాదృశుల్ సలుపు సంగతు లిట్టివె యేజగమ్ములన్. 83

క. వనితల గుణశీలమ్ములు
వనితలె రక్షించికొనఁగవలయుట లైనన్
కన విన ననింద్యములు మగ
తనములు గలవారి తలలు దన్నుట లయ్యెన్. 84

క. జనకులు తమ తనయులతోఁ
బొనరుచు మంతనములుం బ్రబోధము లివియే
తనసాటిబోటి యెడరుం
గని సైఁచుట లాత్మనాశ కరములు గావే. 85

రూపవిశేషభావముల రూఢిని గాంచియుఁ గాన నొంటి నీ
చూపులఁబడ్డ కాంతఁగొనఁ జూఱలు వెట్టెడు చిత్తదోషమున్
పాపుము తండ్రి! మాజననివంటిది యామె కా పరాభవ
మ్మేపగిదిన్ సహింపనగు నీవె వచించెదుగాక యేర్పడన్ 86

తీండ్రిలుగల్గి ధర్మగుణదీక్షితుఁ డన్నప్రసిద్ధిఁగాంచియున్
వాంఛనుపీంద్రుడనాఁగఁ బెఱభామలపై వలపుల్వహించి, నా

తండ్రియు నేఁడునొక్క యపధమ్మును ద్రొక్కెనటంచువిన్న నే
మండ్రు ననున్, సఖీజనము నాఁడదెనాదగుబ్రహ్మచర్యమున్. 87

అడిగెదఁగాక యొక్కటిది యారసి చెప్పుము నీవు నంటగా
నుడిగియుఁ దత్సతీత్వమునకోడుట నాసతి దాఁ దనంతగా
మడియఁగ నీవు దన్గఱచుమాత్రకుఁ బట్టఁగఁ జేతులెత్తితిన్
నుడివడిపాఱుటల్దలఁచి చూచి యెఱుంగవె తన్మహత్త్వముల్.

క. కౌఱలిన నీ విషవహ్నుల
నుఱికిన నవి చల్లఁబడుటయును గుసుమమ్ముల్
తెఱగంటులు గురిపించుట
లెఱిఁగి యెఱింగియును నిట్టు లేలవలచితో. 89

క. మడియఁగ నీవెనుబడు నా
పడఁతుక యాయెత్తుకేల భాసిల్లిన గా
రుడ తుండ రేఖ సర్ప
ద్విడంఘ్రినఖరేఖ లరసి దిగులుపడవొకో. 90

క. అడుగుము వరమొకఁ డంటివి
యడుగుటకును వేఱగలవె యన్యసతులపై
నుడిగినఁ గోర్కులు, నింతకుఁ
బడయఁగ నైనట్టిదొకటి భాగ్యము గలదే. 91

క. ఉత్తమునిల్లాలగు నా
యుత్తమగుణ బహుళ నంట నొక్కఁడు గలఁడే

ఇ త్తనువు గలుగునంతకు
నుత్తది యీ చెడుతలంపు లుడుగుము తండ్రీ. 92

క. ఆ వెలఁది నుత్తమప్రభు
దేవేరిని భర్తృసన్నిధికిఁ జేర్పుము నీ
భావమున నొందుదలఁపకు
కావుము నా కీ వరమ్ము గరుణ నొసఁగుమీ. 93

వ. అని ప్రార్థించి పలికిన సముత్కట వికారుండయ్యు, బహుళ ధర్మార్థబంధురమ్ములును నిరుత్తరమ్ములగు నిక్కమౌరి సదుత్తరమ్ములకు బదులాడనోడి యియ్యమంగాంచి, యాతండ్రి మఱి యొక్కమా ఆ సతిం దర్శించి పలికించి పోయెదం గాక. ఆమె పలుకులు వినుటకునైన ననుమతింపుము. నా యాగమనమ్ము వ్యర్థమ్ము గావింపకు మనినన్, దేవి మహాత్త్వమ్ము నెఱింగియు మణిమంత్రౌషధసిద్ధుం డగుతండ్రి హృదయమ్ము శంకించి మున్నరణ్యమ్మునందు నమ్మహాదేవి యాతనికిం బ్రతివచన మ్మీయమి స్మరియించుచు నిష్ఫణ్యా చరిత, 94

క. పలికించియు విననోఁచని
పలుకులు మును నేఁడు వినఁగవచ్చునె యిపుడా
వెలఁది తనుఁ దలఁచితలఁచియుఁ
బలవించుచు నొక్కమూక భావము నొలసెన్. 95

మహా అనినంగోపించియాతండవునవునిపుడేమంటివేబాలనీవా
స్రగ్ధర. వనితం గాపాడుకోర్కిం బలికెదు పలుకు ల్వాండితీ
స్ఫోరకమ్ముల్
మునుమున్ దా మూఢభావమ్ములు గను మిట నీ
మూర్ఖతా సత్ఫలమ్ముల్
కనుగొందుంగాక పై నాకలిగినబలిమింగాంతఁ
బల్కింప నెట్లున్. 96

అని శాపించిన సిశ్చలమ్మయిన చూపాతండీ్రచిత్తమ్ము చీ
ల్చినచందమ్మున, నాదుమూఢతయుదాల్చె న్నేఁడుసార్థక్యమున్
కనెద న్నేను గులాంగనాఽనుచిత మోఘంటాపథోల్లంఘన
మ్మును సిద్ధించుట లన్న నిశ్చయము రూపు ల్గట్టి దీపింపఁగా.

వ. ఈ నందాకుమారి కనుఁదమ్ములనుండి విద్యున్నిశితమ్ములు
నుదయదరుణకిరణపరిణతమ్ములు నగు నిరీక్షణమ్ములు నిర్గ
మింప నంతకు. 98

తూష్ణీంభావము గన్ననామనము తోఁబ్రోఁ గొంత దీపింపఁగా
నుష్ణాంశుప్రభలైన తాపములు నా యుల్లమ్ము రాపాడఁగా
కృష్ణావార్థి కవేగరూపముల యంగీకారరంగమ్ములై
జిష్ణు ల్గొండొక భావముల్ సదసుపై జిందెం గదుష్ణమ్ములై.

ఆవేళ న్నిజభావ దీపితము నా యాకారముం గాంచుడున్
భావ మ్మొంతయు విస్మిత మ్మగుచు సంభావించి లజ్జించుచున్

నావిచ్చేసిన కారణ మ్మడిగినన్ నాస్వామికార్యమ్ము నే
నా వేళ న్వినిపింపఁగా భుజగరా జప్పాట నిశ్చేష్టుఁడై. 100

వ. కొండొకవడికిం దెలిసి, యుత్తమప్రభు మహాత్త్వమ్ము నన్నును మున్ను నెఱుంగుటను బ్రభుశాసనమ్మున నా చేసిన వైశాలినీ ప్రబోధమ్మును దలంచుచు, నప్పటి తన చరిత్రమ్మును మీయెడలఁ దనకావించిన మహాపరాధమ్మును, నాగకులవైజయంతి యగు నీకుమారిక కవిచారమ్మునఁ దానొసంగిన క్రమ్మఱుప నేరని శాపమ్మును మొదలుగాఁ దనదుశ్చేష్టితమ్ములు ప్రబుద్ధమ్ములై తననికృష్టతాగరిమ మ్మెఱుకవడుటం దననీచభావమ్మునకుం గుంది మఱల బ్రమాన్పడు చందమ్ము నందునెడల నచ్చటి తత్పరిజనమ్ములు నట్టి విధమ్ము నందిరి. ఈ నంద నన్ను మున్నెఱుంగుటనో తనకార్యమ్మునకు నేను సాధనమ్మగుటనో సహజమధురభావమ్ముననో, యుత్తముప్రభువుల సేవకుండనగుటనో గాని నా పయిం బ్రసన్నవీక్షణమ్ములం బలుకరించినటుల నభినందనమ్ములు దెలిపె. ధర్మవిద్రోహి దండనప్రజ్వలిత ప్రళయదండధర దారుణరూప ప్రచండమ్మగు నప్పటినామూర్తి యీతల్లి చల్లనిచూపులం బ్రశాంతమ్మగుటయు నంతకుం దెలిసిన యచ్చటిప్రజ లాభుజంగమవిభుం గని యందఱు నొక్క మొగిని 101

ఇన్ని దినమ్ములున్ దెలియ మియ్యది సిక్కువుఁగారణమ్మగున్
మున్నువిధమ్ము గావు మనముల్ భయవిహ్వలతల్ భజించె, నా
కొన్నఖగేంద్రరూపములు కోపన రేఖలు తోఁచితోఁచి యో
యన్నరో! యీమె నానృపతి కర్పణసేయుట కార్యమెన్నిటన్.

వ. ఇదియవశ్యమ్ము ప్రప్రథమ కర్తవ్యమ్మని నిశ్చయించి పలికి.

క. మన నేర్తుమె లేకుండిన
మనమున నిదియెంచి చేయుమా యనునంతన్
ననుఁ గనుచు సాలపోతకుఁ
డనెఁ బశ్చాత్తాపపూత మయిన మనమునన్. 104

ప్రాణులదుస్స్వభావములఁ బట్టి గ్రసించుటనైజమైన, యో
ప్రాణసఖుండ! నాదోసఁగులన్నియుఁ ద్రోచి యనుగ్రహింపవే
ప్రాణమువోనివృత్తికి మఱల్పఁగ నేరని శాపమిచ్చు దు
ష్ప్రాణికి నిష్కృతింగలదె పంపుము నీదగునాజ్ఞ సేసెదన్.105

వ. ఉత్తమప్రభువిద్రోహి సగు నన్నెల్లవిధమ్ములం దత్ప్రీతినిధిత్వ
సంపన్నుండ వగు నీవనుగ్రహించి యీవికారగుణమ్ముల
నడంచి స్వామిదర్శనమ్మునకు నన్ను సర్హుం బొనరింపవే

అనునెడ నుత్తమప్రభుమహాదరణమ్మున నిట్టికార్యసా
ధనలఁ బ్రసిద్ధిఁగాంచెడివిధమ్మది స్వామికి మెచ్చుగాన నా
యనఘునిమైత్రిఁదీర్చి యతఁడంపఁగవచ్చితిమిప్పు నీదు ద
ర్శనమున సర్వకార్యముల సాధనలుం బరిపుష్టి నందఁగన్.

అనునెడ రాణి యద్భుతమునందుచు నేదియు నమ్మలేక నం
దను గని యామెకన్నుల యథార్థములట్టివి మూకభావముల్
కనుపడ దుఃఖసంభ్రమిత గద్గదకంఠ విశేషయత్న సం
జనితము లక్షరమ్ముల విషాదము చుక్కలుగాఁగ రాలఁగన్.

తనకయి యెట్టిశాపమును దాల్చితివమ్మరో యీయభాగ్యయీ
జనికిఁ గృతార్థతం జలుపుసంగతి నింతలుదుఃఖపాటు లే
మనఁగల దవ్విధాత్మకృతి కంచును నాయమఁ గౌఁగిలించి, రో
దన మొనరించె నాసుకృతదర్పణ లక్ష్య నిజార్తమూర్తియై.

క. ఆయెడ మాయయొ మంత్రమొ
యాయమ పుణ్యాతిశాయి యగు సంస్పర్శ
శ్రీ యటు చూపిన మహిమమొ
యే యితర మహాఫలమ్మొ యేర్పడ నటులై. 110

కుబుసమువీడి నాగపతికూఁతురు మ్రొక్కుచు నిల్చె దేవి కా
కుబుసమువోలె మూకతయు గుంచితమై తను వీడిపోవఁగా
ప్రబలదురంత శీత శిశిరర్తు విసర్జన కారణప్రభా
శబల వసంతలక్ష్మి మనసారఁగఁ గొల్చెడి కోకిలమ్మయై. 111

ఆనందమ్మున నంద పల్కె జననీ! యాత్మేశ్వరుం జేరుచో
నీ నైసర్గికము ల్మహాత్త్వములు పండించె న్నమున్నేఁడుగన్
తా నే మంచువచించె నీతఁ డదితథ్యమ్మెన్నఁ బ్రత్యక్షర
మ్మే నై చెప్పఁగనేల నీవ కనుమీ యీలేఖ నాద్యంతమున్.

క. అని నంద రాణి కన్నీ
టను దడిసియుఁ దనదుకౌఁగిటను నలిగియు నా
యనఘుకరమ్మునఁ జిక్కిన
మనునిభుఁ డగు రాజు లేఖ మానిని కిచ్చెన్. 113

అచ్చెరువంది దేవి తనహస్తమునం దది యుండుఔంచుచున్
విచ్చుచు నల్లనల్లఁ గనె విస్ఫుటమౌక్తికసుందరమ్ములై
అచ్చులుదీరు ప్రాణవిభునక్షరముల్ చిరకాలదృష్టముల్
ముచ్చటల్ జనింప మొగమున్ దనువుఁ గడునెఱ్ఱవాఱఁగన్.

ఇదియొక యద్భుత మ్మగు మదిష్టసఖుండు బలాకుఁ డిచ్చెనీ
హృదయమువోసి లేఖఁ గని యెల్లప్రమాణముగాఁగ నెంచు మె
య్యది యతఁడాడెఁ జేయఁదగు నాతనిపల్కులు నంద పంపఁగా
నిదియు ద్రికాలవిన్మునిమహీసురుఁ డిచ్చునభీష్టసిద్ధిగన్. 115

అని పఠియించి యావయిని నక్షరము ల్గనిపింప నీక వె
చ్చనజనియించుబాష్పముల సందడిఁ జేసియు నవ్విశేషవా
ర్తను సకలాద్భుతమ్ములును దథ్యమొనర్చుపత్రితోషభావమున్
మనము వహింపఁజాలమికి మ్రాన్పడె మానిని నంద యంతటన్.

క. ఉపచారవిశేషమ్ముల
నుపగతచైతన్యఁ జేయ నుత్తమసతి మీ
యుపకృతికి బదులుగలదే
యుపచారము లెన్నియయ్యె నట నాకతఁన్. 117

అని పఠియించు నాసతియు నా తొలిపద్యమె యెన్నిమాఱులో
మనమున నెంచియెంచియనుమానము వాయఁగ గాథలన్నియుఁ
వనితల భర్తృలేఖ పఠనమ్ముల రీతులొ నిక్క మట్లుగా
మననము చేయఁగావలెనొ మాటకుమాటకు నర్థమెంచుచున్.

క. ఆనాగరాజవృత్తము
దా నెఱుఁగుచు నపుడు నందతల్లియు వచ్చెన్
మానుగఁ దనకీభాగ్య మ
నూనముగా నొసఁగు నా గుణోన్నతులఁ గనన్. 119

క. తననాథుని శాపమ్మునఁ
దనసుత కగు మూకభావతకుఁ దలఁకుచు నా
జనని యిటువచ్చి వినెఁ గనెఁ
దనయాసల్లాపమధురతరమూర్తి సతిన్. 120

వ. కని తదీయరూపమ్మునకుం దనయపలుకులకు నచ్చెరువందు
నెడల. 121

నందయు నప్డు దేవివదనమ్మునఁ జేరిచి మోముఁదమ్మి యీ
యందఱ మిప్పుడేగవలె యజ్ఞఫలమ్మును మీఱ లందుచో
నిందుఁగలట్టి యర్థమిదియేగద యించుక పైఁబఠింపు మే
విందు నటన్న రాణి నునుపెంపులసిగ్గులు దొంతరింపఁగన్.122

క. కనియె నటు లెదురుగా నటఁ
గనఁబడె నా నందతల్లి కని యెంచుచు నం

దను గొని చని యా జననికి
వినీతినర్పణము సేయు విభుసతిఁ గనుచున్. 123

వ. ఆమె రూపగుణవిశేషమ్ముల కధికాశ్చర్యభరిత యగు జననికి నంద యా దేవి నెఱింగించి యా బలాకునిం జూపి సంగ్రహమ్ముగా నవ్యైవిశేషమ్ములం దెలిపిన నామె తన్మ హిమకు వెఱఁగుపడి యప్పతివ్రతాతిలకమ్మునకుఁ బరమ భక్తి నమస్కరించి యామెయాలింగనమ్ము వడసి ధన్యయై బలాకు నుచితంపురీతి మెయి నర్చించె. ఇమ్మెయి వారు నందాముఖమ్మున బహుళసౌహార్ద గౌరవాదర సంపన్న మ్ములగు పలుకులం దగులువడి పరస్పర ధన్యతాప్రసంగ మ్ములు సలుపునెడల నందాజనని బహులామహాదేవిం గాంచి వినయసంభ్రమ భావ నిరూఢమ్ముగా 124

నంద నిజమ్ము నీకడుపునన్ జనియించెనుగాక దీనికీ
సుందరరూప మీపలుకుసొంపులు నెక్కడ వచ్చెనమ్మ నీ
విందఱతల్లివై కరుణ నింతగ నేలితి వుత్తమప్రభుం
డిందఱతండ్రి దా నగుట యేర్పడఁజూచెడి భాగ్యమెన్నఁడో.

వ. అనునెడల నదియట్లెద. మనకిందఱకు నిప్పుడ యుత్తమ ప్రభు దర్శింపవలయుట ప్రభువులనిశ్చయమ్ము. ప్రయాణ మ్మునకు సకలమ్మును సుసంఘటితమ్మయ్యె. ఈ మాతృదేవత తోడి మీ యిందఱరాకడలకు వారె

గృహద్వారమ్మున వేచియుండిరని యప్పుడ వచ్చిన యొక
పరిచారిక సవినయమ్ముగా బలాకపురస్సరమ్ముగా వారలకు
విన్నవించిన. 126

మహావిజయపూర్తి భూశిశిర మాధురీమూర్తియై
మహాత్తమ తమోహృతి స్ఫుటసమగ్ర తారీతియై
కుహూనిశ వసంతసాధుకవి కూకుహూ కారయై
అహఃప్రతిపదుజ్జ్వలాకృతియునై యుషో రేఖయై. 127

క. విలసిల్లు దేవి వెడలె ని
రలంకృతాకార సంద యాతల్లియు నె
చ్చెలులై కెలఁకుల నడుపఁగ
బలాక నిర్దిశ్యమాణ పథములయందున్. 128

సాలపోతుఁడు త్రిశక్త్యుల్లరి నా
లీలవచ్చుటయి లేలిహాన బా
లా లసద్విమల లాస్యగీతికా
శ్రీలు పుష్పములు సేసలై చనన్. 129

ఎదురుగవచ్చి మ్రొక్కి సతి కెంతయుభక్తిని దల్లి! సైఁపరా
నిది యపరాధ మింతయును నిర్మలబుద్ధి సహింపవమ్మ నీ
మదిఁగలశాంతి శుద్ధియు గుమారిక నన్నును మమ్ము నిందఱన్
బదిలముసేసె నీకినుకవాఁడని చూపుల మమ్ము సాఁకవే. 130

వ. అవశ్యమహాఘోర శాపదండ్యుండ నగు నన్ను నింతగా

రక్షించిన నీ కారుణ్యమ్మునకొలంది వచింప నెవ్వండ నని
పునఃపునః ప్రణామమ్ము లాచరించి ప్రార్థించిన 131

క. పలుకు నెలంతయుఁ గలుముల
వెలఁదియు నిరుగెలఁకులందు విజయ జయయునై
కొలువున్న సర్వమంగళఁ
దలఁపించుచు దేవి తద్విధమ్మును గనుచున్. 132

క. అది దుస్స్వప్నము మఱవుము
మదిఁదలఁపకు సోదరత్వమాన్యుఁడ! విను సం
పదలై నతఁజని దొలియా
పదలు దలంపంగ నవి విపత్తులుగావే. 133

ఇది విను మొక్కమాటను మహీపతి సైఁపనిదోస మెందుఁ బు
ట్టదునఱు యట్టితేని నికటమ్మున నీవొకతోడఁబుట్టువై
పొదలుదుగాక నాదయినపుణ్యముగా కదినీదుతప్పె నీ
మది నెఱుఁగంగఁ జాలదొకొ మాకిట నంద యనిందితాత్మయై.

క. అని సతి ప్రసన్నభావము
తనయెడ విస్పష్టపఱుప ధన్యమ్మన్యు
త్వనిరూఢిఁ గుబుసమును విడు
తనువు మన మ్మతఁడు నొక్కతళతళ నందెన్. 135

వ. అప్పు డాతండు నతనిసతీసుతలు ప్రజలు మున్నుగా నెల్ల రా
తల్లి ప్రసన్నతామహిమమ్మున నొదవిన యానందమ్మునం

దమ్ము నెల్ల నప్పుడపుట్టినట్టులు దలంచి కృతార్థచిత్తమ్ముల
నామె నర్చించి రంత బహువిధ మంగళప్రారంభమ్ములు
సెలంగ నా ముప్పురుం దమకయి నిర్దిష్టమ్మగు నరదమ్ము
నధిరోహించుటయు బలాకుండు సారథ్యమ్మువహించె. సాల
పోతకుఁడు నా ప్తజనసహితుండై వారిం గొలిచి యనుస
రించె నంత. 136

## భూ త ల ప్ర యా ణ ము

క. దైతేయుల రాపుములకు
నై తాళక యచటడాఁగు నమరావతి యా
పాతాళతలము వెడలెనొ
భూతలపతిసేవ కనెడి పొలుపు వహింపన్. 137

క. ఆ పురము భువనలక్ష్మీ
నూపుర మటఁగదిలి భూమనోహర కాంచీ
శ్రీపదము ముట్టవెడలుట
లై పొదలెను వారి యా ప్రయాణమహమ్ముల్. 138

ఆపాతాళపురమ్ము నాత్మనగరీపర్యాప్తసౌభాగ్యమై
చూపట్టన్ బహుళాహ్లాదంతరమునన్ క్షోణీద్ధివృత్తాత్వరల్
రాపుల్ వెట్ట బలాకచోదిత హయవ్రాతమ్ము తత్పత్తన
శ్రీపైఁ జల్లు వసంతధూళులు రజశ్శ్రేణుల్ విరాజిల్లఁగన్.

క. చరచరఁ గుబుసము విడివడు
నురగములు దురంగమమ్ము లొప్పెను ద్వారలన్
పురివిడుచు నమ్మహాబల
తరసాహారమ్ము లగుట దార్కాణముగా. 140

పరితోదృష్ట భుజంగకంచుక లతాపర్యస్త సౌధావళుల్
సరివచ్చె న్మలయాద్రిపన్నగ నగ చ్ఛాయాగళగ్రాహులై
సురవాహిన్యవగాఢ సౌవరగజోచ్చూనాంగ శుండాముహుః
పరితోధూత్కృతి నిస్సరత్సురసరి ద్వాఃపారిపంథ్యమ్ములన్.

క. సురదీర్ఘిక వెలువడు సుర
కరిణి యనం దేరు పురినిగడవ నుభయత
స్స్ఫురసాల బద్ధతోరణ
పరిణాహములయ్యె నగరిఁ బాముకుబుసముల్. 142

ఆపాతాళనిమగ్నమౌ ధరణి దా నంతంతఁ బైవచ్చునై
ఆపోమగ్నమహీధరాళి నిజశృంగౌన్నత్యము ల్బాపునై
ఓపన్ రాని ధరాభరమ్ము తల లందొక్కొక్కచో మార్చి పై
నేపుల్ చూపెడి భోగిభోగములు నయ్యెం దేరు లారాకడన్.

జలధిప్రస్ఫుట మత్స్యకచ్ఛప విభాస్వద్యాన రేఖల్, వియ
త్తల సంచారిఖగేంద్ర మేఘ గమనోదారప్రియమ్ముల్ మహీ
తల చుంబి ద్యుమణిప్రభా మధురతాస్థానమ్ము లౌ తేరు, లు
జ్జ్వలఘంటాపథసీమ లందుకొనె నైజ మ్మైన తేజమ్మునన్ 144

ముహురుజ్జృంభితవాహవాహినులకున్ మువ్వంక భూమీధ్రదు
స్సహ సంరోధము గల్గ నొక్కొకయెడన్ సంరంభితం బొంగుచున్
గ్రహమార్గమ్ములు దాటునట్టులు శతాంగమ్ముల్ ప్రచారించెనా
బహుళాస్వాంతములుత్తమప్రభుపదాబ్జాతస్పృహాభృంగముల్

వరనారాయణ కేళికాసదనతా భ్రాజిష్ణు వారాన్నిధి
స్ఫురదైరావణ చారుచారిమములన్ శోభిల్లు యానమ్ము లా
యరదమ్ముల్ పఱతెంచె నిమ్నమహికిఁ గృష్ణాంభఃప్రవాహమ్ములై
పరితోషమ్మున ధాత్రి యుల్లసిల సంపన్నాత్మసస్యమ్ములన్ 146

ప్రాలేయాచలకన్యకా హృదయవి త్త్వారీంద్రయానమ్ములై
కైలాసాచలవాసి శంకరదిదృక్షా నందివాహమ్ములై
కాలన్ వ్రేలను స్వామియాభరణతల్ గైకోఁగ నుద్భోగముల్
వ్యాళమ్ముల్ బలె నొప్పె నెత్తుపడగల్ భ్రాజిల్లు నయ్యానముల్

అంభోధాన తరంగ జృంభితములై యాస్యందనవ్రాతముల్
శుంభద్వాజిముఖోత్థఫేన సఖితాశుద్ధాత్మడిండీర భా
దంభప్రస్ఫుట నైజశుద్ధచరితాధ్మాతక్రియాజోఘుష
ద్గంభీరధ్వని ఘూర్ణితాఖిలదిశాకర్ణాంతరాళమ్ములై. 148

ఆ వైశాలిమహాగ్రహారపృథుసీమాంతస్ఫురద్యూప పా
ళీవేలావనభూమిచాయలను నిల్చెన్ విప్రయాగక్రియా
వ్యావర్ధిష్ణు మహీసురేంద్రగదితస్వాహావషట్కార వా
గావిర్భూత సరీసృపత్పరిమళద్భాస్వద్ధవిర్ధూమముల్. 149

ప్రతిముఖమై విశుద్ధు లిడి స్వాగత మాడినచందమైన న
ప్రతిహతసిద్ధు లమైనఁ దనవచ్చుటలై యవతీర్ణవాహనుల్
ప్రతివసియించి యందుఁ దఘనాదును దారును బాదచారులై
యతివలు వెంటరాఁ జనిరి యమ్మహిదేవు గృహమ్ముత్రోవలన్

వ. ఇటు లయ్యగ్రహారోపవనమ్మున సపరివారమ్ముగా విడిసి,
బహుళామహాదేవి నదుకొని నందయు నామెతల్లియు నిరు
గెలంకుల రా బలాకభుజగేంద్రులు ముందయి యల్పపరి
వార సహితమ్ముగా భక్తివినయమధురమూర్తులై యా
శ్రోత్రియపథమ్ములు సోమవీథులుం జొచ్చిచొచ్చి య
వ్వైనాని గృహాభిముఖమ్ముగా నరుగు నవసరమ్మున. 151

ఋక్కు యజుస్సు సామ మనురీతిఁ ద్రివర్గము మూర్తినందెనా
నొక్కెడ నీత్రిలోకముల యున్నతు లమ్మెయిఁ దాల్చివచ్చెనా
నక్కమలాయతేక్షణల యమ్మెయి యాజులు సోమిదమ్ములున్
దక్కినవారలున్ గడుముదమ్ములఁ గాంచిరి సంభ్రమించుచున్

ఇమ్మువురందు దేవి యిటనెవ్వరొ యొక్కరికొక్క రెండు వీ
సమ్మును దగ్గిపోని గుణసంపద మూర్తులయందుఁ దోఁచెఁ దా
రమ్మయు నప్పచెల్లె లన నాత్మలఁ దోఁతురు విశ్వహేతు వా
యమ్మయె ముువ్వురై వెలయునట్టివిధ మ్మిట వ్యాకరించెనో.

క. ఋక్కులదీర్ఘస్వరితస
దృక్కుల దృక్కులను వెలువరించెను సుమన

స్నిక్కుల దృక్కర్ణమ్ములు
రిక్కల నాకర్ణదృక్సదృక్షణి యొకటన్. 154

క. కృష్ణసిత యజూ రో
చిష్ణులు పరిభవిష్ణుగతులు జిష్ణుసహిష్ణుల్
కృష్ణలు గోదావరు లయి
విష్ణుశివాకృతులు కనుల వెలువడె నొకటన్. 155

క. సామజ మృదుగమనమ్ములు
స్వామిహితారిభదళన చక్రిభవ దు
ద్దామకృత హోమధూమ మ
లీమసములు వెడలె నొకట లేలీహనముల్. 156

అక్షరమైన యాత్రయి శుభాకృతిఁ బొల్చిన వీరుమువ్వురున్
చక్షులకు న్మనస్సు కొకచందముఁ వారయి యొప్పి రైనఁ బం
చాక్షరమంత్రసంగతి మహత్త్వముఁగన్న యజుస్సు నా మన
శ్చక్షువునందె నీనడిమిచాయలమూర్తి శుభప్రసన్నతన్. 157

క. పాతాళలక్ష్మియో యనఁ
జేతము నంటంగరాని సిరియును రూపున్
జాతియు వార్తయు నీతి వి
నీతియు వరవర్ణినీమణియెడలఁ దోఁచెన్. 158

గీ. స్వస్వసౌందర్య పరమతా స్పర్ధమాన
నాక పాతాళ పురరమా హస్తముకుర

మైన తనమూర్తి నయ్యె నీయమ తదీయ
సారచర్యావిధా పరిష్కారసీమ. 159

క. ఈయిరువుర సరివచ్చియు
నీయమ తనపెద్దటిక మొకించుక తెలిపెన్
తీయని వాత్సల్యమ్ముల
నాయిరువురుఁ దనదుసుతలె యను నడవడులన్. 160

గీ. కేవలనిరీహములు గాక కేవలమ్ము
నస్పృహమ్ములు గాని వీక్షణము లొలయ
బహుళ భావాళి శబలతాపరవశాత్మ
తలఁప నీయమ నిక్క ముత్తముని జాయ. 161

క. మునుమున్న నడచు పురుషులఁ
గన దండధరుండు పాశకరుఁడు ననంగా
మనములకుఁ దోఁచెఁ దమ కొ
క్కనిమిత్తముగలిగి రాజుఁ గన వచ్చిరొకో. 162

గీ. ఇదియె వైశాలి మిత్రవిందేష్టిఫలము
ఇదియె వైశాలి సారస్వతేష్టిఫలము
ఇదియె మనపూర్వసుకృతాళి కెల్ల ఫలము
ఎఱిఁగెదముగాక యచ్చట కేఁగి యిపుడ. 163

క. అని పెక్కుగు పెక్కులుగా
ననుచును లోలోనఁ బైకినను చును దమ్మున్

గని విస్మయమున మునుఁజనఁ
గని కననియు వినియు వినని కైవడి వారల్. 164

చనుచో నయ్యెడ నమ్ములక్కులుమహాసంభ్రాంతచిత్తమ్ములన్
మనవై శాలిని కింత పుణ్యగుణముల్ పండించె నిందెవ్వరో
అనఘుం డాతఁడు నేఁడు చూతముపదండా మిత్రవిందేప్టికిన్
జనతాప్రార్థ్య మపూర్వ మస్తమితవై పమ్యాత్మసంపత్తికిన్.

అనుచుం బోవ మహీమహేశ్వరదిదృక్షాకీర్ణ చిత్తమ్మునన్
వనితాసిద్ధము సాధ్వసమ్ము ననుతాపమ్ము న్మహాల్హాదమా
న నితాంతాన్మృతి కౌతుకప్రబలచింతారేఖయుం దోఁచి యా
జననాధాత్మకు నీడ యా బహుళ సంజ్ఞావ్యాప్తముల్ దృష్టులన్

క. నందయును నందతల్లియు
నిందల వైశాలినియు మదీప్సితసిద్ధిన్
చెందింతురో మునివిప్రకృ
తిం దేరిన మన్మనఃపతిన్ భువనపతిన్. 167

వ. అనుతలంపు లాడిసిన చిత్తమ్ము భంగులగు గమనమ్ముల

క. చను నెడల నిందురమ్మా
జననీ యని యెదురువచ్చు సౌవాగతికన్
కని యటవైశాలిని, వి
ప్రనిగృహమును జేరు నెఱుకపొడమిన బుద్ధిన్ 169

వ. తనవిన్నచందమ్ములకుం గన్నచందమ్ములకు నందమ్ముగు

నెలవయి యున్న యప్పడతిని వైశాలినిని గా నెఱింగి యుచి
తంపు నడవడుల నామెసంభావించి యాతల్లి సంభావనమ్మొ
లం బడయును 170

## పునర్దర్శనము

బహుళశోద్ధృష్టము నాత్మసంపదను విశ్వవ్యాప్తమయ్యున్ ముహు
ర్ముహురన్వేషణనూత్ననూత్నమహఃఘనస్ఫూర్తిస్ఫూర్తమున్
బహుళాదేవి నిజాత్మనాథమహామున్ బ్రత్యక్షతం గాంచి, య
న్యాహాగమ్యమ్మును బుట్టఁజొచ్చునురగమ్మై చేరెఁ దత్సన్నిధిన్

గీ. అగ్నికాంతులు దను జేరనైన రవియు
పద్మలక్ష్ములు దను జేరవచ్చు శశియు
ప్రభువు దీపించెనట స్వాతిప్రభవదూర
యాత పునరాగత శ్రీ సమాదరమున. 172

గీ. కాలదేశమ్ము లగుచు వైశాలిమిథున
మచటనొప్పారెఁ దద్ఘటనానురూప
ప్రకృతిఁ దలపించు నద నదీ పర్వతాబ్ధి
సంపదల నందె నంద యచ్చటిజనమ్ము. 173

గీ. తొల్లి దాక్షాయణీదేవి తొలఁగి తొలఁగి
అటులె పంపయు నొకదూర మరిగి యరిగి
మఱల నినుఁ జేరునాఁటి సంపదలు పొదలె
బహుళ పతిఁ జేరు నెడ విరూపాక్షలింగ. 174

ఆ. వె. కాలభోగి దంష్ట్రికాక్రాంతమూర్తి యై
బాలచంద్రలేఖ భ్రమసి భ్రమసి
మఱల గౌరి విమలదరహాసరేఖయై
నిన్ను నెనయువింత చెన్ను లోలసె. 175

అదియెల్లన్ భవదీయదివ్యమహిమప్రారంభలీలాయిత
మ్మదియుం గాదటె నీవె సాక్షివయి త మ్మేలింప నెచ్చోట నా
త్రిదశాహారవిధానిధానము భవత్తేజోంతర మ్మగ్ని సా [చున్.
క్ష్యద మిందుం బోసఁగన్ శుచిఃకవి యనన్ సాక్షాత్కృతిం గాంచు

క. విద్యానగరకవీశ్వర
పద్యాధిక మృదుల మధుర పదపద్మయుగా
అద్యోద్ధ్యభిద్యదాంధ్రీ
హృద్యక్షీరాభిషేక కృతికృతకుతుకా. 177

పురాంధ్రిజనవైభవ స్ఫురితమూర్తీ, తమో
విరామ! సకలోత్సవోల్లసిత విద్యాపురీ
చిరత్నమణి! రాజరత్న కృతసింహాసన
స్థిరాంఘ్రి! సకలాశ్రితప్రకర సిద్ధిప్రదా 178

శ్రీమాధుర్యధురీణ సాధుకవితా శ్రీనాథ రూపాంతర
శ్రీమద్ధూర్జటిదివ్యభవ్యకవితా శ్రీకాళహస్తీశ్వర
స్వామీ! సౌవరపుష్పసార కవితాసౌభాగ్య నందీశ్వర
శ్రీమత్తిమ్మయసత్కవీంద్ర హృదయశ్రీ హేమకూటాదరా. 179

క. మహికాఘృణి నవకళికా
మహిత శ్రీకనకరత్నమా మతినళినీ
మిహిర శ్రీశరభారా
ధ్య హృదయవృషభేంద్రవాహనారూఢ ! శివా !.

క. అకళంక శంకరారా
ధ్యకఖేందుకలాఽనుజననధన్య మ్మగునీ
ప్రకటోత్తమ మనుసంభవ
వికసితము తృతీయముఖము వెలయు శివకృపన్. ·181

శి వ మ్

శ్రీరస్తు

# ఉత్తమ మను సంభవము

## తురీయాననము

క. శ్రీమహిత వాఙ్మయాంబర
సోమకలాపూర్ణ జననశోభి సుధాబ్ధి
శ్రీమత్పింగళిసూరవ
చోఽమృతకలితాభిషేక హారి కపర్దా. 1

వ. స్వామీ! అవధరింపుమట్లు. 2

క. శుచియన విప్రుఁడు కవియును
శుచియనఁగా నగ్ని యనెడి శ్రుతివచనమ్ముల్
ప్రచురార్థత లలరింపఁగ
శుచి వైశాలియును వారిఁ జూచి ప్రియమునన్. 3

వ. తన సిద్ధసంకల్పబలమ్మునం గృతమ్ములగు నయ్యిష్టి విశేషమ్ముఫలమ్ము లటమున్న లక్ష్యసంక్రాంతమ్ము లగుటకు సమ్మోదమంది సంస్కారవిశేషమ్మున వానికిం ద్విగుణిత దృఢసంపత్తియు గుణాతిశాయిత్వమ్మును సాధించు నటుల మంత్రపూతమ్ము లగుకుశోదకమ్ముల నారాజదంపతుల

పయిం జల్లనితనదృష్టిప్రసారమ్ము లట్లచల్లి యగ్ని ప్రసా
దమ్మును వారల కనుగ్రహించి యానందం గనుంగొని. 4

క. నీతండ్రిశాప మీసతి
శ్రీతనుసంస్పర్శ మున్న చెడుట యెఱుఁగుదున్
భూతలపతి ప్రార్థన సం
జాతము సారస్వతేష్టి సత్ఫల మెల్లన్. 5

వ. నిన్ను ననుగ్రహించెం గానుమని యమ్మంత్రోదకమ్ము
లామెపయిం జిలుకు నంతట. 6

వారలుమువ్వురత్యధిక భాసురమూర్తుల నొప్పి యప్పుడా
చారధురంధరుండును వశంవద మంత్రిఫలుండునౌ మహీ
చారి సుగోత్రముఁ వినయసంభ్రమభక్తి నిగూఢభావనా
శ్రీరమణీయులై వినుతిసేసిరి యగ్నుల నగ్నికల్పులన్. 7

క. క్షమియింపరాని దోసఁగుల
క్షమింపరే యనుచు రాణి జనపతి మ్రొక్కన్
క్రమమున నగ్నుల కావి
ప్రమిధునపదములకు మ్రొక్కె భక్తివివశయై 8

వ. ఇట్లు మ్రొక్కి యంజలి ఘటియించి తనహృదయేశ్వరు
నుపలక్షించి. 9

అహారహా మీవు నామనమునందు వసించు టెఱింగియుండి దు
స్సహమగు నవ్వికారమును జాలఁగనైతి నడంప నింత దు

ర్గ్రహములవీక్షణమ్ముల వికారము లింతలు పట్టియార్ప ని
మ్మహితుఁడు నిట్లుమాన్చినను మానదదిన్మదినొక్క గాయమై.

అపశమున నవ్వికార మిటులంచు వచింపఁగ నేరనైతిఁ బ్రా
ణవిధ సఖీజనమ్మునకు నాదగుదోస మదట్లు పేర్చి యు
గ్రవనముఖమ్ముఁ ద్రోఁచి భుజగప్రభుబందియ లోఁగఁజేసి నీ
సవిధము నిట్లుచేర్చెను బ్రసన్నమతిం దొసఁగుల్ క్షమింపవే.

నందయు నీబలాకుఁడును నాకునొనర్చిరి పెక్కురక్ష లా
చందము నీవెఱుంగుదు ప్రసన్నత నాకయి నందమూకతల్
డిందుపడంగఁ జేసిన కడింది దయామతి నెన్నిచూడ ని
న్నుం దెలుపంగ నొక్కటి మనోరథమున్నదె విశ్వనాథునిన్.

ఐన సతీజనమ్ముల కనర్హము లన్యగృహ ప్రవాసముల్
మానుగ నన్వరింప ననుమానము లేకెటువిశ్వసించు నీ
మానస మిద్ది నమ్మిన సమస్తప్రజావళి దీనిఁ దీర్పఁగాఁ
గానను మార్గ మీకడిఁదిగాఁటియ దీఱ ననుగ్రహింపవే. 13

నావుడు సర్పరాజు జననాథుని మ్రొక్కుచు మోడ్చుచేతులన్
దేవరకొక్కవిన్నపము దేవి భవద్వ్రత నంటనోడి మా
యావనితాప్రభావమున నమ్మెయి నాపురిఁ గొంచుఁబోవుదు
ర్భావుని నన్నుఁ గావుము కృపాపర నీవు ప్రసన్నబుద్ధివై. 14

నాదగుఘోరశాపమున నందకుఁ గల్గిన మూకభావమున్
భేదిలఁజేయునీసతి యనిందితశీలముఁ దెల్పనేల యు

త్వాదిలఁ జేసె భీతి సతి పాణిపదస్థిత సర్వసర్ప వి
చ్ఛేది మహోగ్రరేఖలు వశీకృతమానస నీవెఱుంగవే. 15

అనుడును వానిజాయ భువనాధిపఁ నీకుఁ ద్రికాలవేదియౌ
దనుజవరుండు చెప్పినవిధమ్ములు బొంకులె? విప్రజన్మమున్
మనమున నెంచిచూడు మనుమానము లేటికి సర్వధర్మభో
ధన మగు నీదునాత్మయె యుదాత్తపథమ్మును నిర్ణయించుతన్.

వనితనుగాన నేనొకటిపల్కెద నందకు నీదుజాయ కే
యణువును లేదు భేదము మహత్తరశీలగుణమ్ములందు నీ
జనములచిత్తము ల్గడుఁబ్రసన్నతఁ దోఁచెడి సర్వభక్త వ
ల్కినయవి బొంకులైనయెడఁ గీడ్పడఁ జేయవె యగ్నిసన్నిధిన్.

నావుడు నంద యోత్రిభువనస్తుతశీల, వశంవదాత్మ నీ
భావము నంటరానియది పల్కఁగ నేర్తునె స్త్రీస్వభావమున్
భావుకుఁడౌ కవీంద్రవచనమ్ముఁ దలంచుచు సాధ్వసాధుతా
భావ వినిర్ణయమ్ములకు వచ్చుట నైజము దుర్జనాళికిన్. 18

కేవలమున్ స్వకీయమగు కిల్బిషభావ మెఱుంగలేక యా
భావము నంటఁగట్టెద రవార్యముగాఁ బరులందు నిట్టి దు
ర్భావ పరంపరావిషయపాటన పాటవ మింత లేని యా
యావచనాళి నిక్కమగుటన్నది యున్నదె యేజగమ్ములన్. 19

అమ్మ వచించె నెంత నదియంతయు నిక్కము నేన చెప్ప దో
సమ్మగు నైనఁజెప్పెదను సర్వజగన్నుత మైనబ్రహ్మచ

ర్య మ్మదిసాక్షిగాఁగ వసుధాధిప నీసతి శీలసంపదల్
మమ్మను విస్మయింపఁజేచె మాటలు వేయిటఁ జెప్ప నేటికిన్.

అనిన విభుండు మీరనినయంతయు నిక్కమ యేనెఱుంగుదున్
జనముల యాదరమ్ములకుఁ జాలవు నా కవియెట్టిసంపదల్
మనకిటఁ జర్చలేల గుణమాన్యుఁడు విప్రుఁడు నీజనమ్ములున్
పనిచినయట్లు చేయుట యవశ్యము నామది నిశ్చితమ్మగున్. 21

క. అనుటయుఁ గలకల నవ్వుచు
సనె వైశాలియు యథార్థ మాడితివి నృపా
జనములు మెత్తురుగాకిట
విను వివరించెద నిదొక్క విషయము నీకుఁ. 22

జనములు మెచ్చ నాపనుచుచందమునం బొనరింతునంటి వీ
జనములు మున్నగాఁ బలుకుసంభ్రమ మందుచునున్న వారు, వీ
ర నెదరుగాక యాపలుకులన్నియు నొక్కట నాకళించి, నా
మనమున నున్న నిశ్చితము క్ష్మావర నీకిట నేర్పఱించెదన్. 23

వ. ఇమ్మహాజనమ్మునను శాసనమ్మశిరోధార్యమ్మ గాదె.
అది యవధరింతువు గాక. 24

అనుచు సభాజనమ్ముకయి యాతఁడు చూచిన, నమ్మహాజన
మ్మునఁగల పెద్దలెల్లరును మోములుచూచి పరస్పరమ్ము నొ
క్కనిఁ గులవృద్ధు వేడికొనఁ గన్నుల నాతఁడు లేచివచ్చి యా
జనపతిసన్నిధిం బలికె సభ్య హృదంతర భావపద్ధతుల్. 25

ఎఱుఁగమె రాజదంపతుల వృత్తవిశుద్ధుల నెల్లమేము, మా యరణులఁబుట్టు నగ్నులమహాత్త్వములన్, మఱి మా శ్రుతిస్మృతి స్థిరతరసంగతమ్ములను జెప్పఁగలంతయు దానసేర్చి. మ మ్మఱక వచింపఁజేసె నిదియొక్క-నెపమ్మన మమ్మఁ డెల్పఁగన్

క. ఏకీభవించి పలికెద
మేకగ్రీవమ్ముగాఁగ నీతనిపలుకుల్
మాకన్నఁ దాను ఘనుఁడై
మీకుఁ బ్రబోధింపమమ్ము మెయికొలిపెనటే. 27

నంద వచించుపల్కు-లు వినందగియున్నవి, దేవిచిత్తమున్ సందడిపెట్టుసందియము, సర్వజనప్రియ, మాన్పఁగాన్పు నీ యందుఁగలట్టి ధర్మవు ప్రజావళియీసతిఁ గన్నతల్లిగా డెందములన్ భజింతురు గడిందిమహాత్త్వము లెన్ని యెప్పుడున్

క. అని వలుకఁబనిచి రీజను
లనఘా నేఁ బలుకఁదలఁచినట్టిది యిదె సు
మ్మ నవినుచును వైశాలియు
జనపాలక నేను వినుచుచందము లెల్లన్. 29

క. వినిపించె నీప్రజావళి
మనమున సందియము మాని మానిని గొనుమీ
అనుచుఁ బ్రజాపతిఁ గనుఁగొని
ఘనుఁడవ్విప్రుండు చిఱునగవు లొలయంగన్ 30

# సమన్వయము

అరయఁగ దేవిచిత్తమున యచ్ఛత రాగము సవ్రీకారమున్
వరలెను, నంద, తజ్జనని, నాగవిభుండయి, నీదుధర్మదీ
క్షురమ బలాఢ్యుఁడయ్యె, నృపచంద్రమ నేనును సోమిదమ్మయా
యెఱుఁగుదు వా త్రికాలవిదుఁ డేర్పడఁ జెప్పుట నీవు తొల్లియున్

ఎవరాపూని యటంచు నెంచెదవొ నీ వేవేళ సేవించు నిత్యా
త్యవికాసమ్ము శివమ్ము బ్రహ్మము విరూపాక్షాహ్వయమ్మద్ది,
భువనశ్రేయము సంఘటించు తలఁపుల్ పూనంగ సాక్షాత్కరిం
చి వనిం దెల్పెను నిన్ను నీఘనమనశ్చింతానిరాసమ్ముగన్ 32

వ. అతనిపలుకుల కన్యధాత్వమ్ము కలదే యను నెడలం దద
ర్థమ్ము హృదయమ్ములందు సమర్థమ్ముగా సమన్వితమ్మగు
టయు నొదవినముదమ్ముకలిమి నయ్యందఱయ్యనఘుల
బహుముఖమ్ముల నభినందించి రట్టియెడల. 33

ప్రతిపదిందు కృశుండు పార్థివుండు
సతిని గాంచె ద్వితీయ చంద్రలేఖ
పతిని జూచెను దేవి వార్ధివీచి
సతిసమీక్షలఁ బుట్టె సాంధ్యరేఖ. 34

ఆనందమ్మున రాజదంపతులు దామన్యోన్యమున్ జూచి లో
మాసన్ సందియ మగ్నిహోత్రునకు నామ్నాయోక్తమార్గ
మ్మునన్

ధ్యానారూఢ విశుద్ధచిత్తముల సాష్టాంగమ్ముగా ముక్కి దే
వానూనుల్ మహిదేవపాళి కిడి రర్హమ్ముల్ నమస్కృ
తుల్. 35

వ. ఆసమయమ్మునం దగ్ని తేజోవిశేషమ్ములు తనయందుఁ
బ్రవేశింప నుజ్జ్వల తరప్రకాశమ్మగునవ్వైశాలినీ లలాట
చిహ్నమ్మును నందయు, బహుళామహీవిభులును సందర్శించి
యామెపలుకులం దలంచి కృతార్థత్వమ్ము లాకార
మ్ములు భజింప నామెం గొలిచి తదనుగ్రహమ్మునం
బొలిచి రంత 36

# వ ర దా న ము

ఆనందాకృతి నంద యమ్మిథున మత్యంతాదృతిం జూచి లో
నానన్ రాని ప్రహర్ష మక్షరపదోద్యద్భావ రూఢమ్ముగా
నీనాతల్లికిఁ దండ్రికిం గలుగుగా కీపోల్కి పుత్రుండు వి
జ్ఞానానందవిధాత దాత మనువంశస్వామి భావమ్మునన్. 37

అను నానందాముఖోక్తమ్మయిన ప్రతిపదమ్మందుఁబ్రత్యక్షర
మ్మున్
వినిచెన్ మారందధారా నిభృతపరిమళ స్నిగ్ధపుష్పప్రజమ్ముల్
వినిచెన్ వాసంతవేళా విహృతిపరవశ స్ఫీతముల్ గోకిలార్ద్ర
స్వనముల్ తత్పుణ్యగాథా స్మరణవిజయముల్ సౌమనస్యప్రద
మ్ముల్. 38

వ. ఆవైశాలి ప్రముఖులు తథాస్తువాక్యమ్ము లనువదించిరి. సురలు సుమవర్షమ్ములు గురిసిరి. అట్టియెడ నుత్తమ ప్రభుండు సకలజనమ్ముల నుచితసత్కారమ్ముల నొసంగి వీడుకొలుపుచుం దనకావించు వసంతోత్సవమ్ములకు రా నాహ్వానించె. బలాక సాలపోతక ప్రముఖ సఖజనమ్ముల నతిమాత్రగౌరవమ్మున మన్నించి నందాకుమారిం బుత్రీ నిర్విశేషమ్ముగ సమాదరించి, దేవిచిత్తమ్మువడసి నాఁటికి వైశాలిశాసనమ్మున నందునిలిచి మఱునాఁ డవ్విప్రదంపతుల యనుమతమ్మునం దత్రత్య జనవిశేషమ్ము లాదరమ్మున ననుప సకల ప్రియజనమ్ములతో నిజపురాభిముఖుండై చను నవ్వాఁడు. 39

## పు రా భి గ మ న ము

క. శ్రీజయ వసంతలక్ష్మీ
పూజోత్సవ విజయశంఖములు పూరించెన్
తేజిత కలకంఠమ్ములు
రాజ జయోదాహృతి మధురతర గళములన్. 40

క. భావ్యుత్తమ మనుసంభవ
భవ్యకథా కుసుమగుచ్ఛ పరిమళలహరీ
నవ్యత రసాలనింబను
మవ్యంజితమై విశిష్టమధురత నొలసెన్. 41

క. పదునలువురు మనువులలో
నుదారచరితాభిరాముఁ డుత్తముఁడే యనన్
విదితమ్ముసేసె నుత్తము
నుదయ నిదానములు మాధవోద్గతలీలల్. 42

కూ యని యొక్కకోకిలము కూజితముం బొనరించె నంత రా
మాయణభవ్యకావ్య కలితార్థము సర్వమునుర్క ధ్వనించె, నా
కోయిలకంఠమందు శుకకూజిత మొక్కటిపుట్టె నద్ది వ్యా
సాయితమాచు భారతమహార్థముఁ దెల్పె శ్రుతిప్రియమ్ముగన్.

తొలితొలిగాఁగ నొక్కకవితో యజగర్భము రాణ్మహేంద్రుపై
నొలసినచూపులన్ దనకుహూకుహుకంఠము విచ్చిపాడె, ను
జ్జ్వలము ప్రసన్నగౌతమతపఃఫల మంగళగౌతమీనదీ
లలిత తరంగశబ్ద మృదులాలిత భావరసార్ద్రనీనమున్. 44

అల్పిత సర్వసత్కవిమహత్త్వము కంఠము విచ్చియొత్తె నా
కల్పితపన్నగేంద్రు నవికల్పమతిన్ బహుశాస్త్ర బోధనా
శిల్పగుణమ్ముల న్మనుమసిద్ధుల నంది యటంచు దీవెనల్
సల్పినయట్లుగా గుణరసధ్వనిపాకవిశేషరీతులన్. 45

ఎట్టినలై చిగిర్చిన మహీరుహము ల్లత లెంచియెంచి పైఁ
గట్టునఁ ద్రేన్చి త్రేన్చి యవికారగుణమ్మునఁ బొట్టనిండుగా
జుట్టినమాధురుల్ తనదుచూపులఁ బల్కుల వెల్వరించె దా
నట్టులు సాఁచిసాఁచి బహుశార్థగతుల్ హరివంశమాధురుల్.

కలపుంస్కోకిల కంఠడిండిమము ధిక్కారించుచున్ సార్వభౌ
మలసద్దర్పము లక్షరాక్షరములం బ్రఖ్యాతము ల్గా మహా,
నలదీప్రమ్ములు పల్లవద్యుతుల స్వర్ణస్నానము ల్దీర్చి వి
న్చె లతాగాధలు రాజమాళిఁ గవితాశ్రీనాధ భావమ్మునన్.

అటుస్వారోచిషమా మనుప్రభవమాహాత్మ్యమ్ముసూచించుచున్
పటుశయ్యాగతిసౌష్ఠవమ్ముగ లతాపర్యంకడోలన్ మృదు
స్ఫుటబంధమ్మున నుత్తమోదయగుణమ్ముల్ మెచ్చికీర్తించెధూ
ర్జటినందీట్పదకింకిణీ మృదురవస్పర్ధాళుకంఠమ్మునన్ 48

పింగళియై చరింపఁ దనపింగళిసత్కవు లెట్టులట్టులే
ముంగలిసత్కవుల్ గడునపూర్వము లౌచుఁ దదేకసిద్ధముల్
భంగులు పెక్కుగా మధురభావధురాకలభాషణమ్ములన్
ముంగలియై గరంచెఁ బతిఁ బూర్ణరసధ్వనిరీతిశయ్యలన్. 49

ముందును వెన్కనై సుకవి పుంగవు లెండఱొ యొక్కరొక్కరుఁ
స్పందితచిత్తము ల్పలుకఁబాఱుగళమ్ముల నుత్తమోదయా
నంద విశేషభావన లనంతముఖాన్వయముల్ ధ్వనింపఁగా
వందులు మాగధుల్ నృపతివైభవము ల్గొనియాడె నర్మిలిన్.

క. ఇటు కవులు భూతభావి
స్ఫుటకథలనుభూయమానములుగ ధ్వనింపన్
ఘటనాఽఘటన వినిర్ణయ
మెటఁ గాల మనంతమగుట నేర్పఱుపనగుఁ. 51

క. అనురణితార్థవిశేష
ధ్వనులు మహాసుకవికావ్య పదగుంభనముల్
వినుచున్ నందరయొసఁగు దీ
వెనలఁ దలంచుచును నరుగ విభుఁడును సతియున్. 52

కనులవి యింతలింతలుగ గర్భభరాలస లేడి యొండటన్
గనియెను రాణి దాని తెలికన్నుమెఱుంగుల నేమెఱింగెనో
మును వనదేవతల్ హారిణమూర్తి వహించుట సార్థకమ్ముగా
మనువులఁ గాంచుటల్ దెలియమా యనుభావము లందుఁ
దోఁచెనో. 53

నవ్వుకనుల్ ద్రిపామధురనర్మధురమ్ములు హాసచంద్రికల్
ఉవ్వినవీక్షితప్రిభలలోఁ బతిచిత్తము చూఱఁగొన్న యా
పువ్వులచూపులన్ దెలియుభూపతిచిత్త మరుత్తరంగముల్
నవ్వులు పువ్వులై సతియు నాథుఁడు సందఘటించెఁ బండువుల్

క. భూతభవద్భావికథా
స్వీతాక్షర మధురశబ్ద నిత్యత్వమహ
త్త్వాతిశయ ప్రణవప్రణ
యాతత గీతములు పాడె నళిజాతమ్ముల్. 55

కన్నులపండువై యెదురుగాఁ గనిపించెఁ బురమ్ము సర్వసం
పన్నము రాజురాశలకు వార్చునిశాముఖమాచు, సాంధ్యరే

ఖోన్నతు లాకుమార మహిమోత్తమసంభవ మెంచి తారకల్
చిన్నతనమ్ము దాల్చి చిఱుచెమ్మలు గాఱెఁగ రత్నదీపికల్.

సముఖమ్మందుచు స్వాగతమ్మిడె మణిస్తంభ ప్రభాబింబి యా
సుముఖాసక్తి పురీజనమ్ము సుమనశ్శుద్ధిన్ జతుర్వేదవా
గ్రమణీయమ్ము స్వభావసిద్ధము మహారంభప్రియంభావుక
మ్ము మణీహారముఖమ్ము భావిత కళాపూర్ణోదయాకారమున్

అభినవకౌముదీవిశద లాజను లిచ్చిన స్వాగతప్రభల్
ప్రభువు గ్రహించుచున్ మధురలాలస దీప్తివహింపఁ జొచ్చె, ని
త్యభరితకౌతుకమ్ములు మదాలసవీక్షణముల్ మనోజ్ఞవా
క్యభవచమత్కృతు ల్గువలయప్రభ తోరణకట్టు వీధులన్. 58

కువలయ మెల్ల ముమ్మఱుగ గ్రుమ్మరి యశ్వము లారసాతల
మ్ము వెదకి రాణిఁ దెచ్చుకొను మోదము తన్ముఖ ఫేనరాశియం
దు విశదమయ్యెఁ బౌరజనతోష మహాశుభలనాతిశాయియై
ధవళతరమ్ము లాబహుళధన్యచరిత్రము లుగ్గడించునై. 59

# పురప్రవేశము

కృత్తికాయుత తృతీయేందుఁ డారాజు
పత్తనమ్మును వార్ధివై భవస్ఫూర్తి
ఉత్తరంగిత మనోజ్ఞోత్సవాఢ్యమ్ము
నిత్తెఱంగునఁ జొచ్చి యింపుఁ బెంపార. 60

వ. అరదమ్ము డిగునంతట 61

ప్రద్యుమ్నస్ఫురదాత్మమూర్తిపతికిం బ్రాఘేంచుబింబానసల్
విద్యుల్లేఖకు నా ప్రభావతికి నుల్లీఘాగ్రహర్షమ్మునన్
సద్యశ్ర్శ్వేతకపాయకంఠ కలకంఠస్వామగీతమ్ములన్
హృద్యస్ఫూర్తి నివాళులిచ్చిరి రసార్ద్రీభూత చిత్తమ్మునన్. 62

విజయవిలాసమాధురి నవీనముగాఁగ సుభద్రయోర్తు దా
నజితవిలాసదీధితిజయాకృతి భూపతికిన్ వధూటికిన్
నిజకరదృష్టికాంతుల గుణించు చివుళ్ళు నసల్ త్రివారముల్
త్రిజగతి చూడనైన వెడదృష్టి హరించెను జుట్టివైచుచున్. 63

క. తనపుట్టిన యమరావతి
తన మెట్టినభోగవతియుఁ దత్పురసౌంద
ర్యనిరూఢికి సరిపోవమి
కనికని యానందజనని కౌతుకపడుచున్. 64

సీ. అతిచైత్రరథ నందనాదికారామమ్ము
లయి మించు బహువిధోద్యానములను
అతివైజయంత సౌధాదిగేహపరిభా
వాదమ్ములయిన ప్రాసాదములను
అతిసురీసుర మనోహర వపుస్సౌభాగ్య
సార నారీనరాకారములను
అత్యప్సరోవధూ నృత్యగంధర్వాంగ
నాగాన బాలికా నైపుణముల

నరసి తానటనొక్కరూపానుభాతి
యగుటయేగాక యయ్యె గుణానుభూతి
ప్రజకు జేనికిఁ గల పరస్పరము ప్రేమ
మాతిథేయత్వగరిమమ్ము నరసియరసి. 65

వ. ఇమ్మెయి నయ్యుత్తమ ప్రజావిభుండు నగరు ప్రవేశించి, వెలిపీడువిడిసి తత్కాలసముపాగతు లగు పురజనమ్ములకు బలాకభుజంగమపతుల నెఱింగించె. విదిత నిఖిలవృత్తాంత విశేషు లగుప్రజ లధికతరానందమ్ము భజించు డెందమ్ముల నయ్యద్భుతవిషయమ్ములం దలంచుచుఁ దథాప్రసన్నమ్ము లగుతమయదృష్టమ్ములకు మొ్రక్కుచు విశేషించి నందాకుమారి యాశీర్వచనమ్మునం దమచరితమ్ములు చరితార్థమ్ములుగాఁ దలంచిరి. అట్టియెడ నమ్మహీపతి జయవసంతోత్సవమ్ము ప్రజానుమతమ్మునం జాటింపంబనిచి యుచితంపు మెయి నప్పటికొలువు చాలించి యయ్యతిథులకుం దగు విడిదలల నేర్పఱించి తాను నభ్యంతరమ్మున కరిగె నంతట.

## నిశాభివర్ణనము

క. స్వాయంభువ మనువంశ
శ్రీ యట బహుళోత్తమ ప్రసిద్ధగుణములన్
చేయు స్వరోచిర్మహిమల
తోయమ్ములు చుక్కగములు తోఁచె నభమునన్. 67

గీ. ప్రకృతి విచ్చినకనులు తారకలు వెలిఁగెఁ
బ్రజల మినుముట్టు నామోదభరము లగుచు
జయవసంతోత్సవారంభసమయమందు
మింటఁ గొలువున్న యయ్యనిమిషులఁబోలె. 68

వ. ఆ జయవసంత జయవాసర లక్ష్మీపరిణామవిశేషమ్ములు, నిశాసముజ్జ్వలమ్ములై భావ్యుత్తమ మన్వాదిఃబోధకమ్ములగుచు నాఁటికృత్తికాయోగ విరాజి తృతీయేందులేఖ షట్కృత్తికాంకతలోవలాల్యమాన బాహులేయ బాలభావవిలాసమ్ములు పరిభవించుట లెఱుకపఱిచె నంతంగ్రమమ్మున 69

గీ. బహుళ హృదయాంతరాంతర వర్ధమాన
పరమ శృంగారరసఝరీ పరిభవములు
కృష్ణవేణీ ప్రవాహారోచిష్ణుఘృణులు
తెఱలు తెఱలయి దీపించె నిరులసిరులు. 70

సీ. నిలువెల్లఁ గన్నులై నిశ నాదరించెడి
గగనప్రభుని నేత్రకౌతుకములు
ఆ నభోవిభుమూర్తి నలమునిశాంగన
తనువునఁ జెమరుముత్యములహొయలు
ఆదంపతుల కేళిభేదమ్ము లొలయుట
విరియఁ నొఁదలలక్రొవ్విరులసరులు
ఏకీభవన్మన శ్రీకామినీనృత్య
శాలా వితాన రత్నాళిఘృణులు

దర్శితాన్యోన్యసౌహార్ద దర్పణములు
భావిత పరస్పర నిరూఢ భావకములు
ప్రకటశబలిత బహుళ సంభ్రమమహములు
తారకలు మించెఁ బ్రణయాబ్ధి తరణతరులు 71

సీ. స్వాధీనపతికనా భాసిల్లి తొలుదొల్త
వాసకసజ్జికాప్రౌఢి నెఱపి
విరహోత్క యయి వింత విన్నఁదన మ్మంది
ప్రోషితభర్తృకాస్ఫూర్తి మెఱసి
కలహాంతరితవోలెఁ గలఁగి యఖండిత
ప్రణయసంభావనారక్తి నొఱసి
అనిశాను భూతమ్ము తనవి ప్రలంభమ్ము
తాల్చినరూపమ్ము తాన యగుచు

సన్నిహితుఁడయ్యుఁ దనతనుస్పర్శరుచుల
నంటి తెలియని తనవిభు నభిసరించె
బహుతమోంబర భరణవిభ్రమము లోలయ
నానిశీథిని బహునాయికాయితాత్మ, 72

సీ. అనుకూలుఁ డగువిభు నాదరమ్మునఁ జేసి
మినుదాఁకె నా నిశావనితసొగసు
అది యనాదిప్రజాన్వయ తంతుసంబంధ
మెట్టు లేర్పడు నిదమిత్థ మనఁగ

ఇది వినీలాంబర మ్మిదినిశారూపమ్ము
నిదినది యిదియు మహీధ్రమనఁగ
అయితిగానట్టి యేకైకరూప మ్మయి
కడలిమిన్నులరుచు ల్గదియు టగుచు

శబ్దమాత్రైక విజ్ఞేయ సకలవిషయ
మర్థనిర్మగ్న నిఖిలశబ్దాన్వయమ్ము
సకలసృష్టి నిదాన నైశప్రబుద్ధ
తమము కొలువయ్యెఁ దనరాజసము వెలుంగ. 73

గీ. అవసరజ్ఞుండు తాళపత్రాయితమ్ము
ఆకసమ్మునఁ జీకటి కాకరాకు
పసరుపూసిన ముత్యాలపగిది నొప్పు
నక్షరావళి తారక లలరె మింట. 74

ధ్వనిమాత్రాఽస్ఫుటబోధమై యెసఁగు శబ్దమ్మక్షరజ్యోతియై
కనిపింపన్ మునుముద్రియామను దరియాగాత్రిన్ గురూకుర్కురూ
ధ్వనులం దాను బఠించెఁ దత్సమయమవి త్ప్రేషద్విజవ్రాత మ
మ్మునికిన్ శబ్ద నిబంధనస్ఫుటమహాబోధమ్ము మిన్నుట్టఁగన్.

ఆ నక్షత్రసువర్ణ పంక్తి మననాభ్యాసప్రభావమ్మునన్
మానుల్పల్కిరి పెక్కుగాథలు కథల్ మాహాత్మ్యచారిత్రముల్
నానాఽఖ్యానకముల్ మహోజ్జ్వలపురాణమ్ముల్ సదర్థాఢ్యవి
జ్ఞానాంభోధి ఘుమంఘుమప్రకటవాజ్మైనపుణ్యాగణ్యాకృతుల్.

సీ. నిర్ణిద్రి కృష్ణవేణీ ప్రవాహమ్ములై
చీకఁటు ల్ప్రవహించె లోక మెల్ల
వడి నందు నుత్పలావతి యనుపిడిలేఁటి
శిరమన మృగశిరశ్శ్రీ చెలంగ
దానితోఁకను జేతఁబూని పోవుసురాష్ట్ర
భూవిభుం డన నార్ద్ర పొలుపు మించె
నార్ద్రకరస్పర్శ నదిగర్భము భరించెఁ
దామసంబయిన తత్సమయ మందు

వింతవెలుఁగులు జగమున సంతరింప
బహు పునర్వసు వృద్ధిసంభరిత జాత
మనుకరాశ్లేషభవ బహుమఘ ఫలమ్ము
నందె నొకచుక్క పేర్మి నయ్యభ్రవీథి. 77

సీ. తనపుత్రు దుశ్చరిత్రకు వానిజనితార
యగు రేవతిని భూమి కనుచునట్టి
ఋతవన్మునీంద్రుఁడై రిక్క యొక్కటియొప్పె
నా రేవతీబాల నాత్మపుత్రి
గను, బెంచుప్రముచుఁ డన్మునియయ్యె నొకచుక్క
తత్ప్రియుం డయిన దుర్దమమహీంద్రు
పొలుపొందె నొకజ్యోతి పుత్రిప్రార్థనమున
రేవతీదుర్దమ ప్రీతిగాఁగ

నాకమునయందు రేవతి నలరఁజేసి
తద్వివాహమ్ము సలుపును_త్తమతపస్వి
ప్రముచుఁడాహిత్రభావమ్ము పరిథవించె
రైవతజ్యోతి యొండు తారాపథమున. 78

సీ. విధిచాక్షుషజ్యోతి విభవమ్ము సవరించి
యానంద సమభిఖ్య నధిగమించి
జాతిస్మరత్వ విజ్ఞానిత వెలుఁగొంది
తన్ను ముద్దాడెడి తల్లిచుక్క
నపహసించుచు జాతహారిణి యనుఘన
చ్ఛాయలో నిటునటు సంచరించి
హైమినీవిక్రాంతు లనుచుక్కజంటకు
బిడ్డయై యంతంత వృద్ధిఁజెంది

చాక్షుషానంద విజ్ఞానచతురమగుచు
బ్రహ్మవరమున భువనవైభవము నంది
మిన్ను ముట్టిన తనమేని చెన్నులొలయఁ
దనరె నొకచుక్క యానభోంతరమునందు. 79

సీ. సంజ్ఞామహాదేవి చక్కందనమ్ములు
ప్రకటించె నొక్కతారావధూటి
ఆమె ఛాయామూర్తి ననుకరించినరీవి
నొకచుక్కజవరాలు ప్రకటపఱిచె

వైవస్వతుండు సావర్ణి నా నటఁజిన్ని
చుక్కఁజంట పెంపెక్కి వెలుఁగ
దక్షసావర్ణి నాఁ దనరార నొకచుక్క
బ్రహ్మసావర్ణి నాఁ బరఁగ నొకటి

దిక్కు లలమిన వెలుఁగుల చుక్క యొకటి
ధర్మసావర్ణి రూపసాధర్మ్య మంద
రుద్రసావర్ణి భావమ్ము ముద్రపడఁగ
వెలిఁగె నొకచుక్క యా నభోవీథియందు. 80

క. పితృదేవతా ప్రసన్నత
కతనన్ నక్షత్రకన్యకన్ మాలిని వి
శ్రుతఁ బెండ్లియాడు రుచిదం
పతులయపత్యమ్ము సిరులు పఱలె నభమునన్. 81

గీ. చండశీలుండు భూతియన్ సంయమీంద్రు
శిష్యుఁ డగు శాంతి ప్రార్థనాసిద్ధిగాఁగ
నగ్నిహోత్రుని కరుణాసమగ్రమైన
భూతి తేజమ్ము చుక్కయై పొడిచె మింట. 82

సీ. తనస్వయంభూ భావమునఁ గృతార్థత్వమ్ము
వెలయించె నటనొక పెద్దచుక్క
తనస్వరోచి ర్మహత్త్వము సార్థకత్వమ్ము
ప్రకటించె నొకటి తన్నికటమందు

బహుతారకా గ్రహ భాస్కర కాంతులు
పరిభవించెను సురప్రసవభూతి
అఖిలవృత్తి నిదాన కాత్మాత్మసంచార
ములు దెల్పెఁ దారల పూర్ణరుచులు

అవి యసంఖ్యమ్ము లయినబ్రహ్మాండఘటలు
అవియె బహుపుణ్య పురుషమూర్త్యవతరములు
అవి సదాతన తేజో విహారగృహము
లవి పరస్పర నవ్యసూర్యార్భకములు. 83

క. ధీర యధీరయు ధీరా
ధీరయునన్ వెల్లమబ్బు తెఱచీరలలోఁ
దారల శృంగారరమల్
పౌరసతీమణుల హృదయభావము లయ్యెన్. 84

సీ. చక్కనిచుక్క లేజవరా లొకర్తుక
పతితోడి నూతనప్రణయవేళ
నునుసిగ్గువాఁకల మునిఁగి తేలెడి నవ్వు
చూపుఁజేపల బెళుకుసొగసు లొలయ
ఒకప్రౌఢతార వేఱొక తారఁ గనుగీటు
మొలకనవ్వులు పెరుగ లలమికొనఁగ
పలికె నయ్యర్థమ్ము కలకంఠకులకంఠ
ములఁ గూడి చిలుకలకలికి యొకతె

అలిగి వారల నదలించునట్లు చూచె
నపుడె తొలిదెసఁ బొడిచినయసదు చుక్క
కలకల మ్మది మాన్పనో యెలుఁగువిచ్చి
కోడికూసెను గుర్కురుకో యటంచు. 85

కురు కురు కార్యజాత మిహా కో నజహాతి సుషుప్తి మన్నటుల్
కురుకురు కో యటంచు మలికోడి యొనర్చుద్రుతప్రబోధముల్
వఱలెఁ బునారతి ప్రణయబంధ నిబంధనకావ్య మంగళా
చరణములై యశేషకవిసంఘ విగీత నిజోదయమ్ములై 86

సీ. తానెపో సకలవిద్యలనిదానమ్మన
మిట్టెక్కె యొకతార విఱ్ఱవీఁగె
తనుదాన లలితవిద్యలకు సమ్రాజ్ఞి నా
నుప్పరమంటె నదొక్కతార
తనకన్న నుత్తమ ధన్య లేదన్నట్టు
నిక్కిమిన్నులుచూచె నొక్కతార
తనరూపసంపద తక్కుతారలకు లే
దనురీతి నొకతార మినుకులొలసె

ఒకరిపోలిక లెంచి తన్నిప్పుకొనుజోలి
మాలి తనభావసంపద మధురమధుర
కాంతు లీనఁగ నొకతార గణనకెక్కె
నవ్విశాల నభస్సభాఽభ్యంతరమున. 87

## ఉ ద య ము

సీ. పౌరనితంబినీ వక్షోజ గతగంధ
కస్తూరికల చవు ల్గుస్తరించి
రతిభిన్న కామినీతతి మోముఁదమ్ముల
నిట్టూర్పులను గుట్టుమట్టు లరసి
రమణీమణీ మణిత మధురశబ్దమ్ము
లంతంతఁ దనమూర్తి నవధరించి
దక్షిణత్వము కృతార్థత్వమ్ము పండింప
నెల్ల యిల్లాండ్రకౌఁగిళ్ళ మెలఁగి
పవన యుపకుమార పతి చేయి వీచిన
బహుల శబ్దగంధవహాత లోలయు
నఖిలజంతుకోటి నంతంత మేల్కొల్పఁ
బిల్ల గాలికదుపు లల్లనల్ల. 88

సీ. తారకాలోక జాతములు వృత్తాంతముల్
జ్యోతిశ్శిఖరమ్ముల నొదిగియొదిగి
వాయుతరంగ సంబద్ధ బాంధవములై
యొయ్యొయ్య నుయ్యాల లూగియూగి
సుకవి సద్ద్విజరాజ నికరహృదంతర
భాగమ్ములను జుట్టివచ్చివచ్చి
తన్ముఖమ్ములయందుఁ దాము శబ్దించె సు
వ్యక్త మవ్యక్తమా పలుకుబడుల

నిత్యమనుభూయమానమా సత్యమిదియు
నరయనేరక తమదువృత్తాంతమందుఁ
బ్రతిఫలించుట నద్భుతపడుచు వినిరెఁ
బ్రాణిలోకమ్ము తత్కాలభాషణముల. 99

సీ. బహువిధ రతిబంధ పరవశతాముగ్ధ
గాత్రియై యామినీకాంత సోలసె
ఆసన్న కోపనాఽహాః కామినీస్మృతి
పరిశిథిలమతి నభఃపతియు వెలసె
ఉషఉజ్జ్వల త్తనూ సుషమాభిరాముఁడై
సమయజ్ఞ యానిశ రమణుఁ గొలిచె
రాత్రి వధూకృత రతిచిహ్న తారకా
ద్యుతి నభఃపతి మేన నొదిగికొనియె

పూర్ణగర్భాలసాంగి యాపొడుపుదిక్కు
నావులింతల వెడల మందానిలములు
సమయ మనియెడి నెఱమంత్రసాని యాన
జగము జగమెల్ల క్షణము నిశ్శబ్దమయ్యె. 90

సీ. ప్రత్యహ ప్రాగ్వధూ ప్రసవవేళా సము
ద్భవ వేదనాక్షర ప్రతిపదములు
ఆయాస్యమాన సూర్యాశతాంగ సూతతో
త్ర కలితారోద్భవ ప్రటరటములు

ఉత్తమప్రభు ప్రబోధోదిత వందిమా
గధ కృతప్రస్తుతి కలకలములు
అహరహా ర్నాటక ప్రారంభ నిర్దిష్ట
నాందీ పఠనపాఠన క్రమములు

ప్రమద రతిసుఖ జాతకుట్టమితములును
కేళిసంభేద భవ కిలికించితములు
భోగ పరితోషజనిత బిబ్బోకములును
తెలియఁ బలికెను బత్సుల యలబలములు. 91

సీ. రాజితక్రీడాభిరామవాల్లభ్యముల్
పరిఢవించెను భరద్వాజసుకవి
అద్భుత విక్రమార్కావిర్భవమ్ములు
జక్కన వినిపించె నొక్కసుకవి
పదగుంభనమ్ములఁ బ్రౌఢరీతుల నెల్ల
సవరించె నందునొక్క వికటకవి
సత్కావి కర్ణరసాయనమ్ముగఁ దన
యెలుఁగిచ్చె నొకకవి లలితగతుల

తనప్రియాశ్లేష చిహ్నిత ధన్యగళము
ప్రౌఢిఁ బ్రకటించె నటనొక భట్టుసుకవి
ఒక్కకలకంఠసతి గళ మొత్తియొత్తి
మాధవోత్సవ బహుళ సంభ్రమము తెలిపె. 92

అతులిత మాధురీరస సమంచిత భావము కాలకంఠ భా
విత నిజమూర్తియైన కవిపెంపు నవీన నిరూఢసాహితీ
స్తుతమతి పూర్ణిమాతిథిని సోమునిరీతి శకుంతలాస్య గ
ర్భితమృదుసూక్తి జృంభి కవివీర గుణాళి ధ్వనించె నయ్యెడన్.

ఎన్ని వచింపఁగా నలవియే కవిసంతతి పల్కు లన్నియున్
కొన్నిటిఁ గొన్నిటిం బలుకఁ గూడినఁ దత్పదమాధురీరసా
భ్యున్నతు లున్నవున్నటుల నొక్కొకవేళలఁ బల్కవచ్చునే
అన్నియునన్నియే బహుగుణాద్భుత కర్ణరసాయ నాంబుధుల్.

ఆయత భక్తితన్మయత నంది జగమ్ము ద్విరేఫకీటక
న్యాయము నంద భాగవతమాడెనుదద్భ్రమరాన్వయశ్రుతుల్
పాయగఁ జేయఁగాఁ జెవులబమ్మెర తుమ్మెదతేఁ డొకండు నా
రాయణి సాయకావళుల యందముఁజింద మిళిందబృందముల్.

సీ. పరమేష్ఠి రూపవిభ్రమ దర్పణమ్ములు
వాగ్దేవతాఽధరప్రౌఢరుచులు
ప్రతిపద స్ఫురితానురాగబంధమ్ములు
బంధుజీవప్రభా బాంధవములు
వికసద్దినాంబుజి న్యకరురాగ చ్ఛటల్
సకలలోక వసంత సంభ్రమములు
కలకంఠకవి శిరఃకనకాభిషేకముల్
నవజగచ్ఛూతాభినవదళములు

పరిభవిల్లె నంత బహుళోత్తమవ్రజా
విమల హృదయరాగ విసరణములు
విలసదుదయశిఖరి వెడలి మిన్నులుప్రాకె
తరుణతరణి కిరణ తరుణిమములు. 96

సీ. జయసుప్రభాత భాస్వరకృతి శ్రీకార
మధురతా ధురములు మాఱుమలసె
ప్రణయినీప్రణయ కోపకటాక్ష విభ్రమాఁ
కలితయువమ్ములు కొలువుదీర్చె
దళితమందేహాంగ గళితరక్తాపగా
వలితతరంగముల్ వఱ్ఱుకొనియె
విప్రకరాబ్జాత వియదుత్ప్రసారితాం
జలి జలారుణరుచు లలలుకొనియె

ననఁగ నరుణకిరణ నభినవకరములు
కలయఁ బెరసి మింటఁ గడలుకొనఁగ
సకలజగము నరుణసరసిజాకర మనో
హార రమావిభూతి నతిశయిల్లె. 97

సీ. క్షణమైన విశ్రాంతిగనక యుత్తమలోక
బాంధవాఖ్యానమ్ము పాడుకొనఁగ
ప్రాగవాగ్దక్షిణాపథములు నుత్తరా
పథము నేకసితాతపత్రముగను

తా నేకరథుఁడు సద్ధర్మపాలనమునఁ
బ్రజలెల్లఁ దనకన్నబిడ్డలు గాఁగ
ప్రాచీవధూ మనఃపద్మబంధుండయి
రాజన్వతిగఁ దనరాజ్య మెల్ల

నుదయసుందరశిఖరిపై ద్యుమణి వెలిఁగె
మహితకాసారాబ్జమునఁ బితామహునివోలె
గరుడుమూఁపున నిందిరావరునివోలె
రత్నపీఠిక నుత్తమప్రభునివోలె. 98

వ. ఆసమయమ్మున నుత్తమప్రజాపతి యేకశిలావినిర్మితమ్మును, సహస్రస్తంభాభిరామమ్మును బ్రతిస్తంభాధోభాగ సముత్కీర్ణ గజయూథగమన మనోహరమ్మును, స్తంభస్తంభ శాణిత మధుర సప్తస్వరాలాపి పృథుక స్తంభ సప్తకసంభృతమ్మును దదుపరిభాగ ఖచిత హయ ప్రచార రమణీయమ్మును బ్రతిభిత్తి రచిత చతుష్షష్టికలా లక్ష్యాయమాణ శిల్పమనోజ్ఞమ్మును ఉపరిభాగ సముల్లిఖిత శివాపదానహృద్యమ్మును చతుర్దిగ్ద్వారాగ్రభాగ విలసద్దిగ్గజ భ్రమకారి శిలాశుండాల యుగళాభిరామమ్మును ప్రతిద్వార విరాజి ప్రత్యంగుళ బహువిధ శిల్పమధుర సముత్తాళ స్తంభయమళోపరి విభ్రాజి హంస వృషభ సింహ వ్యాఘ్ర యుగసముజ్జ్వలమ్మునగు కమలసభా భవనమ్మునఁ జతుష్పార్శ్వ వినిర్మిత బహుసోపాన మనోహరమ్మగు

సమున్నత సువిశాల రత్నవేదికయు తదంతరమునం దష్టా దశవిద్యాస్థాన సూచకమ్మగు సింహాసనమ్మున సారభూతమ్మై శశికాంతశిలా వినిర్మితమ్మగు సుందర మహానట శివమూర్తి కభిముఖమ్ముగా సింహచతుష్టయు విలసదుపరి భాగమ్మును కరధృత చామరయుగళ రత్నమయ నాగ పుత్రికా ద్వంద్వమనోజ్ఞమ్ము ధర్మచక్రాభిరామమ్ము కాల చక్రనిరూపకమ్మునగు స్తంభమ్ముక్రింద స్ఫటికశిలా విని ర్మితమ్మై సుఖశయితమూర్తి నొప్పారు వృషభేంద్రుక్రేవ నీషదధఃకృతమ్మును ఫణిఫణాగ్రనిక్షిప్త చరణయుగళ మ్మును సువిశాల బర్హమనోహరమ్ము మయూరాకార విరాజమానమ్మగు రత్నసింహాసనమ్మునం గవిదిగ్గజమ్ము లును బండితరత్నమ్ములును రాజసింహులును మంత్రిపుంగ వులును ముఖ్యప్రకృతిజనమ్మును బలాక సాలపోతక ప్రభృతి మిత్రబృందమ్మును దత్తదర్హస్థానమ్ముల సముత్సామ్ము నం బొదలి బలసి కొలువ నిండుకొలువుండె నంత 99

క. నందయును నందజననియు
నిందుముఖీ జనసహస్ర మిరుగెలఁకుల రా
నందు వసించెను బహులా
నందాకృతి రాణి రత్నవపీఠమునన్. 100

వ. అంతటఁ బరిసర గిరిశిర స్సరత్సరిత్ప్రవాహ తరంగశీతల మ్ములు, నుపగత కదళీవన సుకుమారపలాశజాల చాలిత

ములు మధుర నవవసంత వతంసాయమాన రసాలసాలకు సుమమంజరీపుంజ సమాఘ్రాతమ్ము లగు కోదమ కరువలి కదుపు లంతంతం బ్రసరించియు, నక్కోకిలువుకూటమ్ము నందుఁ జౌర నేరనియట్లును నేర్చియు వెలిచినట్లయి యల్ల నల్లన నందందు మెలఁగి మెలంగి వెడల నెఱుంగనియట్లును నెఱింగియు విడువందలంపనియట్లు నమ్మహాజన సంస్పర్శ విశేష సుఖపరవశతావిధురమ్ములట్లు పరిత స్స్వప్రహాణీయ మధురసంచారమ్ము లయ్యె. అయ్యవసరమ్మున నమ్మహీపతి కనుసన్న నెఱింగి త్రియీమూర్తు లగువిప్రపుంగవులు ప్రణవోచ్చారణపూర్వకమ్ముగా వేదగానమ్ములు సలిపిన యనంతరమ్మున. 101

పండితరాజరాజు ప్రతిభాఽప్రతిమాన విభాసమానతన్
రెండవభారతీహృదయనీరజబంధుఁడు కింకవీంద్ర వే
దండఘటా మృగేంద్రకవనాఢ్య గుణాఢ్యకవీంద్రుఁ
డోకట్లఁ డా
నిండుసభన్ నిజప్రతిభ నిస్తులతన్ వెలయించె హేలగన్. 102

క. ఉపమారహిత కవిత్వము
నుపమాగుణ పూర్ణ రసనమున్నతు లోలయన్
తెలిప కెఱుకపటిచెఁ గవితతి
నపూర్వుఁ డోకసుకవి వాణియాకారమ్మై. 103

క. విరహి పరిణయజ వార్తా
హారణకథా స్మరణవిషయ మా సభ యెల్లన్
సరసగుణ వస్తుకవితా౽
మరవాహిని నోలలార్చె మధురగళమునన్. 104

కరుణరసప్రధానము జగమ్మఖిలమ్మును గాఁగఁ దెల్పుచున్
విరహి మనోనురాగ నవనీతము విందులు వెట్టుచున్ రసో
త్తర భవభూతి సారచరిత మ్మొకసత్కవి పల్కె నద్రిలున్
గరుణరసప్రవాహముల నావలపోలిక తేలియాడఁగన్. 105

సురుచిరరూపసంపదల సూర్యశశాంకులు బుద్ధిమై సురా౽
సురగురుమూర్తులా కవికిశోరము లిద్దఱు శారదాస్తన
స్ఫుర దమృత ప్రవాహ పదపుంజ విభావిత పూర్వజన్మ భా
స్వరులు వెలింగి రా పృథుసభాస్థలి వచ్చియు రానిమీసలన్.

అరుదుపడన్ సభాజనము లాశువుగాఁగ మహీసురేంద్రు స
చ్చరితము నానుపూర్విగఁ బ్రసన్నకథా గతిమాధురీధురం
ధర రసభావపూర్ణ కవితాగుణ రీతిమనోజ్ఞ వృత్తబం
ధురమృదుశయ్యలన్ గలమనోజ్ఞగళమ్మునఁబల్కియొయ్యనన్.

తడితరదుష్కరమ్ములు నదఃప్రథమమ్ములు ధారణామహ
త్త్వ దళిత బుద్ధివైభవ పితామహాము ల్మహితాత్మశక్తి సం
పదములదర్పణమ్ము లసమానము లష్టశతావధానముల్
సదఉపవిష్ట సర్వజన లాలితముల్ పొనరించి రయ్యెడన్. 108

సీ. వివిధ దేశాయాత విద్వత్కవీంద్రులు
తమతమ దేశికావ్యములు చదువ
ఖండఖండాంతరాగత సత్కవీంద్రులు
తమ ఖండకావ్యగీతములు పలుక
బహుసీవృదాగత ప్రౌఢనటీనటుల్
తమతమ దేశినృత్యములు నెఱప
సంగీతసాహితీ సస్యసుక్షేత్రముల్
గాయనుల్ రాల్గరగంగఁ బాడఁ

బరిఢవించిరి శివభాగవతము నందు
భావికాలంకృతులు స్వభావములుగాఁగ
సిద్ధయోగీంద్ర భరత ప్రశిష్యమణులు
నటులు నటరాజహృదయమ్ము నాట్యమాడ. 109

సీ. మల్లయుద్ధమ్మున మాఱులే దనిపించె
నభిరామమూర్తి భీమబలుఁ డొకఁడు
ఖడ్గచాలనమున ఖండఖండముల ని
స్తులతఁ దెలిపె నొక్క తెలుఁగుజోదు
పులినెల్లఁ గరి హరి బోనులం దెఱపించి
యార్చి పేర్చెను నొక్కఁ డాటవాలె
ఎదు రెందు లేదనఁ గదనుద్రొక్కించెను
శూకలాశ్వము నొక్క శూరవరుఁడు

విల్లునమ్ములుచేఁ బూనివింతవింత
లక్ష్యములనేసె నొకధనుశ్శిక్షితుండు
ఇంద్రజాలమ్ము లనికొన్ని యేర్పఱించి
ప్రజల నలరించె నొకమంత్రవాది యచట. 110

అదియొకయద్భుతమ్మగు మహాకృతియై కవిశిల్పిలోకముల్
కొదువలు లేని మేల్కృతులకుం బనిపూనెడునట్లు సేసె నా
హృదయవిమోహనమ్ములగు దృశ్యము లయ్యె గభీరభావసం
పదల నిదానముల్ సరస వస్తుకవిత్వ మహోపదేశముల్. 111

వ. అట్టియెడల నానందసముద్భవత్పులకీశితయు, నశోక హర్ష వర్ధనుండును విక్రమాదిత్యుండును బ్రతాపరుద్రుండును, మహాసభా సముద్గుప్త నవరత్న విరాజితుండును, మనో జవశాలివాహనుండు నగు నయ్యుత్తమప్రభుండు ప్రజల కెల్లరకు సుబోధమ్ములుగా ధ్వనిమధురమ్ములు ప్రాకృత భాషాకృతమ్ములు బహుళాత్మ ప్రబోధదర్శనమ్ములు నగు గాథాశతమ్ములు ప్రసన్నపదబంధమ్ముల నాలాపించిన 112

గీ. హర్షజడమైన యాసభ యనుకరించె
నాసభాంతర ఖచిత చిత్రాళిభూతి
శబ్దరూపగరిహార్ధమ్ము సల్పఁబడిన
యంత్రసమితియు క్షణ మాగినట్టులయ్యె 113

వ. మఱియు నయ్యఖిలవిద్యా శ్రీమతత్త్వ కోవిదుండు. 114

సీ. దీనారటంకాలఁ దీర్థమ్ము లాడించి
కవిసార్వభౌముల గారవించి
పల్లకీ తనకేలఁ బట్టి యూరేగించి
కవిపితామహుల కుత్సవము సలిపి
అగ్రహారశతమ్ములయ్యె బుధావళి
కడిగిన తావులయందొసంగి
అక్షరలక్షల నర్పించి నిస్పృహుల్
సయితమ్ముఁ గైకొన సత్కరించి
సలిపె జయవసంత సమయోత్సవమ్ములు
ఉత్తమప్రభుఁడు మహోజ్జ్వలములు
వివిధజను లొకింత విశ్రాంతిఁ గననీని
తమకములను నుత్సవముల మునుఁగ. 115

వ. ఇమ్మెయి హృష్టపుష్ట జనాకీర్ణమ్మగు నమ్మహామహమ్మునం బ్రవర్తిల్లిన యయ్యె విశేషమ్ములు తమతమ దేశమ్ముల జనమ్ములకెఱింగించు తమకమ్ములఁ బాతాళాధిపప్రముఖుల పరివారమ్మునవారు తమతమయొద్దంగల శబ్దచ్ఛాయాగ్రాహకమ్ము లగు బహుముఖయంత్రవిశేషమ్ములందుం బదిలపఱచుకొనియు బెక్కు విషయమ్ములు విజ్ఞులగువారివలన నెఱిఁగికొనియు స్వదేశభాషాకావ్యమ్ములుగ వానిని బ్రబంధించుకొనుచుం గృతార్థత్వమ్ము నందునెడలం గించిదవశిష్టమ్ములుగా నమ్మహమ్ములు పరిపూర్ణమ్ము లగుటయు

నందొకనాఁడు భావి వసంతోత్సవమ్ములకుంజీవగఱ్ఱియగు
బాహులేయ జననమ్మునకు సూచకమ్ముగా నచిరవర్తు
లగు గణపతినవరాత్రమ్ములకు మంగళాచరణమ్ముగా. 116

సీ. వక్రనాసుఁడె గాఁడు వారణవక్త్రుండు
నయ్యుఁ దానుముఖత్వ మందువాఁడు
నెలనుదాల్చుటెగాదు ఖలుగజాసురుఁ గూల్చి
గతికెపూజకె మెచ్చు గాంచువాఁడు
చపలశ్రుతియె గాదు కపటవారణుఁడయ్యు
సర్వార్థసిద్ధు లొసంగువాఁడు
లక్ష్మి యున్నదియుండ లలితవిద్యల కెల్ల
విభుఁడయ్యు వర్ణి నా వెలయువాఁడు

తల్లిదండ్రులబోలు వదనమువాఁడు
నరుఁడు తనువున ముఖమున హరియు నైన
విఘ్ననాథుని శశికాంత విగ్రహమ్ము
దర్శనంబిచ్చె నొకశిల్పి ధరణిపతికి. 117

వ. ఇచ్చి యన్నరపతి ముఖాంభోజ దర్శనవిశేషమ్మున నా
శిల్పివరుని హృదయమ్మున సముల్లసిత కుతూహలయగు
భారతీదేవి యూవహిల్లుటయు. 118

ఓంకారార్థ వివేకదర్పణ శరీరోల్లాసి తేజోలస
ద్ఝుంకారమ్ములు తన్మహాధ్వని గుణాంగీకారి భృంగావళీ

ఝుంకారమ్ములు నృత్యదీశ్వర పదాబ్జాత స్వన త్కింకిణీ
శంకాంకూరములేలు నుత్తమమహీజానికి సతీయుక్తునిన్. 119

శుండాదండ నిపీత నిర్ఝరనదీశుభ్రాంబుపూత్కారముల్
గండోచ్చైస్సర దిద్ధదాన యమునా కల్యాణ పాథోమిథ
శ్చండాఘాత ఘుమంఘుమ ప్రకటిత స్వాచ్ఛత్వ డిండీరముల్
శుండాలాసుర ఖండనమ్ములు మహస్సుల్ మిమ్మురంజించుతన్.

సీ. అఖిలవిద్యా రహస్యార్థ బోధకమణీ
దర్పణమ్ములు మనస్తర్పణములు
సకలకార్యారంభ సాకల్యలక్ష్మీ స
దాఽముఖమ్ములు శుభాఽహార్ముఖములు
అంగీకృత స్త్రీపుమాకారముఖరూఢ
తత్త్వమ్ము లతిగాఢ సత్త్వములును
దానధారా మహాస్నానదీక్షా భక్త
బృందమ్ము లధిగ తేందిందిరములు

పరిఢవించుత నర్తన పరవశములు
విఘ్ననాథుని ఘనకృపా విలసనములు
ధారుణీజాని సత్సభాంతర మనోజ్ఞ
వనవసంతోత్సవారూఢ వైభవములు. 121

సీ. శివజటాజూటికా స్నిగ్ధపరబ్రహ్మ
సూత్రార్థ దర్పణ స్ఫోరకములు

హారశిర స్ఫురదతిస్వచ్ఛ గంగానదీ
పాథో విధఃకృత బాంధవములు
చంద్రశేఖర శిరశ్చంద్రి చంద్రాతప
స్పర్ధా వివర్ధనసౌరభములు
నాగభూషోష్ణీష భోగివిస్తృతఫణా
బహుముఖశ్రీ ప్రతిద్వంద్వములును

విజయమందుత మధురగంభీర మృదుల
నంది పదచాలనోత్థ ఘణంఘణమ్ము
లంబికావాహ సింహగర్జాను కృతులు
కవనలక్ష్ములు నృపసభాభవన మందు 122

సీ. శివతపస్సంరంభశిథిలీకరణచణ
హైమవతీ కటాక్షాదరములు
పార్వతీపరమేశ పరిణయోత్సవమిధో
మూర్ధాగ్ర నిక్షిప్త పుష్పతతులు
షణ్ముఖాఽలోకన స్వైరనిర్వ్యాజగ
జ్జననీ కుచామృత జహ్నుసుతులు
పురవిజయోత్సవేశ్వర దర్శనోత్కంఠ
గిరిసుతా దరహాస తరుణిమములు

విశ్వమంగళములు విశ్వవిజయకృతులు
సర్వమంగళా ముఖశర త్పార్వణములు

ప్రమద నటదీశ కరచల డ్డమరుకములు
జయముగాంచుత వరకవీశ్వరుల కృతులు. 123

క. అని దీవించిన నరపతి
కని కని యాశిల్పగుణము కవితాగుణమున్
కనకము పసదన మిడె నా
వినాయకునియెత్తు శిల్పవిబుధునియెత్తున్. 124

ఇచ్చినఁ జూచి శిల్పివరుఁ డిట్లనె. రాజమహేంద్రి నేఁడు, నా
హెచ్చినపుణ్య మెల్ల ఫలియింపఁగ మీదగుదర్శనమ్మునన్
వచ్చిన యీకవిత్వపరిపాటి సువర్ణత నందెనిట్లు, నా
తెచ్చిన శిల్పమైన గురుదక్షిణ యొండు గ్రహింపవేడెదన్ 225

ఇచ్చ ననుగ్రహించి గురుఁడిచ్చినసొమ్మిది యాను గాదు, నా
వచ్చునె? శిల్పి నన్నుఁ గవివర్య నొనర్చిన మిమ్ము నెంచి,యీ
వచ్చుశరన్మహమ్ముల భవాని మనోహరవిగ్రహమ్ము, నేఁ
దెచ్చెద నీసువర్ణమున దేవర కేను గృతార్థతన్ గనన్ 126

అనునెడ సభ్యులానృపతి యాకృతియందుఁ బయోనిధాన విం
ధ్యనగ సరస్సరోజ శశి నందన చందన కృష్ణవేణి కా
వినిమయముల్ రసార్ద్రి సుకవిత్వ జనిస్ఫుట మూలహేతువుల్
కనిరి ప్రసన్న భారత కలానిలయమ్ము లఖండ భావముల్. 127

క. తన హృదయనిర్విశేషము
గను మన్ననచేసె శిల్పికవి నుత్తమభూ

జనపతి సభాజనమ్ముల
మనములు పరితృప్త భావ మధురమ్ములుగన్ 128

వ. ఆ సభాసదులు నిత్యానుభూయమానమయ్యు నత్యపూర్వ
మ్మగు నవ్విషయ విశేషమ్మును భావించు నెడల. 129

గీ. సకల కళలకుమా దేవి సారరూప
దివ్య భావ రమాచల దేవి యనఁగ
చంద్రిమ స్సారకిరణ సంజాతయొక్క
సాని యీశానియై గొండ్లిసలిపె నందు 130

క. అభినవ మగుతనయఃభినయ
విభవమ్మున విశదపఱచె వెలఁదుక విశ్వ
ప్రభవాభ్యుదయ తిరోధా
న భావతత్త్వము సభాజనమ్ముల మదులన్. 131

క. మానిని యొకర్తు శారద
యో నాఁ బలికించి వీణె నొడఁగూర్చెను బ్ర
హ్మానంద మెల్ల సభ్యుల
కానందో బ్రహ్మ యనుట యట నిక్కముగన్. 132

గీ. కిన్నరలు పాటె వీణెలు కెరటుగొనియెఁ
గోయిలలు పల్కెఁ జిలుకలు గొంతులెత్తె

వేణువులు మ్రోసె నందుఁ దన్వీలలామ
మధురగళమున నాదసంపదలు వెడల. 133

అనుపమ మైన యాయభినయమ్మును గాన మపూర్వరీతులన్
కనులను వీనులందగిలి గాఢముగా మదులంటి యాసభా
జనులఁ బురాజనుర్వీభవ సంస్కృతిమూలము లంటఁజేసె నా
ధ్వనిమయమై యుదాత్త రసభావ గుణోజ్జ్వలి శిల్పకావ్యమై.

కవికుమారుఁ డొకఁడు మధుర కావ్యకుసుమమంజరిన్
నవరసధ్వని ప్రధానన్నై పుణీ నిధానముక్
కువలయాధిపతికిఁ గాన్కఁగూర్చి యొసఁగువేళలన్
కుపుకువుల్ ప్రతిధ్వనించెఁ గోకిలల్ శిలాకృతుల్. 135

వ. మఱియు నతండు తన యాశుకవనచతురిమమ్ము మధురి
మమ్ము నందు నెఱపి కృతార్థత నందందలంచి జయజయ
శబ్దపూర్వకమ్ముగా. 136

ప్రతిపక్ష క్షితిభృన్మదోద్ధతి లసద్వక్షోహసంతీ ఘృణుల్
శ్రితవాంఛాధిక దానవైభవ విరాజి స్వర్ణదీనారముల్
ప్రతివర్ష ప్రధమానమాధవవపుః ప్రస్ఫీతతారుణ్యముల్
స్తుతికెక్కెన్ ధర నుత్తమప్రభుని తేజోభానుదీప్రాంశువుల్.

## వసంతదశావతారమాలిక

ఆమనిఁ దీవెయైదువుల యల్లనిచూపులు వ్రాలు మీలు నై
యేమఱితాతఁ బ్రాఁజదువులెల్లను గొల్లలుగొన్న రక్కసిన్
వేమఱు సీతు వన్ గడలినిక్కినఁ గిట్టుచుఁ బట్టియిచ్చు నా
సామి మెయిం దళ త్తళల చందము లందములై యెసంగ నా
ప్రామినుకుంగముల్ పలుకు పాఱుకొలమ్మునవారిఁ బోలుచున్
బ్రేముడిఁ గ్రొత్తగొంతుకలు విచ్చెను గోయిల, లంత లైనపో
రాములు వెట్టు నచ్చెనఁటి రక్కసి యుస్సురులయ్యెఁ దుమ్మెదల్
ప్రామిచయామునఁ గడసవాఱిన సంద్రము సీతుకారుగాఁ
దా మవియెల్లఁ బొల్కడలిఁ ద్రచ్చెడిపట్టులఁ బుట్టునవ్వడుల్
పాము నొడల్ కడల్ విడి చెలంగు నురుంగులకుప్పసమ్ములై
తా మిను మన్ను మ్రింగెడివితమ్మునఁ గ్రమ్మ విసమ్ముపోకడల్
గా, మిసుదాఁకు నబ్బగబుగల్ పొగలయ్యెను గండుఁదుమ్మెదల్
గోమున వ్రాని నాఁగికొనెఁ గ్రొన్నెలతాలువు సొంపుసంపెగల్
దీమస మెక్కనామనియు దీయుసితేనియ పాలువెన్నెలల్
గా, మెఱయన్ సిరుల్గురియఁగాఁ జివురాకులకెంపుసొంపు లొ
త్తై, మురిపింప నచ్చరలయందము చిందెను దీవెకన్నియల్
వ్రాములుచూపులున్వలఁపుఁబుప్పొడిపూఁతలునూర్పుఁదెమ్మెరల్
న్నై, మఱపింపఁ దేనియల మాటల, వేల్పులుఁదొంటివేల్పులై
తా మట బంతిగట్టినవిత మ్మగు తుమ్మెదపిండు కోయిలల్
తామరతంపరై యెదుఘదారులు చూడఁగ విందువెట్టె న

య్యామని పేరఁటాలు దొలియారజపుంజెలి దీటుకత్తెయై
మామిడి పొల్చె రమ్య కుసుమ స్తబకస్థ శిలీముఖోచ్చయ
శ్రీ మహిఁ దంష్ట్రఁ దాల్చిన కిరిప్రతిమమ్ము కిసాలరాగముల్
స్వామి మెయిన్ విభిన్న నిశిచార తనూగళ దస్రధారలై
ఆ మెయి మంగళోదయ వరాహమ్ములై శుభదర్పణమ్ములై
సామిహారి ప్రభావములు సాటె వసంత పితృప్రసూ ప్రభా
స్తోమము నెవ్వగ ల్పగలు దుంచుడు కాఱి జగద్ధితమ్ము నౌ
భూమికి నాహిరణ్యకశిపున్ వధియించుటలై మిసాహారి
గ్రామణి దంష్ట్రికాయుగ కరాళముఖాకృతి బాలచంద్ర శో
భామహితాభ్ర రేఖ నెఱపన్, బొలుపాఱెఁ బలాశమండల
స్వామి రసాలనామబలి చారుశిరోఽగ్ర సర త్రివిక్రమ
శ్రీ మృదులాంఘ్రి బంధుర రుచి ప్రియబంధు మదాళిమాలికా
శ్యామల కోమలాంబర విహారసఖు న్నవదోహద క్రియా
ధూమవిసర్పణ క్రమగతుల్, శిశిరర్తు నృపాలవంశ భి
ద్రామ కఠారతీక్ష్ణ రుచిరంజిత కింశుకరాగ కాంత్యసృ
గ్భామ శమంతపంచక సముల్లసిత ద్విజసంతతి ప్రభల్
రామ వసంతవాసర తిరస్కరణాసురజాతి రావణో
ద్దామ శిరో నికృంతనవిధా పరమేష్ఠి వరిష్ఠమార్గణ
స్తోమ శిలీముఖోత్థ రవ తుందిల దిక్కరి కర్ణ వీధికా
భూమి పునఃపునర్ధ్వనిత పూస్త్రయఖండన చాపఖండన
క్ష్మామహిళాత్మజోపయమ మంగళవార్తలు, మాధవోత్సవ
శ్రీ మధుపాన కౌతుకవిశేష లసద్బలరామ బాహుశా

ఖా మణిలాంగలీభవ దగ స్త్ర్య విశ్రృష్ట ఘనాళిపాళికా
యామున వా స్తరంగ విభవాతిశయమ్ములు కృష్ణలీల లై
తా ముని యైన కోకిల యుదారగుణార్ధి యశోకపల్లవ
శ్రీ మృదుపాటలాంబరముచే నవకుంచితమూర్తి యై యహిం
సామయ ధర్మబోధముల సారము దెల్పెఁ గుహూకుహూ ధ్వని
శ్రీ మధుభావముల్ మృదుసిషేధములై యలరార హింసకున్
సామము చేతఁ జక్కఁబడ జాలని జాల్ముల లోకకంటక
స్థేమ విధైకవర్తనుల ధిక్కృతపుణ్యుల నొంపగా రమా
కామియె కల్కినామమునఁ గల్కితనమ్ములు చిల్కుచిల్కయై
మామిడిమావు నెక్కె మధుమాస సమృద్ధి దశావతారమా
లా మృదుభావ సౌరభ కలా విభవోజ్జ్వల సంస్కృతాంధ్ర వా
ణీ మహనీయ సత్కవి వినిర్మిత కావ్యకథా మనోజ్ఞశో
భా మహితప్రభావములు భావిత గౌతమ సహ్యాకన్యకా
కోమలతుంగ భంగ రస గూఢ మనఃకుతుకాబ్ధి సారిత
ప్రేమ తరంగహస్త సుచరిష్ణు భవిష్ణు మృషాఘపాకృతుల్
వ్యోమ మహాకృతి ప్రసర దుజ్జ్వల మంగళ తారకాకృతుల్
కామ జగన్నిరూఢ నవకౌతుక యౌవన జృంభణాకృతుల్
శ్రీ మధుమాసలక్ష్మి నెఱచెల్వొలు గొల్వులు తీర్చె నెల్లెడన్.

వ. అనుచుం గలమధురస్వరమ్మునం బలికిన నాకూడిన విద్వచ్ఛ్రీమ్మతనియాశుస్ఫురణమ్మునకు మనమ్ముల నానందించి దీవించి రావిద్వత్ప్రభుండతని దనహృదయనిర్విశేషమ్ముగా భావించుచు, 139

క. గండరగండర బిరుదాం
కుం డనఁదగు వానియజ్ఞకుం డొసఁగె మణీ
మండిత మగుపెండేరము
కుండలిపతి భావ నిబిడ కుతుకాంకురముఁ గా. 140

వ. అంతటఁ దత్సభాధ్యక్షపదవి నలంకరించిన పాలాశాధీశ్వరుం డిమ్మెయి విస్తరిల్లిన బహువిధ లలితకలా ప్రదర్శనవిశేషమ్ముల నొదవిన ముదమ్మున, భారతవర్ష మహత్త్వమ్ము ప్రత్యక్షమ్ముగా నంగీకరించిన విలాసమహనీయరూపమ్ము లగు నాకలామూర్తులనుపలక్షించి యదస్సమస్త విభవమ్ములకు సాక్షిమాత్రుండై వెలుంగు నుత్తమప్రభు బహుళాప్రజావతీసహితు మనమ్మునం బ్రశంసించి తదనుమతమ్మున నమ్మహోత్సవ రసవిశేషమాధుర్యవిధురమ్ముగు నా సభాజనమ్ముఁ గలయం గనుంగొని యుల్లన నిట్లనియె. 141

పుట్టు కృతార్థతామహిమ పొందఁగ నయ్యెను నేఁడు నాకు మీ
యట్టి కలాస్వరూపుల సమక్షమునన్ వసియింపఁ గల్గుటన్
నెట్టకవచ్చు నాహృదయ నిర్భరతోషము నాదరించి యూఁ
కొట్టరె? పుట్టుగ్రుడ్డు పలుకుల్ రససిద్ధుల బుద్ధి కెక్కవే. 142

క. శివమును సత్యము సుందర
మను వస్తు వెఱింగినట్టి యాత్మజ్ఞుఁడు శి
ల్పివరుం డితఁ డయ్యనుభూ
తి విశేషము తీర్పు లిందుఁ దెలియ నొసర్చున్. 143

పరమంబౌ రసరూపవస్తువును సంభావించి భావించి సుం
దరరూపమ్మునఁ జిత్రమందు సరిదిద్ద న్నేర్చుటల్గాక, యీ
శ్వరరూపమ్మును గర్కశ మ్మగుశిలన్ బ్రత్యక్షమున్ జేసె నీ
వరశిల్పప్రభవాబ్జసంభవుఁడు దివ్యం బాత్మ సౌందర్యమున్.

అంతట నిండియున్న పరమాత్ముని రూపము చట్టురాతిపై
నింత మృదుప్రకారమున నిమ్మెయిఁదీర్చిన నీనిచిత్తసం
క్రాంతియు నీసహస్తగత కౌశలమున్ బ్రకటమ్ముసేసె న
త్యంత వినిర్మల మ్మితనిదర్శనమున్ బరవస్తుభావనన్. 146

పలుకుల కందరాని రసవస్తువుఁ దాఁ గనుగొన్నరీతు ల
త్యలఘుతఁ జెల్పి నియ్యభినయమ్ములపెంపున నివ్వెలంది ని
ర్మల బహురూపశిల్పములు మాయక యయ్యెయివేళలన్ గనన్
వెలయఁగ నాత్మమూర్తి రసవీధులఁ బొంగు తరంగిణీక్రియన్.

ఆ. వె. శిల్పివరు రసైక సృష్టి యల్లల్లన
నభినయింప నేర్చునంతె కాక
పలుక నేర్చె మధురకలగళస్ఫూర్తి నీ
వెలఁది గానమహిమ లలలుకొనఁగ. 147

ఆ. వె. అభినయింపఁ బలుక నయితిగానట్టి య
వ్వస్తు వెంచి భావపరవశతను
గలమనోజ్ఞగాన విలసనమ్ములఁ జేసి
ప్రకటపతిచె నికచపద్మనయన. 148

కలకంఠమ్ముల రాగభేదముల రేఖం దా రసబ్రహ్మమున్
పలికించెన్ దనవీణెలో బహుళశిల్ప ప్రౌఢవిజ్ఞానముల్
వెలయుంగా, ధ్వనిగర్భిత మ్మమల మీ విశ్వమ్ము దీపింప నీ
లలనారత్నము భారతీనవవయోలక్ష్మీసముల్లాసయై 149

ఆ.వె. అభినయింప వ్రాయ నాలాప మొనరింప
నలవికాని వస్తు వరసియరసి
అధికతపముకలిమి నక్షరరమ్యమౌ
శిల్ప మిచట వెలయఁజేసె సుకవి. 150

ఆ.వె. అభినయమ్ము గణములందుఁ బ్రకాశింప
రీతులందుఁ గానరీతు లొలయ
అక్షరమ్ము శివము నగురసబ్రహ్మమ్ము
సుకవికృతులయందుఁ జూడనయ్యె. 151

రాలనుగూడ నీశ్వరునిరమ్యతఁ జూపినశిల్పివో లెఁ బ్ర
జ్ఞాలలితుండు నైకవిధశబ్దనిగూఢరసస్వరూప ము
న్మీలనసేసె నీసుకవి నిర్మలకావ్య మనోజ్ఞదర్పణ
శ్రీ లసమాన వస్తుగుణ చిహ్నిత శిల్పము లుల్లసిల్లగన్. 152

గీ. శబ్దజాలమ్ము పేరిటి జలజములకు
బాంధవుం డగు నీకవిబ్రహ్మవలన
తనుముపాయంగ రసపిపాసము సదాళి
మధుర మధుపానకౌతుకవిధుర మయ్యె. 153

సీ. భావించి భావించి బాహ్యరూపమ్మును
సృష్టిగావించె నీశిల్పివరుఁడు
తలపోసి తలపోసి తత్పర మ్మైదెల్పె
నభినయమ్ములను నీ యాటవెలఁది
ఆరసి యారసి యాలాపరూపమ్ము
పలికింపఁ బాడె నీ పద్మనయన
ఈక్షించి ఈక్షించి ఋషియాచు నవి యెల్లఁ
గాన్పించెఁ గృతిని నీ కవివరుండు
వాక్కు మనమును జేరఁగా వలనుపడని
యట్టి శ్రుతివేద్య మావస్తు వరయునట్టి
లలిత రసమూర్తు లయిన యీనలువురందుఁ
దారతమ్యమ్ము లాడంగఁ దలఁప నగు నె. 154

వ. అయినను. 155

శిల్పము స్థావరమ్మగుటఁజేసియు న ర్తనగాయను ల్మహాః
కల్పిత దేశకాలగుణ గాఢవికారనిరూఢు లౌట చే
నల్పిత తుల్యవస్తుగుణుఁ డై నకవీంద్రుని కావ్యమెన్న నా
కల్పము విశ్వధాత్రికిని గావ్యవిధాతయు శాశ్వతుండగున్ 156

వ. మఱియు నీతని కథాకల్పనమ్ము 157

క. అవినాశి యయిన నిజధ
ర్మవిశేష మ్మాత్మగాఁగ రసమధురమ్మై

కవి హారితకిశోరక భ
వ్యవస్తు కృతియగు మనుత్తమాన్యతమమ్మై. 158

క. సుకుమారతా ప్రసన్నత
లకలిమి నుపమా స్వభావ లలితమ్మును భా
వికరూపక దీపకముల్
ప్రకటిత కవిహృదయదర్పణమ్మయి యలరెన్. 159

క. ప్రాకృతమై సంస్కృతమై
ప్రాకృతభాషావిశేష పరిణతి కిరవై
ఈకృతి త్రిలింగభాషా
శ్రీకారాకారమై విశిష్టత నొలసెన్. 160

క. సకలాలంకృతి మూల
ప్రకృతి యతిశయోక్తి నాక వామోక్తిని మె
చ్చక యనుపమమై యీకృతి
ప్రకటించె మనోజ్ఞమా స్వభావోక్తిసిరిన్. 161

క. బహుదేశ బహుళభాషా
మహనీయ కవీంద్రసూక్తి మాధుర్యగుణ
స్పృహణీయమై యుత్తమ
మహిప యశశ్చరితాబ్జమండల మయ్యెన్. 162

క. త్రివిధము లగుశబ్దార్థము
ల వృత్తులను మూఁడురీతులను వృత్తుల నా

త్రివిధగుణమ్ములఁ బెరసిర
సవదాదు లలంకృతుల్ ప్రసక్తమ్ములుగన్. 163

గీ. సుప్రసన్న పదార్థ సంశోభి యయ్యె
నది యలంకృతిసూక్తి ననన్వయాఖ్య
నంది దృష్టాంతసారమై యఖిలసుకవి
విస్మయోత్ప్రేక్షలకు రసవీథి యయ్యె. 164

క. ఉపమాన మ్ముపమేయ
మ్ము పరస్పరము స్వపదార్థములై యగుచును దా
నుపమేయోపమ యయ్యెను
నృపతి యశోవినిమయప్రకృతి యీాకృతియున్. 165

వ. ఇది యెల్ల నిమ్మహితుని విశేషమ్ము కాదె యని యుత్తమ
ప్రభునకు నమస్కరించి యతండు మఱియు నిట్లనియె. 166

ఏయెడ నెన్నడున్ గనని యిట్టిరసోజ్జ్వలజీవసత్కళల్
పాయవు వో యుగాంతముల భారతభూమి నిసర్గసిద్ధముల్
ఛాయల సంగ్రహించికొని సర్వసమున్నతుల న్నటించువా
రై యరయంగ నేరరు యథార్థము లిట్టివి యన్యభూజనుల్.

కళ యొకజాతిగాఁగఁ బరికల్పన చేసి యఖండవర్తనన్
విలసితలీలఁ బెంచెడి వివేకగుణమ్మున భారతావనిన్
కళలు చెలంగు రక్తగత నైజగుణమ్ము చిరాన్వయమ్ముగన్
తెలియర యిట్టిధర్మము విదేశజనుల్ ఋషిదృష్టి సిద్ధముల్.

ఆరయ సర్వశక్తులకు నాస్పదమయ్యెను బ్రాణి యొక్కసం
స్కార విశేషసంగతిఁ బ్రశస్తి వహించునొకొక్కదానఁ దా
నారనిజోతియై బహుతరాన్వయ బుద్ధు లెసంగుచుండ నీ
భారతజాతివోలెఁ బెరవార లెఱుంగర యిట్టిధర్మమున్. 169

అమలమ్మైన నిజాత్మదర్శనము మాహాత్మ్యమ్మునం జేసి కృ
తిమ వైహాయస యానసిద్ధులు శదర్ధి భావ సంపన్నభా
గ్యములున్ బుద్ధిని లెక్కకుంగొనరటే యాధ్యాత్మికమ్మైన జ్ఞా
నము నైజమ్మయి విశ్వశాంతి వరదానప్రౌఢు లీ భూములన్.

అమరత్వమ్ము నిసర్గ మాలెటఁగి విద్యల్ సర్వముల్ శాంతిబో
ధములై యీశ్వరదర్శకమ్ములుగ సంస్థాపించు నీ భారతీ
యమహాజాతికి సాటి యేభువనమందైన న్గనన్రామి, యు
త్తమభూపాలుని ధర్మపాలనమునన్ దథ్యమ్ముగన్ గాంచితిన్.

ఉత్తమ మీాప్రజావళి గుణోత్తముఁ డీమహిపాలమాళి, య
త్యుత్తమము ల్గలామహిమ లొక్కెడఁ గూర్చి కృతార్థభావ సం
పత్తి ఘటించె సృష్టికిని బ్రహ్మ భవాదృశమైత్రికల్మి మీా
యుత్తమభావ మీాజనుని నందుటఁ దాను గృతార్థుఁడయ్యెడున్

వ. ఇది స్థిరమ్ముగా ననుగ్రహించెదరుగాత మనిపలికి యయ్యు
త్తమమహీపతిదంపతు లొసంగు ననర్ఘ మణిగణమ్ములతో
డం దత్తదర్హ బిరుదమ్ముల నిజనిర్మోక ధవళిమస్పర్ధి దుకూ
లనిర్ప్రవాణియుగళమ్ముల సత్కరించి స్వాయమ్ముగను

దత్తదర్హబహూకృతు లర్పించి కృతార్థమ్మన్యుఁడయ్యె. ఆ సదస్యులు నానాగేంద్రవిభుని, నిఖిలవిద్యాశ్రీమ త్తత్త్వవిత్త్వ విశేషమ్ము బహుముఖమ్ములం గొనియాడుచు నేకముఖమ్ముగా నిమ్మహీతుఁడు మనయుత్తమప్రభువుల కర్హసంబంధి కాఁదగువాఁడు కాఁడె యనితలంచిరి. అమ్మహీపతియు నెల్లర నుచితసంభాషణమ్ముల నర్చించి నాఁటి కొలువు చాలించు నెడల సుదూరదేశాగతు లగువార లప్పుడ తమతమ దేశమ్ముల కరుగ నర్హరీతుల తెలియను మతింగని చని రంతటఁ బాతాశాధిపప్రభృతులు తమతమ విడిదిపట్టులకుం జని రయ్యెడల 173

క. అంతిపురి కరిగె నరపతి
కాంతా కుంతల విభాసికైతకము, నిశా
కాంతుం డట నవమీతిథి
కాంతాలింగన విశేష కలితుం డయ్యెన్. 174

తనపతి నిర్భరమ్మగు ముదమ్మున లోన వహించు పెంపునన్
తనుగత రోమకూపములఁ దన్మహముల్ వెలివిడు వచ్చె నాఁ
గనుపడె నానిశావనిత కాయమువోని నభస్స్థలమ్మునన్
చినికిన క్రొత్తక్రొత్తచిఱుచెమ్మల నవ్వుచుఁజుక్కలయ్యెడన్.

గీ. ఆవి నిశాకాంత యాఁదల నవసుమమ్ము
లవి నభశ్శంభు శిరము శుభ్రాక్షతములు
అవి యుషఃకాల బాలసూర్యాయమాణ
విమలతేజఃకణమ్ములు వెలసె మింట. 176

క. భువనేశ్వరీ మనోహర
భువనాధీశా! సమస్త భువనాధారా
కవిజన మందారా! దా
రువన విహారైకరస! విరూపాక్ష! శివా! 177

సకలాపదపహారచణదివ్యనామా!
సుకవీంద్రమునివారసువచఃప్రసన్నా!
ప్రకటీకృత నిజాంఘ్రివరమానురాగా!
అకళంకమతిలక్ష్మ్యా! యహిరాజభూషా! 178

శ్రీవిద్యానగరీ కవీశ్వర తపస్సిద్ధీ! వచోదేవతా
వ్యావర్ధిష్ణు పయోధర త్కనకకూటాభోగమాంగళ్య! పం
పావీచీ నవకంకణాద్భృత నభస్వద్భక్షణాహార్య! మ
ద్భావాభిఖ్య గుహా విహారకుతుకోద్యన్నవ్య పంచాననా! 179

క. నిరత శివభక్త గాథా
స్మరణ శ్రీకనకరత్నమాశరభాఽరా
ధ్య రుచిరతపఃఫలప్రద
కరుణాసంతాన! భక్తకవిసంతానా! 180

క. శ్రుతనందినీచరిత్ర
శ్రుతి సహజాత ప్రకారశోభిత గుణసం
గతి యుత్తమ మనుసంభవ
చతుర్థవదనమ్ము వెలయు శంకరుని కృపన్. 181

శివమ్

శ్రీరస్తు

# ఉత్తమ మను సంభవము

## పంచమాశ్వాసము

క. శ్రీగౌతమ మౌని తపో
భాగి శ్రీసూరసుకవి భాసురకవితా
శ్రీ గౌతమీతరంగ వి
భాగాయిత తుంగభద్ర పంపారమణా. 1

వ. దేవా అవధరింపుము. 2

జయ జయ భారతీయ కులసాగరకౌస్తుభ సత్కళానిధీ
జయ బహుళామనోహార యశఃప్రతిబింబ పయఃపయోనిధీ
జయ జయ సౌరుచేయ యువిజయ్య పరాక్రమ వంశవర్ధనా
జయ జయ సత్కవీంద్రపరిషత్పరమేశ్వర యుత్తమప్రభూ. 3

జయ పాతాళతలాధినాథబహుళశస్సం స్తూయమానోదయా
జయ విప్రకృతి సుప్రసన్న సుమన స్స్వాహావధూవల్లభా
జయ ధర్మాత్మబలాక పుణ్యజనరాజస్తుత్య ధరోజ్జ్వలా
జయ ధూర్జట్యవతార కాలవిదృషిజ్ఞానాబ్ధిజైవాతృకా. 4

సీ. ప్రియభావనోన్నిద్ర విలసనపద్మినీ
హృదయప్రబోధమ్ము లెఱిఁగియెఱిఁగి

అనిమిషోత్ప్లవన సంజనిత బోధాంబుజాఽ
కర వారిఁ గదలికల్ గఱచికఱచి
కాలకంఠాకార కలకంఠ సత్కవీ
శ్వర భాషితార్థమ్ము లరసియరసి
పరమేశ్వరస్తోత్ర పఠనశబ్దబ్రహ్మ
తాత్పర్యములు మేనఁ దాల్చితాల్చి

తమదు శివరూపములు జగత్ప్రాణభావ
ములును జైతన్య మిడ లోకమునకు లోక
బంధు పురతః ప్రసార సంభ్రమిత వేత్ర
హస్తములు సాఁగె నుదయవేళానిలములు. 5

సీ. భువనేశ్వరీదేవి ముద్దారుఁ జెక్కిళ్ళఁ
బ్రతిఫలించెను విరూపాక్షశివుఁడు
పంపానదీ స్నానపారవశ్యముఁ జేసి
గీయిడె బొజ్జవినాయకుండు
కింకిణీధ్వనులతోఁ గ్రేంకారములు వెట్టెఁ
గెరలుచు కొమరు టెక్కెమ్ముగళము
శ్రీమద్విరూపాక్ష శివగృహాంతరమునఁ
బరిఢవిల్లెను వేదపాఠరవము

సరస సత్కావ్య నిర్మాణ పరవశార్ద్ర
హృదయ కవికుల మధురిమ లెఱుకపఱిచె

భావితాఽత్మాఽధి దర్శితేశ్వరములగుచు
నంచకదుపులు కమలగృహమ్ములందు. 6

గీ. అనుకరించెఁ దథావిధప్రణయ మైనఁ
బతినిఁ గలహాంతరిత కుహూపఱచు తెఱఁగు
లలరుక్రొమ్మావి చిగురులయందు నిక్క
కుహుకుహూ యంచు నెఱజాణ కోకిలమ్మ. 7

గీ. ఎఱిఁగి తనపతి ననునయపఱచు తెఱఁగొ
కెరలి పొలయుక్క లురల జంకించుపదునొ
అధిగతామోద సౌవర మధురిమమ్మొ
తఱచు విననయ్యెఁ బారావతముల యెలుఁగు. 8

బహుళామోద పరంపరా మిళితమై ప్రాచీప్రబోధోదిత
స్పృహణీయామల జృంభణానుగతమై ప్రేమాంకురచ్ఛాయమై
అహారారంభ మొనర్చె నీదు దరహాసారూఢరాగాంకురాఽ
న్వహాసఖ్యమ్ము ప్రభాతవాయువిదె రేఖాఽతామ్రధావళ్యమై.

కుతుకంబార నభోవిభుండు తమ వీడ్కోలిచ్చి పంపించుచోఁ
ప్రతిరాత్రమ్ము తదంతరాంతర విహార స్నిగ్ధముల్ శుద్ధముల్
కృతసఖ్యమ్ములు తారకల్ తదముల ప్రేమార్ద్రవీధీతిరో [తగఁ
హితభావమ్ములు దాల్చెనవ్విభుమనమ్మేకాశ్రయమ్మై

అవె కృష్ణాతటినీ వగాహకృత శుద్ధాకారముల్ పుణ్యవీ
చి విభాసుందర యానధీరములునై శ్రీదక్షవాటీపురో

పవనోద్ధూత పరాగ సత్పరిమళ వ్యాప్తాంగముల్ లోకబాం
ధవు పేరోలగమందు వేళలను విజ్ఞాపించె నీ తెమ్మెరల్. 11

సేవార్థాధులు వందిమాగధ కవి శ్రేష్ఠుల్ యథాచార మిూ
కై వారమ్ములు రాజలాంఛనములై కావ్యార్థ సంసూచులై
భావస్నిగ్ధములై ఫలప్రదములై వర్ధిల్లఁ గావించుచోఁ
దావత్కాల కృతాహరాచరణుఁడై ధాత్రీవిభుం డున్నెడన్.

అహరారంభ సమర్చితేశ్వర కృపార్ద్రాకారిత శ్రీదళ
స్పృహణీయ శ్రవణావతంసు నృపతిన్ సేవింప విచ్చేసి ర
య్యహిరాజోత్తముఁడున్ బలాఢ్యుఁడు స్వదేశాలోకన ప్రస్థితి
స్పృహచిత్తమ్ములు రాజదర్శన రసశ్రీ ముగ్ధముగ్ధమ్ములై. 13

ఆదరణమ్ము పేర్మి నృపుఁ డల్లన లేచి కవుంగిలించి యా
సోదరులన్ సమిూపగ నిజోచితపీఠి వసింపఁజేయ, వా
రాదట సౌఖ్యశాయనికు లైరి పరస్పర మొక్కటొన్ని, స్నే
హోదర సంభృత ప్రణయు లైన ప్రసంగము లయ్యె నయ్యెడన్

నందయు నామె తల్లియు మనఃప్రియ రాణిని గూడి వచ్చిర
య్యైందవ సౌధమందుఁ గొలువై న మహీపతిఁ గొల్వ నప్డు దా
రందఱు నిష్టగోష్ఠి సుఖులైన పదంపడి తల్లి యానతిన్
నంద వచించెఁ బేర్మి జననాథుని వారిమనోగతమ్ములన్. 15

నిత్యవసంతమై యలరు నీభవనమ్మున నిల్చియుండి నీ
నిత్య వినూతన ప్రణయనిర్భరమైన మహోదరమ్మునన్

వ్యత్యయ మీవసంతమును వచ్చినయీనులివెచ్చవేసఁగిన్
సత్యముగా నెఱుంగుటకుఁ జాలము నేఁటికి నుత్తమప్రభూ. 16

ప్రత్యహ నూత్ననూత్నవిభవమ్ములువిందులును వ్వినోదముల్
నిత్య సరస్వతీ విమల నృత్య తరంగిత రంగవేదికల్
శ్రుత్యుపబృంహితమ్ములగుసూనృతగోష్ఠులుచొక్కి చొక్కి యీ
వ్యత్యయమైన కాలము నహర్నిశభేద మెఱుంగ మింతకున్.

మా మా దేశములన్ సుఖస్థితుల సంవాసించి నట్లయ్యె నో
స్వామీ! చిత్తము లంతనంత జెమరింపన్ సాఁగె లోలోపలన్
మా మా దేశములన్ బ్రజానికర మస్మత్ప్రేక్షణోద్విగ్నమున్
దామై చూడఁగ మిమ్ము వీడుటకు నంతస్తాపముల్ ముట్టగన్.

వ. అని పలికి యా సందాకుమారి సాభిప్రాయమ్ముగా మహా
రాజ్ఞి నుపలక్షించి పెదవులయందు నగవుతొలఁకాడఁ దన
తల్లిదండ్రుల నాబలాకు నిర్దేశించుచు నా ప్రజాపతి
కిట్లనియె, 19

అల్లుఁడు పుట్టువేళఁ దమయంతన రాఁగలవార మందు రీ
తల్లియుఁ దండ్రియు న్మఱియుదాత్తచరిత్రుఁడు నీపితృవ్యుఁడున్
పిల్లను జేసి నన్ను ననిపించిరి వీ రొకపెద్దవారలై
తెల్లముగాఁగ నేఁ బలికితిం దమసన్నిధి వీరిచిత్తముల్. 20

అన విని నవ్వి యాబహుళ యారకుమారిక యెన్నినేర్చితే
జననినిమించి యీగడుసుచందములాడఁగ నీమెనోట నే

వినినది లేదుగాక తమవీటికిఁ బోయెడువార్త నీవుగాఁ
బెనుచుచుఁ బెద్దచేసి మతిపెంపు వెలార్చితి విన్నిభంగులన్. 21

వ. అనుటయు నంతస్మిత కపోలయగు నందాజనని. 22

అమ్మరొ తండ్రిపోల్కి నుదయమ్మయి పొల్చితి వంతెగాక యీ
యమ్మకు మేనఁగోడలయి యాడినమాటలు చెల్లుబాటుగా
నమ్మఁగఁ బల్కెదే యనుదినమ్మును బోయెదఁ బోదు నన్నుచి
త్తమ్మును దాచిపెట్టికొని తల్లిగ దే యిదిచెప్ప వింతకున్. 23

అని విని నవ్వి నాచనుటకైనను వచ్చుటకైన మామగా
రనుమతి మున్నయిచ్చిరదియాడఁగ నేఁటికి నేఁడు క్రొత్తగా
దినదిన మేగుదెంచి నృపతిన్ గని యంతఁ బ్రియాణవార్తలన్
వినుపఁగ లేని మీామతుల విప్పివచించుట తప్పు నయ్యెనే. 24

క. అని పలికి యాకుమారిక
జననాథునిఁ జూచి వీరె సంబంధులు మీా
మనసునకు వచ్చినన్నియు
దినములు వసియింత్రుగాతఁ దృప్తు లెసంగన్. 25

వ. అనుల్లంఘనీయమ్ము నవశ్యానుష్ఠేయమ్ము నగు నొక దేవ కార్యమ్ముకలిమి నాపయనమ్మెట్లును సిద్ధంబ. అది దేవరచే ననుమతం బయ్యెనేని శీఘ్రఫలదాయి కాఁగలదు. ఇదియ నాహృదయగతంబగు సంప్రార్థనం బని విన్నవించిన నా ప్రజావిభుండు, వారిహృదయమ్ములు గాఢమ్ముగా స్వదేశ

ప్రయాణోన్ముఖమ్ము లగుట యెఱింగి జనపతులకుం బర
దేశ చిరనివాసమ్ములు సముచితమ్ములు కాకుంటయుం
దలంచి యా నంద పలుకులు సంభావించి యామెం గని 26

పిల్లవె నీవు నీగుణము పెంపున మా కిట నెల్ల వారికిన్
దల్లివిగాక వజ్రసిశితమ్ములు నీవ్రతసంవిధానముల్
తొల్లియు వింటి నీమనసులోన జనించిన కోర్కె యెల్ల నీ
యెల్లరకుం బ్రజాళికి సమీహిత సిద్ధి యటం చెఱుంగుదున్ 27

తల్లియు నీదునత్తయు ముదమ్మున నాడిన మేలమాటలున్
జెల్లునుగాక నీమనసుసిద్ధి ఘటిల్లఁగఁ బోయిరమ్మ యా
యెల్లరగూడి మీపయన మేను దలంచితి నేఁటిమాప యం
చుల్లములోఁ దదీయవిరహోదయ మశ్రుల నావరించినన్. 28

పోడ మెడు నశ్రుపూరములఁ బుట్టినచోన యడంచి వైచి శు
ష్కడమగు దృష్టి గద్గదిక కాపురమైన గళమ్ముతోడ నా
పుడమివిభుండు బాంధవుల మోములు చూచి తలంచిపల్కె మీ
యెడఁదలు నొక్క మర్త్యపయి నింత దయారసశీతలమ్ములే. 29

వ. అని పలికి ముహూర్తమాత్రమ్ము నిరుద్ధకంఠుండయ్యు సహజ
ధీరుండగు నవ్విభుండు నంద తన్నాడిన వావిం దలంచి
కొనుచు ననుపమసత్యవ్రతశీలస్వరూప యగు నక్కుమారి
పలుకు లమోఘమ్ములుగా భావించె. అట్టియెడ నందటి
హృదయమ్ముల నట్టితలంపు పొడమటయు వార లొం

డారుల ముఖభావమ్ములు లక్షించి భావి విధిసంవిధాన మ్మిట్లగుటకన్న నభీష్టమ్ము గలదే యని తలంచిరి. అమ్మ హీశ్వరుండును దద్భావభావనామధురమ్ము లగు నాకృతుల వారినారసి నందాకుమారిం గని. 30

క. వీరెల్లరు సంబంధులు
మీరో మఱికారు నేను మీ మామనతే
ఈరీతులు ధ్రువపఱిచెడు
భారము నీతలనె గలదు పాలితవచనా. 31

వ. ఈఘటిల్లిన శోభన సంవిధానమ్ములకన్ మూలంబ వీవె కాదె. 32

క. అని నవ్వుచుఁ దనుఁ బల్కిన
విని నంద వచించె భావి విధినిర్ణయమే
ననువుపడఁ జేయనేర్తునె
అనఘా మీనుడికి నన్యథాకృతి గలదే. 33

వ. ఏవంవిధ నిఖిలసంవిధాన శుభఫలప్రదమ్మగు విరూపాక్షు దైవంబు సుప్రసన్నంబయిన నెట్టివారి కెట్టికృతియు నసాధ్య మ్మగునే. అది యిప్పుడాడనేల అనునవసరమ్మున సంగవ కాల శంకరార్చన ప్రారంభ నినాదమ్ములు శ్రవణసుఖ మ్ములు హృదయప్రమోదమ్ములునై వీతెంచిన నమ్మధుర ధ్వనిపరంపరానుసంధానసిదానమ్ములగు మృదుల కంకణ

నిస్స్వనమ్ములయు, శింజానమణికింకిణీ శింజినీ నిక్వా ణమ్ములయు దోఁపఁ గొంద అంగన లేతెంచి కలమధుర స్వనమ్మున నన్నరపతి కయ్యవసరవిశేషము విన్నవించిన నవ్విభుండును దదుచితమ్ముగా నప్పటికొలువు సాలించి. 34

పూజామందిరమంతఁ జొచ్చి శివుఁన్ బూజించె నాఁడు వి భ్రాజద్భక్తివిశేషభావములు తోపన్ రుద్రసూక్తమ్ములన్ రాజుం గన్న యహీంద్రుకంట, సుతదానప్రార్థనన్ భూపతి వ్యాజాకారము గన్న శ్రీవిభుఁడుగన్పట్టెన్ ద్రిధామూర్తులన్

క. ఇమ్మెయి శివపూజావిధి
సమ్మదమునఁ జలిపి తత్ప్రసాదము గొని వా
రమ్మాపటివేళఁ బ్రియా
ణమ్మున కగువిధులు దమమనమ్ముల నొలయన్ 36

వ. సముత్కంఠమాన మానసులయి యవియెల్ల ననువుపఱచు కొనుచుం దత్కాల్యకరణీయమ్ములం దీర్చుకొనుచుఁ గొంత కొంత. 37

ఆ. వె. విశ్రమించునంత విభుని యానతికల్మి
వారి పీడుకొనెడిగారవమున
కర్హమైన రీతి నట నొక్కకొలువయ్యె
నర్హపౌరవృద్ధు లరుగు దేర. 38

ఆరాజు హృదయమ్మె యగు బహుమతుల
వారలకు నిడియె నవ్వారికొల్పఁగను
పౌరు లాభావమ్ము పసిపట్టికనుచు
మారాజువియ్యమై మదుల మన్మవిరి. 39

అంతట వారి నానృపతి యచ్చపుఁ బేర్మిని గౌఁగిలించి మీ
యంతటివారిరాకడఁ గృతార్థము మాపుర మయ్యె నేఁడు మీ
రెంతట మీగృహమ్ములకు నేగెదువారొ సుఖప్రయాణులై
యంతట వార్తపుత్తురుగదయ్య మనమ్ములు మాఁకు దృప్తిగన్.

క. చిరవిరహక్లిన్నము మీ
పురజనమును దృప్తి పడఁగఁ బోయి సుఖమునన్
మఱల నిటవచ్చువార్తలు
మఱువరుగాదయ్య మీరు మాపయిఁ బ్రేమన్. 41

అని పతి యెట్టకేలకుఁ బ్రయాణముసేయఁగ వారు నర్మిలిన్
జనవర యిట్టియాదరణసంగతు లెందు నెఱుంగమేము నీ
మనము సదాప్రసన్నమయి మమ్మిటులేలఁ గొఱంతయున్నదే
అనిశము నీదుసన్నిహితమైన జనమ్ముల భాగ్యమెట్టిదో. 42

అటు లననేల దూరమునయందు వసించుటఁ జేసి చిత్తమె
ప్పటికపుడే నిజప్రణయబంధుజనమ్ముఁ దలంచుచుండుటల్
స్ఫుటములు గావె దేశభిదఁ బుట్టిన దూరము దాపు గాక య
చ్చటయున నిచ్చటన్న సదృశమ్ములు గావె విశాలదృష్టికిన్.

కావున రెండు నున్నఁ దయకారుణికత్వ మహత్త్వసంపదన్
దేవరభృత్యకోటులకు నిత్యము తావక సన్నిధాన సం
భావన సిద్ధమట్లయిన, మామదు లూఁఅడి యుండ నేర్చునే
భావితబంధుభావపరిపాలిత భృత్యుల మిమ్ముఁ జూడమిన్.

క. అని పలికి దేవిఁ దలఁచుచు
ననఘా మాతల్లి తనదుసంకమ్మున, భా
నునిదాల్చి యెసఁగు ప్రాచీ
వనితను దలఁపించునాఁడు వచ్చెద మెటులున్. 45

వ. అనునెడల 46

క. ఆరాజువ్యాదయు మగునా
పౌరశ్రేష్ఠులు తథాస్తు వాక్యము పలుకన్
వారి మనోరథరథ్యము
లై రహి హేషించె నుత్తమాశ్వశ్రేణుల్ 47

ఆ హేషలాత్మప్రయాణమ్ము దెలుప
సాహో నినాదమ్ము చద లంటిసాఁగ
రాహుత్తు లంత బరాబరిఁ గొలువ
స్నేహమ్ము భక్తియుఁ జిగురు వెట్టంగ. 48

పరివరిఁ జూచి యందఱకుఁ బ్రార్థన సేయుచు వారు పంపఁగా
నరదము లెక్కి సాఁగిరి ప్రియమ్మున రాజును గూడి రాఁగ న

ప్పురజలధిన్ గ్రమించు నెడఁ బోయినబాటలు పోవుబాటలున్
గర మొకరీతినై వెలఁగు కౌతుకముం జనియింపఁ జేయుఁగన్

ఇన్నిదినమ్ము లుండి యెపుడేనియు జూడనియట్టు లయ్యె, నీ
యున్నతసౌధవీధులు మహోజ్జ్వలరూప జనప్రకీర్ణముల్
క్రొన్ననపూలతోటలును గోపుర సుందరచిత్రశిల్పముల్
గన్నవె? విన్నవే? యుగయుగమ్ముల నిట్టివి యెట్టిభూములన్.

ప్రతిగృహమున్ సమృద్ధజనవాసవిభాసి సుమేరుశృంగమై
ప్రతివనముం విశిష్టఫలరాజి మహీరుహ నందనమ్మునై
ప్రతిగుడియుం గలార్థిజనవాంఛిత విశ్వకలాధివాసమై
ప్రతిపథ మాపణప్రచిత వస్తువిభావిత భాగ్యభోగ్యమై. 51

గీ. తరఁగతరఁగల మధ్య రత్నాకరుండు
తనదు గర్భస్థ వస్తురత్నముల నెల్లఁ
దీర్చి దిద్దుచుఁ బురమయి పేర్చెనొక్కొ
కాక యిమ్మెయి నగరమ్ము కలదె యనఁగ. 52

ప్రతిపద మద్భుతప్రదము పత్తనసర్వసమృద్ధిఁ గాంచి, వా
రతిచకితుల్ పురాక్రమితమైనవి కోట లెఱుంగరైరి, సం
తత రథఘోషబంధుజనదర్శన హర్ష నదత్తరంగ జృం
భితగతి నడ్డమౌ పరిఖ పేరిటి యేఁటిని గాంచునంతకున్. 53

క. అరదము లించుక యాగిన
నరవరుఁ బొడఁగాంచి గ్రక్కున సేతు వటన్

వెరవునఁ గూర్చిరి యటఁ గల
దొర లతిసాహసులు భిదురదుర్జయబాహుల్. 54

వ. అట్లు సంఘటించి యచటినియోగులు సవినయమ్ముగా నా రాజపురందరు సందర్శించి విన్నవించుటయు నతండును వారి నుపలాలితులం జేయు సల్లాపనంబుల నగదంబు డిగి యాత్మబాంధవు లగు నమ్మితుల యథోచిత సంభాషణమ్ములం దనిపి పురస్సామంత్రితులం గావించి యటకడపి నిలిచె. అప్పటికిఁ దుంగభద్రాకారమ్ము లగుశీతలమధుర వాయుతరంగమ్ము లల్లనల్లన వీచుటయుఁ బడుమటిగాలుల వేడిమి యడంగె, భగవంతుం డగు నభస్వంతుండు. ప్రాచ్య దేశ విశేషములు పశ్చిమదేశవాసుల కెఱుకపఱుపనో యన నపరగిరిశిఖరి నలంకరించె. ఆ సాలపోతకప్రభృతులు నరదమ్ము లధిరోహించి యుత్తమరాజన్య కథావిశేషమ్ములు దలంచుకొనుచు వెనుదిరిగి చూచుచు నెట్టకేనిఁ దమదృష్టులు మరల్చి యటకడచి చనిరి. అంత 55

## ఉత్తమ సమాలోచనము

తిరుగునో యీగ్రహావళిని ద్రిప్పునొగా కవి చుట్టియాడఁగన్
తిరుగఁడో తాను నీ సకలదేశ సుఖస్థితి కర్మసాక్షియై
అరుణుఁడుదాల్చి బాల్యమును యౌవనశీలము వృద్ధభావమున్
పరిపరి దేశదేశములవారలు తన్ను భజింప నర్మిలిన్. 56

ఆఱు విధమ్ములై ఋతువు లాత్మజనింపఁగ నేకరూపుఁడై
ఈ రవియెల్లలోకముల నేలుచు సంతతమున్నవాఁడు, రా
కారజనీశ్వరుండు తన కాంతిబలమ్మున హానివృద్ధులై
పేరున రాజునై తనదుబింబమునై తనియింపలోకముల్. 57

ఆరయ సర్వమూలమగు నర్కునియందుఁ ద్రిమూర్తిభావముల్
కారణమై గుణత్రయము కల్గెనొకో వ్యవహారసిద్ధికిన్
సూరుని వీని బ్రహ్మవలచూపని యాడుదు రాగమార్థవి
ద్యారససిద్ధులౌ సుకవు లాద్యమహాఃపరిశుద్ధ దర్శనుల్. 58

ఎల్లెడ నేకరూపుఁడగు నిమ్మహితాత్ము భజించువేళ సం
ధిల్లిన తారతమ్యములు దేశములన్ స్వకృతిప్రమాణముల్
చెల్లె శుభాశుభమ్ములయి చెందఁగఁ జేయు, నిమిత్తమాత్రమీ
యెల్లగ్రహమ్ములై పరమసృష్టి రహస్య నిబోధకమ్ములై 59

ఎవ రెది యెంతసేయ ఫలియించున దంతియకాక లోకబాం
ధవునకుఁ దారతమ్యము లనందగునెట్లు నిజాశ్రితాళిపై
అవుర సతమ్ము నిమ్మహితునాశ్రితమై వనవాస తృప్తమ
య్యు విరహామందఁ దప్పదటె యుత్పలసన్నిధిఁ బంకజాళికిన్ 60

ఎక్కడికక్కడే మనసు నించుకయాపి సమన్వయించుకోఁ
దక్కినగాక యీబహువిధమ్ములు జీవితయాత్రఘట్టముల్
చిక్కులుపెట్ట వాని నఱసేసి స్వధర్మము నిర్వహింపఁగాఁ
దక్కునె యేరికే, నిదియుదక్కమిఁ గాదె ముధాసమస్తమున్.

క. అని తలపోయుచు జనపతి
చనియె నివాసమ్ము నానిశాయామమ్ముల్
కనుపడె పొడవై బాంధవ
జనవిరహాకథా ప్రసంగసంతప్తములై. 62

సీ. ఇందిందిరమ్ములై యిందీవరమ్ములై
వర్షావిజృంభి శాద్వలములగుచు
ఖంజరీటమ్ములై యంజనాచలములై
కమఠేంద్ర పృష్ఠభాగమ్ములగుచు
బర్హిబర్హమ్ములై వనవరాహమ్ములై
పంకనిర్యత్సైరిభమ్ములగుచు
ఇంద్రనీలమ్ములై యినతనూజమ్ములై
కాలాహిదీర్ఘ రేఖమ్ములగుచు,

కృష్ణవేణీ తరంగరోచిష్ణు జలధి
తుంగభంగమ్ము లంబికాపాంగరుచులు
కాలకంఠ గళస్ఫుట నీలిమములు
నిండెఁ బొగలయి యిరులు బ్రహ్మాండమెల్ల. 63

గీ. అంధ్రరాజన్య కీర్తిదేహాంతరమ్ము
లనిమిషేశ్వరు దివ్యదేహమునఁగనులు
కృష్ణవేణీ ప్రవాహచరిష్ణు ఝషము
లలరెఁ దారలు గగనసౌధాగ్రఘృణులు, 64

క్రమమున నర్ధచంద్ర మధురప్రియమూర్తి యొసంగెఁ బ్రాచ్యది
గ్రిమణి లలాటరీతి, భ్రమరాంబిక మోమునఁ గుంకుమాంకమై
విమల మహేశరాగరస విస్ఫుర దర్ధనిమీలితాక్షమై
సముదయదుత్పలప్రకర సంచిత పుణ్యమనోరథాకృతిన్. 65

కలువలు తారకల్ యుగయుగమ్ములనాఁటి నిజానుబంధముల్
వలవలఁగ్రక్కెనో యనఁగ భాసిలె వెన్నెల తన్మిథఃప్రసం
గలలితభావ లూఁకొమచుఁ గల్గు నొకానొక చిత్తవిస్మృతిన్
కలరవముల్ బయల్పఱిచెఁ గౌతుక కారి రహఃకథాకృతుల్. 66

నిలుపునఁగన్నులై ప్రకృతి నింగి కనుంగొని హాసచంద్రమై
నిలుపునఁగన్నులై ప్రకృతి నింగిఁగనుంగొని చంద్రహాసమై
తలపుల కందియందని విధమ్ముఁ బుట్టి సుదూరవాసవి
హ్వాలితములై క్షణమ్మున మహాముద మందె విభుత్వసంపదన్.

నీవు నాలోనుంటి నిజముత్పలాక్షి
నీవు నాలోనుంటివి నిజము నారాజ
ఏవంవిధములైన యీ భాగ్యములకు
భావి భూత విభేదభావమ్ము గలదె. 68

అనుచు న్వారలచిత్తము ల్పలికెనో యన్నట్లు క్రొమ్మావిపైఁ
దనపుణ్యాంగనఁగూడి కోకిల కుహూధ్వానమ్ముఁ గావించె నా
ధ్వనుల న్నిత్యసమాగమ ప్రియములున్ దన్మాధవాదేశరూ
పనిదాఘమ్మును భావిసూర్యజనన ప్రారంభముల్ దోఁపఁగన్,

ప్రతిగేహమ్మున శంకరస్తుతిపర ప్రౌఢాంగనాగానభా
వితకంఠమ్ములఁ గోయిలల్ మొయిసెఁ దన్వీతామ్రబింబాధర
ప్రతిమాన మ్మదయార్కబింబము ప్రభాపర్యాప్తనేత్రాబ్జమం
చితచైతన్య మొసంగి పేర్మి నలరించెన్ జీవలోకమ్ములన్. 70

# గ్రీష్మము

పళపళవచ్చుగ్రీష్మముసఁ బ్రావడియె న్మధుపానగోష్ఠి కో
యిలల స్వరమ్ము తగ్గెఁ, జలియించె నళుల్, సుమడోలఖేలన
మ్మలరులగోయుట ల్గొఱఁతలయ్యెను, సద్దుమణంగెఁ దెమ్మెరల్
చిలుకలు గోరువంకలును సిగ్గులు చెందె నవోఢపోలికన్. 71

సీ. ప్రాచ్యాదిదిగ్దేశ నృపసార్వభౌముఁ డగుచు
నుత్తరాషాఢ జైత్రయాత్రోత్సవమున
నంధ్రరాజన్య చటులశౌర్యాగ్నిఁ బోలి
గ్రీష్మభానుండు దిక్కులఁ గెరలివెలిఁగె. 72

ఎసఁగె నవమాలికలు పోసఁగెను శిరీషములు
నసిచెడియెఁ గేదఁగులు ముసురుకొనె మల్లెల్
మిసిమిపడె సంపెఁగలు మిసమిసమనెం బనస
లుసికొనయె జంబువులు కొసరుకొనె మావుల్
దెసలదిమె ఖర్జువులు గసి మసఁగెఁ బూగములు
నసిచెడియె సస్యములు ఖుసికొనియెఁ గాడ్పుల్

మసలె మృగతృష్ణికలు బుసబుసలపాము లయి
దెసదెసల నొత్తికొని మసక లసియాడెన్. 73

నరహరిభయదము లగుచున్
శరభమ్ములు పెరిగె నుష్ట్రచయములు క్రొవ్వెన్
ఖరతురగోద్భవములు కం
చరగాడిద లోండ్రవెట్టె సంరంభమునన్. 74

సీ. పరదేశరుచులకు బ్రమసి పర్విడునట్లు
మృగతృష్ణలకుఁ బాఱె మృగకులమ్ము
మాసిపోయినజాతి వాసనల్ చవిచూపె
వేఁబోక వెడలిన పిల్లగాలి
ముంగిళ్ల విడిశయ్యఁ దొంగున్నజవరాండ్రు
మగలఁ బయ్యెదలలో మాటుకొనిరి
ప్రొద్దువేడికి జంకి చద్దిమూటలుగట్టి
పొలముపోయిరి కృషీవలులు వేఁగ

చెట్టునీడల నిదురఁగొన్నట్టి బాట
సారు లంతంతఁ బొదలి రాచాయలందు
నీరుపోఁతల వెడవింటినారిమ్రోఁత
నిండె సందడి చలువపందిళ్లయందు. 75

సీ. దంభకేసరి ముహుర్జృంభితాస్యస్ఫురత్
దంష్ట్రికాధార కాధారధార

క్రూరతక్షకతీక్ష్ణ ఘోరదంష్ట్రాంకుర
చ్ఛాయాళిసబ్రహ్మచారిపాళి
సైరిభాసురశిర స్సైస్వైరభిద్వ్యక్ష
నఖరధారా మిథస్సఖగుణమ్ము
భార్గవస్వధితి దీప్రప్రభాస్పర్ధాళు
ఖద్యోత రోమరింఖణగణమ్ము
దళితపరిపంథిగజగళదభ్రక్తఝరము
బ్రిధ్నసిర్గ్నజ్వభ స్త్రి యభద్విపేంద్ర
కుంభ కాశ్మీరపంకార్ద్రకుంభనమ్ము
గ్రీష్మభీష్మప్రతాపమ్ము కెరలె నింట. 76

గీ. మండు నిప్పులఁ జెఱఁగు కాటెండ నుండి
దండిపను లెన్నొతీర్చు నుద్దండపిడుగు
వేఁగుజామునఁ బ్రియురాలి వెడఁదకంటి
చుఱుకుఁ జూపులతఱపుల వెఱపుగుడిచె. 77

భీష్మగ్రీష్మమహోవిస్ఫృత్వరతురాభీలమ్ము శుంభద్బలా
ర్చిష్మ త్తర్జిత ధూర్జటి స్ఫుటితతార్తీయాక నేత్రమ్ము, ను
గ్రోష్మప్రముత్ర బాడబజ్వలన జాలోద్గారధీరమ్ముగా
నుష్మప్రక్రియ మేఁ చెఁ బ్రత్యణువునం దుష్ణాంశుసాక్షాత్కృతిన్

సుడిగాలుల్ మినుఁదాఁకునూతులగుచున్ సూచించివక్షాస్ఫురత్
ఝడితిస్వైరనదీవివర్తగతులన్, చారిత్రశుద్ధిచ్యుతిన్

కడుఁ దొట్రిల్లెడుసన్మనోనుకృతులై గన్పించి బల్ తేజశ్రా
న్నడకల్ దిద్దిన చక్రచంక్రమణవిజ్ఞానమ్ము రూపించెడిన్. 79

సీ. సెలయేళ్లు చిట్టేళ్లు చెఱువులు సరసులు
బావులు నూతులు వట్టిపోయె
చలిపందిరుల మూఁగసాఁగిరి పాంథులు
చల్లనీళ్ళనుబోయు పిల్లఁజూచి
మిట్టమధ్యాహ్నమ్ము వెట్టలకును జంకి
నిద్రించె జనము పందిళ్ళనీడ
సాయంతనస్నాన సౌఖ్యమ్ము లెఱుకయ్యెఁ
బనిపాటు లెఱుఁగని జనములకును

చల్లచల్లని వస్తువులెల్లఁగొనుచు
పండువెన్నెల సేవించుపదును లెఱిఁగి
వేగుఁజాముల మనసులు వేఁగిరింపఁ
బడుచుకూటములకు నాసపడిరి జనులు. 80

క. జలముల సెగ లెగయుటలై
సలసల భూతమ్ము లుడుకుచందములై దు
మ్ములు రాలుటలై పర్వత
ములు మండుటలైన వింతపోలుపులు పుట్టెన్. 81

ఊహకు నందరాని దిది యుగ్రకరుం డగులోకబంధుఁడీ
సాహసమెట్లు? పూర్ణశశి సాఁకినవాఁడయి వానిపత్ని యా

రోహిణీ రూపకత్తెయని రోయక తా నటు చేరినన్ జగ
ద్దాహముగా దె కాలగతి తప్పని దేని సహింతు రేసతుల్. 82

క. చలినీరు పడని జనములు
చలినీళుల మఱఁగె మృదులశయ్యల నిద్రల్
తలకొనని భోగు లెఱిఁగిరి
సులభములౌ నీడలన్ సుషుప్తిసుఖమ్ముల్. 83

గీ. అడరి వడకించి శిశిరమ్ము వెడలునంత
మాధవస్వామి యేతెంచి మనిచెఁగాక
భీష్మభీష్మపరిచార మీ గ్రీష్మమందు
బ్రతుకులే యనికూసెను బక్షికులము. 84

సమ శీతోష్ణ సుఖప్రదాన సుఖుఁడై సర్వాత్మ సౌహార్ద సౌ
ఖ్యముపాటించు వసంతమూర్తి విరహ మ్మాపంగ రానట్టి దై
క్షమ యెల్లం దనలోని వేడుముల నుద్గారించెనో నా గుముల్
గుములై ధూమము లెల్లెడంగవిసెఁ జక్షుల్ చిమ్మచీకట్లుగన్.

వ. మఱియుం బ్రచండమార్తాండమ్మును స్పృహణీయచంద్రమసమ్మును దినాంతరమ్యమ్మును పాటలసంసర్గసురభివనవాతమ్ము నగు నన్నిదాఘమ్మున నుగ్రగభస్తితైక్ష్ణ్యనిర్భర్త్సనమ్ము దుర్భరమ్మగుటయు. 86

సీ. ఉడుకాఱుబురదలో నుండ నేరక కప్ప
లొడలు మెత్తని పాఁపయొడలు దూఱె

కలుగులవెట్టకుఁ గాక నాగులు డప్పిఁ
గలఁగుచు నెవిఁ లీనీడలకుఁ దాఁకె
దరినున్న సింగమ్ము నరసియు వెఱక యే
న్గులు డప్పి కొండవాగులకుఁ జేరె
నీళులో మినుబాము నీడలో లేడులు
తెలియక మృగతృష్ణికలకుఁ బాఁకె

కొండగుహ వచ్చు వెచ్చనికలుషజలము
లరసి మోరల నెత్తుచు నురగగ్రక్క
చరుణదీర్ఘమ్ము లగునాల్క లుఱకచాచి
యుఱచి పఱచెను వనలులాయముల గములు. 87

సీ. పడగవిప్పుచు నాల్కతడి గాలిగొనుటెకా
కొడిఁగవ్వలకు నాసపడదు పాము
విప్పినపింఛమై వ్రేటార్చుకొనుటెగా
కహికులమ్మును ముట్ట దయ్యె నెమలి
బురదగుంటల ముట్టె పొరిపొరి గ్రుచ్చియు
నెంగిలింపదు కిరి తుంగము స్త
గుహాముందు నోర్విప్పి కూర్చున్న సింగమ్ము
వాసనచూడదు వనగజాళి

పాముపిసముల వేడిమి భద్రకరుల
బలము మృగరాజుకోరలవాఁడిమియును

మహిష భల్లూక కిరియూధ మౌర్ఖ్యగుణము
మించి విహరించె వేసఁగి మున్నుముట్టి. 88

అనిలుం డన్న యథార్థనామము జగత్ప్రాణాఖ్యయుం గల్గి య
య్యనలున్ దేవముఖున్ నిజప్రియుని సఖ్యమ్ము ప్రతర్క్యమ్ముగాఁ
గని యాయిర్వురు విశ్వవిశ్వమును సౌఖ్యమ్మారఁ బాలించుటల్
కనమో కాలము కర్మముం గలసి యుగ్రంపశ్యులై రొక్కటన్.

కొమ్మలు కొమ్మ లంటికొని కోయనియార్చి విశీర్ణ పత్రముల్
చిమ్మె మహాబలుం డతని చెన్నఁటిమిత్రుఁడు వీతిహోత్రుఁడున్
కొమ్మలు కొమ్మలంటి దరికొన్న క్షుధాగ్ని నిజాశ్రయాశతల్
చిమ్మె విధూతపత్రములఁ జెంది నగాంతరభుక్తిలుబ్ధుఁడై. 90

ఇమ్మెయి నిర్దయమ్ముగ మహిం జిరమిత్రులు తండ్రిబిడ్డయున్
క్రమ్మిన లోకబాంధవు ఖరప్రకరమ్ములతోడు నచ్చి, చి
త్తమ్మది గాసివెట్టుటయుఁ దల్లియువోని నిశావధూటి స
ర్వమ్ముఁ బరిష్కరించెఁ దనరాజరుదేర జగమ్ము చల్లగన్. 91

సీ. బహుళానురాగ సంభరితమోదమ్ములై
యుత్తమప్రకృతులై యొప్పె నిశలు
పాముకూసమువోని పైఁటల నలవోక
సవరించె నురముల నువిదపిండు
బొండుమల్లెలదండ లొండొండఁ జెరివిరి
స్నానకషాయ కేశములఁ జెలులు

అగురుచందనచర్చ లందందచేసిరి
తరుణియు లురుపయోధరములందు
భావి వర్షాగమప్రీతి, వర్తమాన
కటు నిదాఘ నిరాదృతి, కంటికొనల
వెడల నర్ధినులయ్యును బ్రియులయెడల
నలరి రర్ధిత లటు తార లగుచు సతులు. 92

ఆనందాకృతి సంజ లాతపము లత్యంతమ్ము పండింపఁగా
నానాప్రాణి మనః ప్రమోదన నిశానాథాఖ్య తేజ మ్మటన్
రానై యుండుట శాంత తీక్ష్ణ కిరణప్రద్యోతనస్ఫూర్తి వ్యా
ఖ్యానించెక్ బరితప్తచిత్తముల నిత్యామోదముల్ నిండఁగన్.

గీ. వేఁకువలయందుఁ బ్రియభోగ విలసనముల
నలసి మేడలపయి నిద్ర నందియున్న
చెలులమోములు గని సిగ్గుచెందినటులఁ
బశ్చిమాశావధూటి విభ్రమముచెందె. 94

# వర్షాగమము

ఘోషలువెట్టు జంతువుల కుందువెలార్పఁగఁ దోఁచినట్టులై
హేషలువెట్టినయ్యెడ మహేంద్రునియశ్వములైన మేఘముల్
పోషిత సత్కదంబములు లోలసుకేసర వైద్యుతప్రభల్
ఘోషిత భేకకంఠ పరిఘూర్ణిత నైజఖుర ప్రతిధ్వనుల్. 95

జలధరసమూహములు తులితహరిదేహములు
దళితదవదాహములు పొలసె దెసలెల్లన్
చలితమతిపాంథములు జ్వలితగతిసింధువులు
తళతళదబంధనము లలముకొనె సింగిన్
లలితశిఖినృత్యములు మిళితఘనవాత్యములు
కలితనవశైత్యములు పొలముకొనె మింటన్
పులకితకదంబములుఁగిళితరవిబింబములు
కలుషితసరోంబుభము లుఁకడలుకొనె వింటన్. 96

సీ. నవగర్భిణీ స్తనాగ్ర వినీలములు కొన్ని
నవవధూ కేశసచ్ఛవులు కొన్ని
బాలాకటాక్ష విభ్రమధురమ్ములు కొన్ని
శ్యామ రోమావళీసఖులు కొన్ని
శ్యామలకోమలశాద్వలమ్ములు కొన్ని
శకలితేంద్రోపలచ్ఛటలు కొన్ని
వృషభేంద్ర మూర్ధాగ్ర విభ్రమమ్ములు కొన్ని
వనగజ ఋక్ష గర్వములు కొన్ని

ఎన్ని వచియింపరానట్టి తెన్నులగుచు
గామిజనచిత్త బహువిధ కౌతుకములు
కర్షకులపాలి కల్పవృక్షముల గములు
జలదరేఖలు మిన్నుల సంచరించె. 97

గీ. ఉత్తరాపథ విజయ మహోత్సవమున
దక్షిణాపథ గామియౌ దళితశత్రుఁ
డంధ్రరాజన్య సైన్యగజాళి యగుచు
సంభ్రమించెను మిన్నుల జలదఘటలు. 98

వాయువు నగ్నియున్ జలము వానికిఁ దాతయుఁ దండ్రి బిడ్డలై
యీ యఖిలమ్ము నేలుటది యెంతయుఁ జెల్లు శ్రుతిప్రసిద్ధమై
పాయని చిత్తవృత్తులను బాలుర వృద్ధులు నేకమైనయ
ట్లాయెడ వర్ష వాయువుల దయ్యెను రాజ్య మదేకధాటిగన్. 99

గీ. తాతకొడుకులు పాలించు తరముదాటి
తాతమనుమలు పాలించు తరమురాఁగ
తండ్రియొడిలోనఁ దనదుముత్తాత యొడిని
బాలకేళులు దనిపె భూబాల యపుడు. 100

మిన్నగజాలు నాగులయి మిన్నఁబ్రవేలెడు పొట్లకాయలై
భిన్నఘటాంబుధారలయి వింటికిమంటికిఁ బ్రాడుపట్టులై
మున్ను నిదాఘతాపమున ముచ్చెమటల్ నిలువెల్లఁబోసి యీ
విన్ను వెలార్చుస్వేదజలబిందులు ధారలు నయ్యె వర్షముల్. 101

గీ. వర్షధారలు భూమిపైఁ బడినవేళఁ
బొట్లపూవులు పొడిచినయట్లగాక
కాయ క్రిందికి వ్రేలాడఁగామి నవుర
ప్రతిసుమమ్మును గాయయై పఱచె దివికి. 102

క. పూవులఁ బూవులు పుట్టుట
లే వింతలు నేఁడు కాయ లెనసెను బూలన్
నా, వింటిపాట్లపాటులు
పూవులు వెదఁజల్లెఁ బుడమి మొయిళులరాకన్. 103

పుడమి దరిద్రులౌ జనులఁ బొందెడు నాకడగండ్లఁ దెల్పుచున్
బడె వడగండ్లసంఖ్యములు పట్టపగల్ నిశలైనవానలన్
పిడుగులు రాలి యప్పటికె పెంపఱు శీర్ణ కుటీరశాలలన్
బడిబడి మొత్తెఁ గష్టములు వచ్చినవారికె వచ్చుగా ధరన్.

క. పిడుగులు వడగండ్లును, నా
జడమయుఁ డగు వర్ష విభుని స్వాంతము దెలుపన్
వెడ వెడ, వెడనవ్వులుగాఁ
దడిత్తు లొకకొన్ని మెఱసెఁ దత్సమయమునన్. 105

గీ. ప్రణయకలహమ్ము లెఱుఁగని బాల యొకతె
ఉఱుము లుఱిమినఁ బతియుర మురము సేర్చె
ప్రణయకలహమ్ము లెఱిఁగినప్రౌఢ శతునిఁ
బతిని పులకించెఁ బృథుకుచాస్ఫాలనమున. 106

వేసవుల న్నిశాలకటివేదుల నిల్పి నిజాధరామృత
శ్రీ సమకూర్చుచున్ బ్రియుల జీవనముల్ తమయండ నిల్వఁగాఁ
జేసి ఘనాగమమ్ముల నశీర్ణ కదుష్ణ కుచోపగూహన
శ్రీ సవరించు కాములఁ జేసి విధాత కృతార్థతం గనెన్. 107

గీ. మందు వేసఁగి నందంద మడఁగిమడఁగి
వానకాలున వల్లభల్ ప్రమద లగుచు
బూర్ణముఖములఁ దనచుట్టు బొదవునెడలఁ
గడలియానంద రేఖలు కడలుకొనియె. 108

సీ. ఘంటాపథమ్మున ఘనగర్జనము విని
అంపిల్లి యాఁబోతు అంకెవైచె
తొలివానచినుకులు తలఁపునఁ బాటిన
నఱచి గంతులువైచె నడవిదున్న
పర్వతాగ్రమ్మునఁ బఱచుమబ్బులకు గ
ర్జించి సింగమ్ము కుప్పించి యెగిరె
సద్యస్సురభి భూమిఁ జూచి తుండమున నా
ఘ్రాణించి యేన్గు ఘీంకారమిచ్చె.

చెదరు చినుకులపోలికఁ జెదరిచూచి
లేళ్ళు మెసవెను సద్యశ్శిలీంధ్రములను
ఆకసమ్మున మబ్బులయట్లు పురులు
విచ్చి నర్తించె నెమిళులు పెచ్చుపెరిగి. 109

గీ. చల్లచల్లఁగఁ గీటరజస్త్రణాన్వి
తాగ్రమై వెల్లనై యిట్టునట్టు నగుచుఁ
బఱచివచ్చెడు కొన్నిటివఱుతఁ జూచి
భేకకులముల గుండె గుభిల్లుమనియె. 110

గీ. అల వసంతుని పెంశిలియైన వేళఁ
బరభృతమ్ములు సొన్నాయిపాటగాండ్రి
వర్ష ఋతురాజు పెండ్లివచ్చునపుడు
గాండ్రికప్పలె యయిరి బాకాలవారు. 111

ప్రౌఢకవీంద్రుఁడై నగముపై సభఁదీర్చిన యొక్కమబ్బటన్
గాఢరసధ్వనిస్ఫుటము కల్పితశబ్ద నిగూఢభావ ని
ర్వ్యాఢము బాధపాక మగునొక్కమహాకృతిఁ బల్క మెచ్చి యా
ప్రౌఢిని గొంతువిచ్చుకొని పాడెను దర్దురదుర్దురూటముల్. 112

ఆ. వె. జంటకవులపోలె మింట నభోనభ
స్యములు కొలువుదీర్చి యాశుకవిత
వఱదకట్టి పాఱ వర్షించె నష్టావ
ధానములను శతవధానములను. 113

క. శ్రావణమంగళవార
శ్రీవలె నొకపిల్లమబ్బు చెలఁగె నభమునం
దా వేళ సంధ్యకన్యా
భావిత వేణీవిలాస పరవశ మగుచున్. 114

ఆకాశ మనెడి యనేకపస్వామి
ఆకంఠముగ సాగరాంబువుల్ గ్రోలి
చలదబ్దమాలికా చ్ఛలమునఁ జేసి
లలితశుండాగ్ర జలమ్ములఁ జదలఁ

బోరిబోరి ఝుంఝూఝ్య ఘూత్కారములను
దోరగించుజల్లులై తోఁచె వర్షములు
కర్షక తర్షితోత్కర్షమ్ము లగుచు
హర్షిత కవిసమూ హోర్ష కావ్యములు
దంతాగ్ర రుచిజాత ధాళధళ్యములు
అంతంత మెఱపులై యందందు వెలయ
లంబోదరమ్ములై యంబుపూరముల
నంబుదమ్ములు కొన్ని యందందు వ్రేల
ఘనబృంహితములు ఘీంకారము ల్గాఁగ
ఘనవృక్షములు ప్రేల్లుకదలి త్రెళ్లంగ
ఱంపిల్లినట్టి వర్షావేళ లలరె
సొంపైన గణపతి స్ఫూర్జితాకృతుల. 115

క. గణపతినవరాత్రిమ్ముల
మణిగణముల నిచ్చు నుత్తమప్రభుని సభాం
గణ మయ్యె నింగి ఘనబృం
హణములు నటవేదపండితాశీస్సులుగన్. 116

గీ. రాజవంశ శరీరదర్శనము లగుచుఁ
బుడమి నలరించు గర్జనములను జేసి
అబ్ధిఁ బవళించు హరిమూర్తి ననుకరించె
నంబుదస్వామి క్షణకాల మాకసమున. 117

గీ. ఆకసమ్మున ఘనతరంగాళిఁబోలి
కృష్ణవేణమ్మమేన రోచిష్ణు లయ్యె
దళిత శాత్రవ రుధిరముల్ దఱుచుగడుగు
సంధ్రరాజన్య ఖడ్గాళు లగుచు నలలు. 118

గీ. ఉష్ణకిరణుండు వేసవి నుడుకఁబెట్టి
తెప్పలను దేల్చె నేఁడు కకుప్పు లెల్ల
ఓపుకొనలేదు పెద్దలు చూపునట్టి
యాగ్రహానుగ్రహము లల్ప మైనప్రాణి 119

తోలుదొలుతన్ సుఖమ్ముగ నెతోఁచియు వేసవిమంట లార్చుటన్
నిలిచి ఘనాఘనమ్ము లతినిష్ఠురవృష్టులుగుమ్మరించుచున్
నిలువఁగనీయమిన్ దుదకు నిర్భరమయ్యె ఘనాగమమ్ము నె
వ్వాలనఁ దదర్వాతల్ దెలిసి వర్తిలకున్న ననర్థక మ్మగున్. 120

ఉష్ణాంశుప్రభ లాత్మగర్భమున మున్నొప్పారఁగా దాల్చి రో
చిష్ణుల్ తత్కరసంగ సంగతరసస్నిగ్ధాంబు లంభోదముల్
కృష్ణాదివ్యరసప్రవాహములుగా నేతెంచినన్ గర్భవ
ద్ధిష్ణుల్ భూసతిమేన నిండుఁదనముల్ జృంభించె నానాఁటికిన్. 121

నభమందెల్లెడఁ గాఱుక్రమ్ముకొనియెన్ గర్వాంధ శుష్య ద్విష
త్ప్రభు శౌర్యోగ్రగభస్తి దీధితులు దర్పంబేద కాదంబినుల్
బుభుదంతావళి కర్ణదారణములై జృంభింప గర్జాధ్వనుల్
క్షుభదాత్వర్ధ నిబోధ కాంధ్రమహిభృచ్ఛండాలచండాకృతుల్

మెఱసెన్ దీర్ఘతరాసిభాసితములై మిన్నెల్ల విద్యుల్లతల్
కురిసెన్ ఘోరశరావళుల్దళముగా ఘోరాంబుదవ్యూహముల్
పఱచెన్ వాహినులట్లు వాహినులు శుంభద్వేగ దుర్వారముల్
విఱిఁగెన్ ప్రాఁకులుధూర్త శాత్రవమహీభృత్సర్వసేనాంగ
ముల్

హర్షం బందఁగఁ గర్షకావళులు గ్రీష్మాత్యంతసంతాపి దు
ర్ధర్షోగ్రాత్మగభస్తి భిన్నహృదయన్ ధాత్రిం బ్రసాదించుచున్
వర్షాంతస్ఫుర దంధ్రనాయక విభాస్వజ్జైత్రయాత్రా సము
త్కర్షాద్యోతక రీతు లెందు నొలపెన్ ధారాధరవ్యూహముల్

సీ. చెవిసోఁకఁ దొలిగర్జ చెలి యురమ్మున హత్తె
పతిమేను మది పులకితము గాఁగ
మెఱపు చూచినచూపు మెఱసి కుల్కుమిటారి
కెరలించెఁ బతిమదిఁ గెరలుమరుని
అంబర మ్మిదెఁ గ్రమ్మె నతివ పయోధర
మ్మని హెచ్చరించె నంగనను జాణ
కడిమితీవయుఁబోలె నొడలెల్లఁ బులకింపఁ
దలపోసె నిలువాసి తరుణి ధవుని

నిలువుఁగన్నులఁ దా నహర్నిశము పదులు
కనియుఁ గననట్లు కసికని కాలవశత
గగనవిభుఁ డుబ్బియుబ్బి భూకాంతపయిని
గురియుననురాగరసములై కురిసె జడులు. 125

సీ. పరదేశభాషలఁ బలుకుచందమ్ములై
కప్పలరొద లెందు నుప్పతిల్లె
స్వస్థాన వేషభాషల నాసఁబలె మీలు
నెదురీదె నదులందు నెగిరియెగిరి
పరరాజ హ్యాతరమల్ మరలఁ గెల్చినరీతి
చిగిరించె నెచ్చోటఁ జెట్టుచేమ
జాతీయ మధుర భాషా భావసౌష్ఠవ
మ్ముల ధ్వనించెఁ దరంగములను నదులు

బత్తి లీనంగ జున్నులపదును లెఱిఁగె
కాఱుమబ్బుల నగుచుచాగ్రములబోటి
మఱఁగి తరుణులకౌఁగిళ్ళ తెఱలఁ, బడుచు
లరయ మఱచిరి బాలారుణాతపములు. 126

గీ. దేవమాతృక గాక యదేవమాతృ
కయును గాక యహల్యయై గౌతమర్షి
పరమతపములపంట కాస్పదతఁ గన్న
యొక్క క్షేత్రమ్మునకు మబ్బు లుఱిమిచూచె. 137

గీ. ఆమనులవేళ మృదుమలయానిలునకు
వేఁకువలఁ బిల్లగాలికి వేసవులను
వానకాఱున జలధరపటికిఁ జెప్పి
విరహిజనములు వార్త లంపించుకొనిరి. 128

క. ఆనందాకృతి యగుభూ
మానిని యాతపము చంద్రమస్స్ఫురణమ్ముల్
పూనెను నెడ మునుదోఁచిన
యా నెఱులై సస్యచయము లతిశయమందెన్. 129

## శరదాగమము

గిరగిర కాలచక్రము సకృద్భ్రమణ మ్మొనరించునంతలోఁ
బోరిపోరి దృష్టమయ్యెను నపూర్వ మనఃకమనీయ మూర్తియై
శరదృతు వేఁగుదెంచె వికస ద్దినపద్మ దళప్రకార సుం
దరతర రేఖమై పరిణత ప్రసవోద్గమశాలిసస్యమై. 130

గీ. క్ష్మాతల మ్మెల్ల నవధాన్యకటక మయ్యె
నంధ్రరాజన్యకీర్తి చంద్రాతపములు
క్షీరసాగరవీచికా స్నిగ్ధఘృణులు
సాఁగె నటఁ గౌముదీమహోత్సవము లవని. 131

వేసఁగులందు మెత్తవడిపెమ్మలు దాల్చు త్రిలింగ భామినుల్
దాసిన వానకాఱుచలి తట్టుకొనన్ ద్వివటీక శాటికా
భాసిత దేహలై యపుడు పల్చని చిక్కని వెల్లపట్టు ల
భ్యాసముచేసికోఁ దొడఁగి రాత్మతనూ సుకుమార తాకృతుల్.

శారదవికాసములు గౌరిదరహాసములు
సారసవిలాసములు సారెకును మించెన్

తారల ప్రచారములు క్షీరనిధిపూరములు
కైరవవిహారములు భోరుకొనె నెందున్ 132

నీరములు తేటుకొనె వారములు తీరుకొనెఁ
బేరుకొనెఁ బంకములు నాఱుకొనె భూమిన్
పేరుకొను వెన్నెలలు సౌరుకొనెఁ గామినుల
హారిమృదుధీరములు కోరికలతీరుల్. 133

గీ. చియ్యఁబట్టెన యాఁబోతు స్నిగ్ధగర్జ
వెఱఁగుపడి వించు వెల్లనై విచ్చుమబ్బు
లంధ్రరాజన్య జయభేరు లాకళించు
దర్పితారాతులకు ముందు దారిచూపె. 134

గీ. ఇంద్రుఁ డెత్తినవిల్లు ముక్కైన లేక
ఇంచువిల్లెత్తె నప్పుడు పెంద్రుకొడుకు
కుపితకామిని భ్రూకుటిఁ గులికి ముదియుఁ
ద్రెళ్లి రెండయ్యెఁ బ్రియుని కౌఁగిళ్లయందు. 135

గీ. దుర్దినాథాయి జృంభితదోర్బలాఢ్యుఁ
గాలమహిషునిఁ బెడకాల నేలరాయు
సింహవాహన నెమ్మోము చిఱునగవులు
కెరలు మున్నీటితరఁగలు సిరులు గులికె. 136

గీ. కాఱుమబ్బులు ముక్కముక్కలుగ నగుచు
వళులఁ గాటుకపిట్టలఁ జెలులకనుల

నలకలందును గబరులయందు డాఁగె
మానసరములైన శరదాగమములయందు. 137

సీ. బేడిసమీలును బిరుదుతుమ్మెదలును
దరుణికందోయి మున్పిరులుఁగొనియె
కుంకుమపూవును మంకెనపువ్వును
బ్రమదాధరమ్మును బరువమెక్క
జక్కవజంటయు సామజకుంభముల్
తరుణీస్తనమ్ములు బిరుసుకొనియె
మేలైన కాశమ్ము మాలతీకుసుమమ్ము
ప్రియదరహాసమ్ము పేర్చియార్చె
పిల్లలేడులు కాటుకపిట్ట లసిత
కువలయమ్ములు సతులకన్గొనల మెలఁగ
నంచజవరాండ్రు వారి యొయ్యారములను
నేర్చికొనఁ, జూచె నెమళులు నృత్యమాగి. 138

క. శాస్త్రోక్తవిధులఁ బూజలు
శస్త్రాస్త్రమ్ములకుఁ జలిపిసలిపిరి జవతే
జస్త్రాసిత సురహరులకు
నస్త్రవిదుల్ గజతురంగమావళి కర్థిన్. 139

గీ. అలఁతినగవున వింధ్యాద్రి నిలకుఁ గూల్చె
నబ్ధి నాపోశనముపట్టె నట్టిమౌని

పత్నితోఁ రాఁగ దక్షిణాపథములందుఁ
కలుషభావమ్ము విడిచెను జలము లెల్ల. 140

క. శిల్పిప్రవరుఁడు తెచ్చు న
నల్పంబగు దేవివిగ్రహమ్మును నెమ్మిన్
నిల్పుచు నుత్తమభూపతి
సల్పె మహోత్సవము సకలసంతర్పణమున్. 141

సీ. పరిశయభీషణుఁడైన ఖలు గజాసురుఁ గూల్చి
విఘ్నాధిపతి యార్చి పేర్చువేళ
వెసఁద్రిమూర్తులనేని వెఱపించు మహిషుని
దుర్గామహాదేవి తుంచువేళ
అమ్మహావిజయమ్ము లఖిలలోకమ్ములు
స్నిగ్ధకంఠముల ఘోషించువేళ
ఝుంఝూపరిభంజన జవజిగీషాకృతుల్
నదులు సాగరములఁ గదియువేళ

చెవులుగాడ్పడ మొయిలు గర్జించువేళ
పరమ నిద్రాసుఖ మ్మున్నవాఁడు నేఁడు
పడకకిందటి తాఁబేళ్ళ గడబిడలకొ
స్వామి మేల్కాంచె క్షీరాబ్ధిశయ్యయందు. 142

గీ. ఆఱు ఋతువులు ముక్కారు లైనయపుడు
వాన చలి యెండ కాఱు ల న్నిటిలోన

నిదియె మొదలంచు సృష్టికి నెవ్వఁ డెఱుఁగు
కాదె యిది మున్ను స్వామి మేల్కనుటఁ జేసి. 143

గీ. అలరు వేసవి రవికిరణాళివోలె
వానకాలున బెగ్గురుపక్షివోలెఁ
గాంతకాంతమ్ము శారదాగమమునందు
స్వాతివానల శుక్తి గర్భముభరించె. 144

నిలిచి నిదాఘవేళలను నిప్పులుగ్రక్కిన భానునుస్రముల్
వెలయఁగ వర్షవేళఁ బ్రసవించె స్రవింప నదీనదమ్ములున్
విలసితలీల నేఁడు తెలివెన్నలవాకలు నించెఁ జంద్రమ
శ్ఛలమునఁ గైరవమ్ములు నిశన్ బవలబ్జము లుల్లసిల్లఁగన్. 145

గీ. పద్మినీజాతి నెల్లను బట్టపగలు
కరఁగి కరఁగింపఁ బోడఁగె నీ కర్మసాక్షి
విధినిషేధమ్ము లొక్కొక్క వేళయందు
వ్యక్తిగతమయి తాఱుమాఱగుట గలదె. 146

శైవుల్ భక్తగణార్చనావ్రతపరుల్ సాక్షాన్మహేశాకృతి
శ్రీ వర్ధిల్లిన దేశికోత్తముల నర్థిం గొల్చి పూజించి రా
దేవుండట్టుల, నక్తభుక్తులగుచున్ దేదీప్యమానమ్ములై
యా వేళన్ ఘనతారకావళులుగా నాకాశదీపౌఘముల్. 147

జగమెల్లన్ శివరూపమౌట యట వ్యాఖ్యానించు నాకౌముదుల్
తగ నయ్యీశ్వరునట్టహాసము లహీంద్రస్ఫాగహారావళుల్

సిగపూఁదేనెలవాక లంబుజములై శ్రీమన్మహోక్షమ్ము లో
త్తుగ మైనున్న విభూతు లక్షతములై తోడ్తోఁ బ్రకాశించుచున్

గీ. విషధరావళి పేరిటి విషధరాళి
విడుచుకుబుసమ్ములటు వింట వెల్ల మొయిలు
నెగడెఁ గార్తికవేళఁ బూర్ణిమను మఱియు
శివుని యుష్ణీషమునఁ గుచ్చుచెలువు మిగిలి. 149

సీ. వైశాఖపూర్ణిమా వసరమ్ములను బొంగు
జడధికి నిమ్మని సొరుగలదె
ఆషాఢపూర్ణిమ నలరుసరిత్పతి
యందమ్ములకు నిట్టి చందమున్నె
మాఘపూర్ణిమవేళ శ్లాఘనీయుఁడె కాక
యుదధికి నింతయొప్పిద మదేది
మహిత మీఁకార్తికమాస పూర్ణిమనాఁడు
శర్వరీవల్లభ జన్మదినమె
పేరునకెకాక రోహిణీతార శశికిఁ
గృత్తికాదేవియన నెంతప్రియము గలదొ
అనుచు వార్థికి స్నానార్థ మరుగు జనులు
పలుకఁ బట్టయి వెన్నెల పొడిచె మింట. 150

గీ. ఆఱుమతములవారికి నాఱుఋతువు
లందు ముఖ్యమ్మదొక్కొక్క టగునొ కాదొ

శారదమ్మున శైవవైష్ణవులు శక్తి
భక్తు లొక్కట నుత్సవబహుళు లయిరి. 151

రాసక్రీడలఁ దుళ్లియాడుచును వర్షాలక్ష్మి సేవించి యు
ల్లాస మ్మొప్పఁగ గోపికాయువతు లేలల్ జోలలుం బాడుచున్
జ్యాసన్నద్ధ సుమాస్త్రచాపలయి మంచాగ్రమ్ముల న్నిల్చి యా
సాసల్వేటిరి పాంథపక్షికుల మల్లాడన్ భ్రమద్దృష్టులన్. 152

పరిత స్సంప్లవమానవాయువులు శుంభత్కైరవామోదముల్
చిర దూరాగతబంధు హంసవిషయ క్షేమప్రసంగోన్మన
స్సరసీజస్పృహణీయసంశ్రితిమిషాఽశంకాఽళిఝుంకారముల్
శరదారంభములయ్యె సర్వజనతాసంశ్లాఘనీయాకృతుల్. 153

రజత శంఖ మరాళ గౌరమ్ములైన
వెల్లమబ్బుల వీవన లల్లనల్ల
వీవ మృదువాయువులు శరద్వేల నింగి
యుత్తమప్రభుపోలిక నొప్పె నపుడు. 154

పరిణతగర్భభార యగు భామ కపోలఘృణీమనస్స్పృహా
దరసుకుమారభావవిశదమ్ములు తీయక కాసె వెన్నెలల్
నరపతికౌతుకమ్ములయి నంద తపఃపరిపాకశోభలై
ధరణి తదీయగర్భమున దాచినరత్నమరీచిమాలలై. 155

# హేమంతము

క. హేమంతము పుండ్రేక్షు
శ్రీమధురము లోధ్ర కుంద జృంభిత బహుంది
వ్యామోదలహరి ప్రకృతివ
ధూమణి కాశ్మీరమగుచుఁ దోఁచె జగమునన్. 156

క. పులులు ప్రసవించు వేళలఁ
దలఁపించుచు సంజలపుడు తరుణ మృగవధూ
లలిత విలోచన భీషణ
ములు రమణీయమ్ము లయిన స్ఫురణల గ్రిక్కెన్. 157

ధనువునఁ జొచ్చువేళ రవి తప్పక వేఁకువఁ బాంచజన్య ని
స్స్వనములు శార్ఙ్గమంగళరవమ్ములునొక్కటమాఱుమ్రోసె భ
క్తనివహాళంరసీమ గళదఘ్నము లైన తదీయ భక్తివా
సన లలమెఁ జగమ్ములఁ బ్రసన్నగతిన్ గలగానరీతులన్. 158

క. కూపజలస్నానమ్ములు
మాపులు రేపులు నొనర్ప మఱఁగి జనమ్ముల్
దీపించిరి సుఖనిద్రలఁ
బ్రాపిత మృదుకోష్ణ యువతి పరిరంభములన్. 159

గీ. క్రొత్త యల్లునిపోలికఁ గులికి రవియు
సర్వ సంపత్సమృద్ధ మాసము యమందుఁ

దనదు నారాయణాకారతను దలంచి
మకర గృహవాస ఘటిత సమ్మానము నందె. 160

గీ. తెలుఁగుజోదుల పౌరుషదీప్తు లగుచు
కుక్కుట ద్వంద్వయుద్ధముల్ కొనలుసాఁగ
అగ్నిహారులకుఁ బోరాట మట్లయగుట
మాన్పలేక హాసంతుల మఱఁగె సతఁడు. 161

గీ. ధనువుపీడిన లోకబాంధవుని జూచి
కోళ్ళు గొత్తెలు నొండొండఁ గుమ్ములాడె
ఎట్టిప్రభు వేని దండంబు పట్టఁడేని
యల్పజంతువు శాసింప నలవియగునె. 162

సీ. పసిపట్టునో యేమొ బుసబుస పొంగారు
పదుచుకోర్కెల నిశల్ పొడవులయ్యె
శారదజ్యోత్స్నల నారగింపఁగ రామి
మాహిష దధులకు మఱఁగె జనము
నవవధూమణుల వేనలుల సోయగ మెంచి
యళులు పాములు నెమళ్ళ డఁగిమడఁగ
కాముకజన మిథః కౌతుకచ్ఛాయలై
పున్నాగతరులతల్ పూలు విరిసె
సఖుల పుండ్రేక్షు రసరుచిరి సఖములైన
కొసరు నధరామృతమ్ములఁ గ్రోలి క్రోలి

కులుకు గుబ్బల కుంకుమ లలము మేనఁ
దెలియరచె పసుపులు రవిదీధితులను. 163

క. నారంగఫల సఖశ్రీ
సారసనయనానఖంపచస్తనపాళీ
సారస్యవేది యువజన
మేరీతి నెఱుంగదయ్యె హిమవదుషశ్శ్రీన్. 164

ద్విపద. గజదైత్యు హృదయానఁ గాపురమ్మున్న
యజగవధరుఁ దెచ్చి యగజ కర్పింప
సురపతి పలికింప సొన్నాయిసొగసు
పరమేష్ఠి మద్దెల పదునులు పలుక
హరి యాటకాఁడునై యవ్వృషభేంద్రు
సిరి మెచ్చ బహుచిత్రచిత్రమౌ గతుల
నాడింపనాడింప నసురయు మెచ్చి
వేడుఁడీ యిట మీయ భీష్టమ్ము లనిన
నీ నంది యడిగిన దిచ్చుటే మాకు
నానంద మగును బ్రహ్మానంద మనిన
నంగీకరించు దైత్య స్వామిహృదయ
శృంగాటకము తన శృంగాగ్రమునను
గీటినఁ గనుగొని కిలకిల నవ్వి
మాట దాటనిమేటి మహితుఁ డయ్యసుర
డెందమ్ము చీల్చి కడిందియౌ భక్తి

నింద మీ హరుఁడుని యిచ్చె వారికిని
అందంద హరిముఖ్యు లద్భుత మ్మంద
బొందిసాయుజ్యమ్ము పురహరు మేన
నందమా శివుని గజాజినమందు
పొందుగాఁ దనకథామూర్తి వసింప
పౌరాణిక మ్మైన పరమ మీ గాథ
ఊరూర బిచ్చాన కొయ్యొయ్యఁ దిరిగి
రంగైనయట్టి సంక్రాంతి పండుగుల
గంగిరెద్దులవారు కథ లాడుకొనిరి. 165

అయ్యసురేంద్రు కృత్తియయి యంబర మొప్పఁగ వానిమేన దా
నయ్యెడఁ బుట్టు హర్షజల మయ్యెఁ దుషారము లట్టివాని యా
దయ్యము నెత్తి కోలున కెదన్ వెఱఁగందిన వేల్పుమూఁక దా
మయ్యెడఁ జుక్కలైయనిమిషాకృతిఁ దాల్చె హిమాగమాపగన్

ఆ. వె. నిండమునుఁగఁ జలియె యుండ దటంచునో
బాల తృణ తుషార పటలిలోన
నుష్ణకిరణుఁ డొదుగ జిష్ణుని చాపమ్ము
భూమిఁ బఱచినట్టి పొలుపునందె. 167

కుండలముల్గురు ల్గదల గోమయపిండము లింటిముంగలన్
నిండినవేడ్క నూత్నపరిణీతలు బాలల గూడిమాడి లే
యెండలవేళఁ జేయ రవి యే మనవచ్చుఁ గుచోపసీమలన్
గండతలమ్ములన్ రుచిరకక్షము లందసియాడె ధృష్టుఁడై 168

క. సావిత్రీ గౌరీదే
వీ వ్రత పూజావిశేష విరచిత కుతుక
శ్రీ వెల్లివాడువ భూసతి
పూవుంబోడులకు బంతిపూవుల నొసఁగెన్. 169

నవరాత్రమ్ముల దేవిఁ గొల్చి దినము న్నవ్యమ్ముగా భక్ష్యభో
జ్యవిశేషమ్ములఁ బేరఁటాండ్రు తుద కోలాడించి పంపించు గా
రివలెం దోఁచెను భానుఁ డయ్యెడఁ బురంధ్రీరత్నముల్ పెట్టు ద
ధ్యవలిప్తమ్ములు చిందిపడ్డయమకుల్లామయ్యె నక్షత్రముల్ 170

తరుణి యొకర్తు హస్తగత దర్పణయాచు ముఖారవిందమున్
గరగరసేయుచున్ బెదవిఁ గాంతతమార్ద్రిని పీతసారమున్
విఱిచి యొకింతనవ్వులగు వీక్షలఁ దాఁ గయిసేసె నెట్టకే
నరుణుని లేఁతలేఁత కిరణాలి హసించెనొ యాళికైవడిన్. 171

పొలఁతుకయోర్తు కాంతపరిభుక్తము మెత్తని మేఁ దలంచిచూ
పులనుబ్రజాగరారుణిమమో పొలయల్కయొ యోష్ఠరాగమో
వలపులొ పాఱఁగంబెదవి పైకొను ముంగురు లొత్తియొత్తి కం
చెల ధరియించెఁ బొద్దుకనుచెందిన నేమిటఁ బుట్టునంచునో

శ్యామయొకర్తు గాఢరతి జాగరసంగ కుముద్వతీ సఖ
శ్రీ మధురాంగిచారుకుచసీమ పయోరుహ కోశసన్నిభ
మ్మై మృదుశైవలోపమకచాచితమై పవళింపఁ బద్మినీ
స్వామి కవోష్ణ నైజకరసంగతి వెచ్చనఁ గౌఁగిలించెడిన్ 173

క. కమలోదర దళకోమల
ము మడువు ధరియించు లలన ముకుళ బహిర్భా
గముదళము లైన మడువుల్
గ్రమమునఁ గైసేసె దళదళమ్ముగ మేనన్. 174

అంగన లట్టివేళ వలయాంగదనూపురరత్నకాంచికా
సంగము లొల్లరైరి శ్రుణశిః పరిసర్పదఖండకౌతుకల్
పొంగుచు నిచ్చఁ జక్కదనముల్ ప్రసవించెడి యట్టిమేని కీ
యెంగిలు లేమియంచునో మతేమి దలంచిరొ భర్తృసన్నిధిన్.

కుంకుమరాగరక్తములు కోమలకుందతుషారచంద్రరే
ఖాంకురగౌరగౌరములు హారముల న్గయిసేసి సాంధ్యరే
ఖాంకురసుందర మ్మగునిశాకృతి నొప్పిరి కామిను ల్మహా
శ్వంకితముల్ ప్రియాఽగతులఁ జంచలదృష్టులిరుల్గురుల్ కొనన్.

వచ్చియురాని మొగ్గయయి వాసనలీనుచుఁ దన్ను నెవ్వరే
మ్రిచ్చిలుపోదురోయను కుముద్వతి నవ్వెనుమంచుముంపులన్
విచ్చియువిచ్చనట్టి తెలివెన్నెలతేకుల కంటిదాని దాఁ
గ్రుచ్చి కవుంగిలించెను గురుప్రియయేలినధూర్తుఁడయ్యెడన్.

గీ. వేల్పుఁబడుచులు సంక్రాంతివేళ ముగ్గు
లిడఁగ రాలిన పొడులుగా హిమకణములు
తొలుదొలుతఁ బెట్టుచుక్కల తోయములను
సంతరించెను దారలచాలు చదల. 178

గీ. ఇతరదుర్లభ మొక్క మహిష్ఠఫలముఁ
గోరి గళదఘ్నజలముల ఘోరతపము
పూనిసలిపెడి పాపఁపూబోఁడివోలెఁ
దోఁచెఁ బద్మిని ఘనసరస్తోయములను. 179

చలి యట నంతకంత కవశమ్మయి రేఁగి ప్రచండమైనచో
జలములు ముట్టిన న్గఱువసాఁగెఁ దదుత్థితసర్వతోముఖాఽ
కలనముఢాకకున్ వశముగాక నిలింపులుసైత మప్పుడా
కులపడి పెట్టుకొన్న చలికుంపటులా యనిపించెఁ దారకల్. 180

ఎండకు వానకుం జలికి నెవ్వఁడు దాసహియింపనోపు నె
వ్వాండు మనమ్మువోని వరవర్ణిని యండ వసించియుండు నా
తండొకరుండె గాక, యతిదాంతులు గారె త్రిమూర్తు లంతవా
రండజయానలం దనువులందు ధరించుట కేమి వెఱ్ఱులే. 181

పవిధారా నిశితప్రసారముగ దుర్వారమ్ము శీతమ్ముస
ర్వవనుల్ మోడులుసేసె నెల్లెడ మదవ్యాళక్రమాభీలమై
ఇవతాళించిన యట్టివేళలమదమ్మొక్కన్ లులాయమ్ములో
యవి క్రోడమ్ములొ యేన్గులో తెలియరావయ్యెన్ సమానా
కృతుల్. 182

గీ. మదవతీజన నేత్రసంపదలతోడ
లేడికన్నుల తళుకులు జోడుకొనియె
స్మరకిరాతుండు తరుణీ నిశాతదృష్టు
లీఁటెలుగఁ బూని సాఁగించె వేఁట లపుడు. 183

క. చండ ప్రచండ వాయువు
లొండొండ న్వీవఁ జలి మహోద్ధత మగుచున్
మండించి యింతకింతకు
నెండలె మే లనఁగఁజేసె నెల్ల జనమ్ముల్. 184

గీ. భోగిపండుగ మంటలఁ బ్రొద్దుపొడిచి
మిన్ను లంటెడు చలి దారి తెన్ను లేక
అవిసి శివరాత్రి శివశివా యనుచుఁబోవు
ననుచు జనములు దమలోన నాడికొనిరి. 185

గీ. ఎండ గాలియు వేసఁగి మండఁబెట్టె
గాలి వానయుఁ బిదప గగ్గోలు పఱిచె
గాలి చలిగూడి మంటలఁ గ్రక్కుకొనుచు
సీతుకాలునఁ దన యెల్లచేవ చూపె. 186

గీ. ధనువుఁ జేరిన వేళనె తనువు రవియు
నేర్చె మూఁడంకె వేయింప నోర్చి యిపుడు
మకరమున డాఁగి కడవలో మఱుఁగనేర్చి
లోనుగాకున్న యిఁక మేను మీనునకును. 187

క. గుడికట్టు మంచుతెఱలను
బడిబడి చలిబాధ కోదిగి భానుఁడు శశియున్
దోడివిరో చలి కంతములను
నడిపుట్టె జగమ్ములందుఁ జలికాలమునన్. 188

గీ. తెలుగురాజుల చిత్తశుద్ధులను బోలి
వెలిఁగి వెన్నెల మిన్నుల నలమికొనుచు
వారిహృదయస్థ మగు దయాసార మగుచు
సారతరమయ్యె నపుడు తుషారపటలి. 189

ఔత్తరాహుల భక్తిరసానుకృతులు
దాక్షిణాత్యుల జ్ఞానసంతర్పణమ్ము
లగుచుఁ బాశ్చాత్య ముఖపరిహాసకములు
ప్రాచ్యదరహాసములు మంచువాన లొలసె. 190

హిమగిరి ముక్కముక్కలయి యిమ్మెయి దాడిగ నేగుదెంచెనో
హిమకరుఁ డింత దగ్గఱఁగ నేటికి వచ్చెనొ వార్ధిఫేనముల్
తుమురులుకట్టి క్రమ్ముకొను దోహాలమో యని బెగ్గడిల్లగా
హిమముజగమ్ముగ్రమ్మెఁదన యేడ్తెఱమంటికిమింటికొక్కఁడై.

జలముల సంచరించు నొకజంతువు లైరి మనుష్యు లమ్మెయిన్
దళముగ మంచుపట్టుటకుఁ దప్పక పైరులు పండునం చెదన్
దలఁచెఁ బ్రజాళి యెందు ఋతుధర్మము తప్పునె యుత్తమప్రభుం
డిలఁగొని యేల నంచనిరి వృద్ధులు పౌరులు పండితోత్తముల్.

## శిశిరము

క. మాఘస్నాన మహాత్త్వ
శ్లాఘా సంశ్రవణ పరవశలు భామలు పు
ణ్యౌఘములఁ గొల్లలాడిరి
మాఘోదయ పుణ్యకాల మజ్జనములచే. 193

మాఘము సర్వపాపచయ మర్దన సార్థకనామ ధేయతన్
శ్లాఘిత మాటచే వడుగులన్ మఱి పెండిలి శోభనమ్ములన్
శ్రీ ఘటియించె భూమికిని నింగికి వర్థిలుమంగళమ్ములన్
జోఘుపదాత్మమై ప్రకృతిసుందరమై ప్రతిగేహ సీమలన్. 194

గీ. ఉదధి సర్గోదయమ్ము మహోదయమ్ము
నొనరఁ గనియును దఱుచుఁ బూర్ణోదయాఢ్య
శశిని మెచ్చెడి వార్ధిసిస్నాను జనస
మూహ మంభోధి వీచికాస్ఫురణ లురిసె. 195

శనివారమ్ము త్రయోదశీతిథి ప్రదోషభ్రాజమానమ్ముగా
జనముల్ చీకటిగుంపులన్ దెగడు కృష్ణన్ స్నానముల్ చేసి పే
ర్చిన డిండీరములన్ హసించు సుకృతుల్ సేకొంచు సిద్ధార్థు ల
ర్థిని బూజించి తరించి రంత శివరాత్రిన్ శ్రీగిరిస్వామినిన్ 196

ఆ. వె కార్తికమునయందుఁ గదు రంత నేనైన
మాఘమందు నాదుమహిమ చూడు
మనెడి చిక్కదురలి యాకస మ్మంటుచు
విరియు పూలు చుక్క లొరసె మింట. 197

నిక్కెడు కుందపుష్పముల నీటులు గుల్కుచు నొక్కకొన్నిమై
చిక్కనితుమ్మిపూవుల హసించుటలై ధవళాక్షతమ్ములై
చిక్కని యాలపాల యభిషేకపుబొట్టులు గంధబిందువుల్
చుక్కలు చూడనొప్పె శశిజూటు శిరమ్మున న న్నభమ్మునన్

హరియును బ్రహ్మ తండ్రి కొడుకయ్యును వారలహెచ్చుతగ్గుకై
పురపురఁ బోరుచో బెగడుపుట్టినవేల్పులు చుక్క లొప్పె నా
పురహరు మౌళిభాగమునఁ బూవులపోలిక నార్తి నెవ్వరే
శరణనఁ బ్రోచి నెత్తినిడు శంకరు మూర్తి విభూషణాకృతుల్

ఉరులింగాకృతి బ్రహ్మవిష్ణులకహమ్మొక్కొక్కమైఁ దీర్చి శ్రీ
గిరిమల్లేశ్వరుఁ డుద్భవించునెడ నీ కృత్స్న ప్రపంచమ్ము దా
మఱలంబుట్టఁగ హేతువై హరియటన్ మత్స్యాకృతిం గాంచుటై
హరిమీనమ్మునఁ జేరెఁ గూర్మివివరాహమ్ముప్రవర్ధిల్లఁగన్ 200

క. తరుణుల కుంకుమ పూఁతలు
తరుణాతపరుచులు తులితదర్పము లెసఁగన్
మరుఁడును దడపడె రతి కను
నరుణిమకును జూంటితేనె యధరమ్మనకున్. 201

కుంకుమరాగ పింజరము కోమలి పీనపయోధరమ్ము చే
నంకిత మైన మేనుగని యాఱడివోయెడి సంజయంచు లో
జంకిన మేటియు న్మధురసమ్ముల కెంబెద వానియాని యు
ప్పొంకుగ వార్చె సంజ రవిరేఖ లెఱింగిక్రమక్రమమ్ముగన్ 202

ఎక్కడికక్కడే మొదలు నెక్కడికక్కడె యంత మయ్యెఁ దా
నిక్కడ నాది మధ్యమిది యియ్యది యంత మటంచుఁ బేర్కొనన్
జిక్కని సృష్టికావ్య రససిద్ధుల పోలిక నూత్నదంపతుల్
పుక్కిల వీడియు న్విడరు భానుసిరాకడ లెంచియెంచియున్

క. ఏచిన శిశిరము గర్భము
మోచిన సతివోలె హిమసమూహ ధవళిమ
శ్రీచిత కపోల కువలయ
మేచకకచ యగుచు మెల్లమెల్లఁగ నడచెన్. 204

అన్నిదినమ్ము లొక్కగతి నానాటి రేలు క్రమక్రమమ్ముగన్
జిన్నతనమ్ము దాల్చె మునుజెందిన వృద్ధత బాలభావసం
పన్నత నందెనో పడుచుఁబై దలిచేఁతల సిగ్గు లందెనో
మిన్నులనంటు నీరతిసమృద్ధుల నల్లల వెల్లబాఱెనో. 205

క. పడుచులకుఁ గాక తగునే
వడవడ వడకించు శిశిరవైభవ మిది యె
వ్వడడఁగునో యన వృద్ధులు
వెడవెడ నవ్విరహిజనము వేసటఁబడియెన్. 206

సీ. వేసవి నెండినవినువాక వేల్పులు
త్రవ్వినచెలమలై తనరితనరి
వర్ష వేళల మహాపథ మంటుమిన్నేట
దుమికెడు చేపలై భ్రమసిభ్రమసి
శారదమ్మున సుప్రసన్న వియన్నది
విహరించు నంచలై వెలసివెలసి
హేమంతమున దైవవృక్షమ్ము లెసరేఁగి
పూచినపూవులై పొదలిపొదలి

శిశిరవేళల రాత్రి కై సేయునల్ల
చీఱ నలరెడుచుక్క లై చెలఁగిచెలఁగి
అలరెఁ దారలు నవవసంతాగమమున
సంధ్యభారతి మాళి ముత్యాలవోలె. 207

క. ఆసన్న ప్రసవప్రా
చీసతి ధరియించు తెల్లచీఱసిరులఁ గై
సేసెఁ దెలిసన్నమబ్బులు
వాసంతోదయము డాయవచ్చిన వేళన్. 208

అంటియు నంటనేరఁడనె యయ్యెడ భూసతి నుగ్రరశ్మి తా
నంటకయేమి గర్భభృతి నడ్డుకదల్పఁ జెమర్చు మేను వె
న్నంటిచరించుటల్ దెలియవయ్యెనె యా హిమబిందుసంగతుల్
కంటినె యద్దమున్నయెడఁ గావలెనే మఱి వేఱెసాక్ష్యముల్.

గీ. గగనవిభుఁ డప్పు పరిపూర్ణగర్భయైన
భూమి ప్రసవించు ప్రొద్దులుపొడుచువేళ
లెదురుచూచెనో వేఁగన్ను లెలమి విచ్చి
యనఁగ నలరారెఁ దారక లంబరమున. 210

క. శ్రీశైల మల్లికార్జున
కాశీవిశ్వేశ రూప! కవిజన హృదయా
వేశ! విరూపాక్ష! మహే
శా! శంకర! నిఖిలనిగమసారాకారా. 211

భువనభరణ లీలాభ్యుత్థితానేకరూపా
కవిజననవచిత్తాఽకల్పితానందరూపా
వివిధతిమిరనాశాఽవిష్కృతాఖండదీపా
నవనవనిజవీక్షానంతనక్షత్రదీపా. 212

ఉత్తమకావ్యనాయక మహోక్షతురంగమ విశ్వరక్షణా
యత్తమనోజచంద్రమ కటాక్షజభాస్కర కార్యపూర్తి సం
పత్తి విభక్త జాతి గుణ భావ నిరూఢచిదేకవర్తనా
వృత్త భవ ద్భవిష్య దితిభేద వినాకృత దివ్యవర్తనా. 213

క. శ్రీవల్లభవల్లభ సం
భావితపద చంద్రమౌళి మల్లేశ మతి
శ్రీవిశ్వనాధ కవితా
భావభవా యభవ భవ భవానీభావా! 214

క. అరవింద సురభి మధురో
త్తరనైషధ సహజభావ ధన్యత్వగుణ
స్ఫురితోత్తమ మను సంభవ
విరాజి ముఖపంచమమ్ము వెలయు శివుకృపన్. 215

శివమ్

శ్రీరస్తు

# ఉత్తమ మను సంభవము

## షష్ఠాననము

కం. శ్రీరుచిర తుంగ భద్రా
స్ఫార సరసకవనగమ్యా జాగ్రత్కృష్ణా
కారఘనభావలహరీ
పారావారా! యఖండ పరమాకారా! 1

గీ. అవధరింపుము శిశిర మిట్లవసరిల్ల
నుత్తమప్రభు మతివోలె నుదయమంది
ప్రొద్దు పొడసూపు వేళయై పొలుపుదిద్దెఁ
జరిత సుకృతైకలక్ష్మి వసంతలక్ష్మి. 2

సురుచిరముల్ త్రిలింగకవి సుందరభావ రమావిశేషముల్
పరిణతభాగధేయము లపశ్చిమముల్ సువిపశ్చిదాత్మభా
స్వరములు మాధవప్రభు ప్రసర్పణముల్ మది మేలుకొల్పులై
పరభృతలోకము ల్పలికె స్వాగతముల్ ప్రణయార్ద్రకంఠముల్

వచ్చె వసంతలక్ష్మి సుఖవర్ధనయై చిరదూరవాసితన్
నొచ్చియు నూత్ననూతన మనోహరకీర్తులు సత్ప్రతాపముల్
దచ్చికడ ల్వెలుంగ విశదమ్ముగ మావులఁ బూఁజివుళ్ళునై
యచ్చపు వెన్నెలల్ తరుణితారుణకాంతులునై ప్రియమ్ముగన్

పరిణతులైన సత్కవులపల్కులకు న్మధురానువాదముల్
గిరికొనెఁ గీరముల్ తమదుగీరమసొంపు లకృత్రిమమ్ములై
వఱలినయట్లుగాఁ దమపయుజ్ఞలఁ బ్రజ్ఞల వెల్లడించెనా
పరభృతముల్ వసంతవిభవమ్ములు స్వీయకుహూకుహూధ్వనిన్

నవనవకావ్యముల్ పలికినారము మే మని నిక్కెఁ గోకిలల్
కవకొని కూకుహూధ్వనిజగమ్ములనొక్కటమూఱు మ్రోయఁగన్
కవకవ నవ్వె నాఁ బ్రకృతికామిని పూచెను మావితోట లు
ద్దవిడి హసించె నా విరిసె దానికి మెచ్చుచు వేఁపతోపులన్

వచ్చుచుఁ బోవుచుండు పెఱబంధులయట్టులుగాక నిచ్చలున్
వచ్చియుఁ గ్రొత్త క్రొత్త యనుభావములిచ్చెడియాత్మబంధువై
వచ్చినకాలమే మఱలవచ్చు యథార్థత లమ్మహత్త్వముల్
క్రుచ్చి వచించెఁ జిల్కగమి కోయిలగుంపును గోరువంకలున్

చెప్పినదానినే మఱలఁ జెప్పఁబనే మనుపెద్దలెల్ల గా
చెప్పినదానఁ జిత్రము విశేషము లెంచియె యట్టు లందురో
ఎప్పటికప్పుడే పరువమెక్కెడి జవ్వనిముద్దుఁజెక్కిలిన్
జప్పున నొక్కముద్దుఁగొని చాలసఁజాలు రసజ్ఞు లుందురో

ఎన్నఁగ దేశకాలగతి నేర్పడు నీనవతాపురాణతల్
భిన్నము లెట్లు మూఘున కభిన్నము లట్లు యథార్థశీలికిన్
తిన్నదె తిన్నదే మఱలఁదిందుము దేనికొ నెన్ని మాఱులో
విన్నదె విన్నదే మఱల విందుము దేనికొ చెప్ప నేర్తురే

ఎన్ని భవమ్ములాయెనొ కదా యనేకసంశయ నాదుచిత్త మీ
పన్నినదారులం బడుచుఁ బర్వులు పెట్టి పరిభ్రమించుచున్
తిన్నఁగ నాదుగూడు గుఱుతించిన బుట్టుఃఖండబోధముల్
మిన్నులముట్టిన స్వాశమె మిన్నకయుండ వశంవదాత్మతన్

ఎన్ని యుగమ్ము లేఁగినవొ యేనిటులైతిని విశ్వవిశ్వమున్
భిన్నముభిన్నమౌచుఁ గనువేదుఱు పుట్టఁగ సంచరించి నా
యున్ననిజమ్మెఱుంగుటకు నుత్సుకతం దఱి వేచివేచి యే
నున్నటులుండి యొక్కొకపు డూరక యేలకొ గొంతువిచ్చెదన్

ఎన్ని తరమ్ములైనవొకొ యీకడ వెళ్ళని పెక్కురూపులం
దున్న యథార్థతం గనఁగ నొక్కొకబాటను సాగిసాగి నా
కన్నసుఖమ్ము గష్టమును గంతమువిచ్చుచుఁ బాడికొందు నా
సన్ననిగొంతుకన్ దెలియఁజాలునె ప్రాణులు సత్యరూపమున్.

ఎన్ని గతించెనో యెఱుఁగ నిమ్మెయిభిన్నత లెంచియెంచి యీ
యన్నిట నేకరూప మరయం గనుపట్టిన హర్షబోధముల్
నన్నుఁ గుహూకుహూ యనుమనన్ బదులాడుట నేనెఱింగితిన్
చిన్నలువోలెఁ బెద్దలును జీరుచు నన్నుఁ గుహూకరించుటన్.

ఎన్నఁగ భాష కందనిది యిట్టిదియట్టి దనంగరానిదై
యున్న యొకానొకండ గురసోజ్జ్వలరూపము నన్ను ముట్టినన్
నన్నును నేనె చూచినఘనప్రమదమ్ములు నా కుహూధ్వనుల్
విన్నఁ బ్రతిధ్వనింతు రొకవెఱ్ఱినొ మీరు నిజమ్మెఱింగియో.

ఏనొకసత్కవీంద్రుఁ డని యేనొకబోద్ధ నటంచు నేనెగా
జ్ఞాని నటంచు నే నొకరసజ్ఞశిఖామణి మాని నంచు బై
నే నొకసార్వభౌముఁ డని యెంతటిమన్నన లిత్తు రార యీ
నా నిజరూపమున్ దెలిసిన న్మఱి మీరలు నవ్విపోరొకో. 15

నేను వసించుతావు లవినిందిత నిత్య వసంతసీమముల్
మానిని కాకలీమధుర మంగళకంఠము లాటపట్టులై
జ్ఞాని రసజ్ఞ చిత్తము లన న్విడిపట్టులు నుందు నెందునున్
మానక యెక్కయెక్కయెడ, న న్గననేర్తురు కొంద ఱల్పతన్.

అనుచుం గోకిల తత్కుహూధ్వనులు వ్యాఖ్యానించునవ్వేళ నీ
జనము ల్గర్వితులై యెఱుంగ రివి యజ్ఞానుల్ వికారప్రభా
ఘనజీమూత నిబద్ధబుద్ధులు కుహూకారమ్ము చాలింపు నా
వినిచెన్ జిల్కలు నెట్టయెట్టకనుల న్వీక్షించె గోర్వంకలున్.17

మఱలం బల్కెను గోకిలాంగన కుహూమాధుర్యముల్ చింద నీ
ధరలో నెవ్వరి కేకుహూధ్వనికి బోధ మ్మెట్టు లౌనంచునో
వరణీయుండగు శిష్యు నొక్కరుని సంపాదింప నూహించు నా
గురుచిత్తమ్ములో దానివైఖరు లసంకోచస్వభావమ్ములో. 18

అంతట నుత్తమప్రభుఁ డనంతవసంతమహోత్సవమ్ములన్
స్వాంతము నిల్పియున్ బ్రియ నవప్రసవాభిముఖిం దలంచి యే
మింతకు నేఁడు రారయిరి యీసతిచిత్తములోనివారు నా
స్వాంతమునైన నందయును నామమతల్లియు దండ్రియేనియున్.

అనుచున్ గోకిలకాకలీస్వనము లొయ్య న్పించు నౌత్తానపా
ది నిజాత్మం దలపోయఁ బమ్మిని ప్రసూతిం బుట్టునాదమ్ములన్
వినిచెన్ బుష్కరిణీన్ మదాళులచటన్ విచ్చేసి హంసాంగనా
జనమున్ బెక్కుపురుళ్ల నోమినకథల్ జల్పించుచందమ్మునన్.

## ఉత్తమమనూదయము

గీ॥ ప్రాగ్వధూమణి తనదు గర్భము ఫలింప
బాలభాస్కరుఁ బ్రసవించు పట్టునందు
మంత్రసానియొ యాయుషోమధురలక్ష్మి
యాన యిడెనాఁగ నిశ్శబ్ద మయ్యె క్షణము. 21

రాగరసార్ద్రితము ల్గమలరాగమణుల్ తల దాల్చివచ్చు మి
న్నాగులవోలె భానుకిరణమ్ములు పొల్చె క్రమక్రమమ్ముగన్
రాగరసమ్ము పైనొలికిన న్నిలువెల్లిన మేనులై ఫణా
భోగము విప్పులై ధవళమూర్తి రమల్ వెలయించె మిన్నులన్

ఆనందాకృతి నందె నెల్ల జగ మాహ్లాదించి దాక్షిణ్య వి
ద్యానైపుణ్యము లుల్లసిల్లఁగ జగత్ప్రాణుండు వీచెన్ హవి
ర్దాన మ్మగ్ని ప్రదక్షిణార్చులఁ గొనెన్ బ్రద్యోతమానాకృతి
శ్రీ నిండారఁగ లోకబంధు నుదయశ్రేయమ్ము వర్ధిల్లఁగన్. 23

కడలి తరంగరేఖల ప్రకారములై పరమేష్ఠి మెచ్చు కెం
పడరిన భారతీ మధురహాసములై హరి బొడ్డుతమ్మి క

చ్చెడలిన కాంతులై వృషభ మెక్కి శివు ల్చరించు వేళలన్
గడలుకొనెన్ వృషేంద్ర ఖురఘట్టిత రేణువులై రవిప్రభల్. 24

సీ॥ కామధేనువు బిడ్డఁగనునట్టి వేళలై
యంభారవము చేసినట్టు లయ్యె
అభ్రముకరిణి నవ్యప్రసవావేద
నను ఘీంకరించు చందములు తోఁచె
పార్వతిసింగమ్ము ప్రసవించు వేళల
గుఱువెట్టు సవ్వడుల్ కొసరుకొనియె
గంగామహాదేవి కార్తికేయుని శుభా
విర్భూతి ఘోషించు విధము లయ్యె

ఉత్తమసుతుండు బాహులేయుండు పుట్టఁ
బ్రకృతికామిని సురుచిభావము భజింప
నెట్టసెఱలను దెసలెల్ల నెట్టనెట్ట
నగుచుఁ దోఁతెంచె నుదయాద్రి నబ్జహితుఁడు. 25

గీ॥ మీనగర్భమ్ము వెలువడి మింట్రత్రోవ
నరదమున వచ్చు సప్తాశ్వ నశ్వఖురము
లవనిఁ జిమ్మిన శైలధాతువు లనంగ
నరుణకాంతులు ధర నెల్ల నలమికొనియె. 26

కెవ్వను బిడ్డకేక చెవికిన్ భువికిన్ దివినుండి తివ్వనన్
తివ్వనఁ బడ్డ శ్రీహరి యరిందమచాప గభీరఘోషమై

అవ్విభుఁ డెత్తి యీకువలయమ్మును బ్రోవుము పోయి రమ్మనన్
జివ్వున వచ్చి చేరుటలు చెప్పెనొకో యనిపించె స్వామికిన్. 27

అవి పరమేష్ఠి సృష్టిసమయప్రథమోదితముల్ జనిప్రవా
హ వశగతాత్మకష్టనివహ ప్రకటమ్ము లనూహ్యభావముల్
భవభవ దుఃఖదుఃఖ పరివర్ధితముల్ పసిబిడ్డ యేడుపుల్
కెవు కెవు కెవ్వురంచుఁ జెలఁగెన్ జెలఁగెన్ బహుళాత్మమోదముల్

క. క్వాఽహం క్వాఽహ మ్మనుచును
హాహాకృతి సేయు జీవి యావేదనముల్
మోహాపడి తల్లి యొడిలో
నూహాతీతములు సుఖితయోగము లయ్యెన్. 29

పరితో భిత్తి కవాట చిత్రి శుకమై భాసిల్లు సౌధావళుల్
పురిటెంటంజిరకాలవార్తయయి యామోదమ్ము గల్పించుచున్
బఱపై వచ్చిన బిడ్డపుట్టినకతల్ భాషించు టొండొంటితోఁ
గిఱుకి ఱ్ఱించును గీరమం దెలిపె నాకీరాంగనా వారముల్. 30

హరి కెంగేలి నవారుణప్రభలు డాయం బాంచజన్యమ్ము త
ద్ధరహాసమ్ము నిజస్వరూప మయి జ్యోత్స్నాస్నిగ్ధ ముగ్ధాకృతి
స్ఫురణన్ దా నొకచిన్నిపాప యగుచుం జొత్తెంచి పొత్తిళ్ళదా
మరలన్ దల్లికరాబ్జ మందొదిగి సంభావించె నాత్మాకృతిన్. 31

హరిసుదర్శనప్రభలు నప్పసిపాపని నందకాకృతుల్
శ్రీరమణీయశోభలు హసించెడి చెక్కిలిలేఁతనవ్వులున్

ధారుణిఁ బ్రోవ శ్రీహరి ముదమ్మున బుట్టిన వార్తలాడె ని
చ్ఛారతిఁ బాప, పాపకుబుసమ్ముఁ బొత్తిళులందుఁ గూర్కుచో.

కమలజు మేనిసోయగము కౌస్తుభరత్నఘృణుల్ హసించుచున్
కోమరుతనమ్ము మీఱు కొడుకుం గన మారుని యక్కుమారతల్
రమణుల చిత్తవీథుల బరాబరి సేసినయట్టు లయ్యె ను
త్తమసుతు నుత్తమాకృతిముదమ్మిడియెన్ బహుళాన్వయక్రియన్.

పట్టపుటేన్గు రాణికిటుఁ బట్టి జనించినయట్టివేళలన్
నెట్టన ఘీంకరించె నవినిక్కము సేసెను హేష నశ్వ మ
ప్పట్టున ఱేఁడు దేవి ప్రసవ ప్రియవార్త కెదుళ్ళుచూచుచున్
కట్టెదుటన్ శుభమ్ములయి కన్నులఁ దోఁచెను నందయాకృతుల్

క. జలపూర్ణ కనకకలశము
బలె రవి ప్రాగ్వనిత నడుముపట్టున నలరెన్
కిలకిల మను నండజకుల
కలకల మాపురుడుపోయు కలకల మయ్యెన్. 35

ఆ రవి మంత్రసానియయి యాత్మకరాసిని బొడ్డుకోసినన్
వారిజసద్మ మందరుణపద్మిని చెంగటఁ గూజితమ్ములన్
'క్యార'ను నొక్కయంచపసికందును దాదులపోల్కి యార్చుచున్
సారసముల్ సరోజదళశయ్యలఁ జేర్చుట తోఁచె ఱేనికిన్. 36

వ. ఇవ్విధమ్మున బహులామహాదేవి ప్రసవసమయమ్మునం
బ్రకృతి యెల్లం బ్రసన్నముఖియై సాక్షాత్కరించుచంద

మ్మగుహృదయమ్మున నందాదులగు నాత్మబంధుజనమ్ముల
యాగమనమ్ము వార్చి మాతృగర్భమ్మునుండి నిజో
దయమ్మునకుం దెన్నులుచూచు శిశువువోలిక ముగ్ధ మ్మగు
భావమ్మున పరవశుడగు నాపరిజావిభుండు భద్రగజ
బృంహితమ్ము నుత్తమాశ్వహేషితమ్మును దన్ను మేల్కొ
లిపి నట్లయినం గన్నులు విచ్చిచూచుటయు లోకాంతర
శుభవార్తాహారిణియై యెదురువచ్చు నంచలకదుపు బారు
కట్టిన చందమ్మున నాగేంద్రకన్యకా ధవళధవళాకార
మ్ములు పరిథవిల్లుటయు. 37

వచ్చెను నంద తా నెపుడు వచ్చెనొ యెచ్చటనుండి వచ్చెనో
వచ్చుటగాక యువ్విభుని భావన లెల్ల ధ్రువమ్ముసేయు పెం
పచ్చుపడంగ నొక్కహృదయంగమ మంగళవార్త సెప్పె వి
ద్యుచ్ఛకితేక్షణుం డగుచు నుత్తమభూపతి హర్షమూర్తిగాన్.

క. ఉత్తమ మనుసంభవమ
యుత్తమవిభు చెవినిసోఁక నొదవుముదమునన్
చిత్తసుకుమార మగుశుభ
వృత్తము నెఱిఁగించు నంద నీక్షించి యటఁ. 39

ఎప్పుడు వచ్చితీవు మఱి యెవ్వరు వచ్చిరి తల్లి దండ్రి దా
మెప్పుడు వత్తు రింత కది యెల్ల వచించెదుగాక యంచుఁ దా
నప్పటిపారితోషికము నాయమ కర్హము నెంచి మాళిపైఁ
గప్పిన వెల్లపాగ కరకంజమునన్ దెమలించు వేళలన్. 40

చుట్టలుగొన్న శేషు మెయిసొంపులు దిద్దెడి మేటిపాగఁ దా
నట్టులె చూచి తేనిహృదయమ్ము నటం బసిపట్టి యెట్టెటూ
ఇట్టివి పారితోషికము లిందఁగఁ జాలెడి చిన్నికోడలున్
బుట్టినవార్త విన్నపుడు పోలునుగా కివి యంద నర్హానే. 41

వ. అని పలికి 42

గీ॥ కొడుకుపుట్టిన సంతోషవడినమనము
కువలయ మ్మేలుభారమ్ము కొంతకొంత
తాను దగ్గించు తలఁపుచందములు కొన్ని
మెఱసి నటులైన యాతేని నొఱసి చూచి. 43

వ. ఆ నంద సవినయమ్ముగా నమ్మహీపతికి మ్రొక్కి మహారాజ! సంభ్రమమ్ము వారింపుము. పుత్రిమాత్రి వ్రిదేయమ్ము లగునిట్టివి పారితోషికమ్ముల కే మర్హామగువార మె? అయి నను గృపాయత్త మ్మగు దేవరచిత్తమ్మున నేమికతమ్మ ననో యిట్టివేళఁ బొడమిన హర్ష కందళితమ్మగు నిప్పసద నమ్ము నొల్లననుటకు వెఱచెద. ఇట్టివి నాయట్టి వరవర్ణిణికిం గాక యెల్లవిధమ్ముల నీ మనసువచ్చినకోడలగు నాయనుం గుఁజెల్లెలికిం దగుంగాక. అట్టి శుభవార్తయు నచిరకాల మ్మునన విందుము. అది యెల్లఁ బదంపడి యవధరించెదరు గాక. ప్రస్తుతమ్ము నరయం బ్రార్థించెద నని సముచిత మ్ముగాఁ బలికినపలుకుల సమాహితచిత్తుండై. 44

ఉత్తమభూవరుండు తనయోత్సవమున్ బురిఁ జాటఁ బంచుచున్
చిత్తమువోని సత్కృతు లనేకము లర్థుల కిచ్చియిచ్చి క్రొం
గ్రొత్తసిరుల్ ఘటించె నెసకొన్న వసంతమహోత్సవాళికిన్
చిత్తము వేడ్కపెంపు ద్విగుణీకృతమై తగ నంద పల్కులన్. 45

వ. ఇమ్మెయి నయోచితమ్ము లయ్యు నవశ్యస్వీకరణీయమ్ము లగు సంభావనమ్ముల నెల్లపరిజనమ్ములకు నాప్త బంధు మిత్ర సమూహమ్ములకు నిఖిల పౌరలోకమ్మునకు దైవ గురుజనమ్ములకుం బరితృప్తి గావించి తనరాజ్యమ్మున బంధితులు లేమిం బిత్రాణమ్మునుండి తానె విముక్తుం డైన యాప్రజాబంధుండు వైశాలిదంపతులకు దిక్కాల విస్మనీంద్రునకు బలాక సాలపోతక ముఖ నిఖిల సఖజనమ్ములకు ని ప్ప్రియవార్త యెఱింగించి వారల నెల్లర రాఁ బ్రార్థింపం దగుజనమ్ముల నమ్మ్యైకడలకుం బనిచి విహిత విధీయమాన సకల కరణీయుం డగుచు నొకింతవిశ్రాంత మ్మగు మనమ్మున నంద యాడినపలుకులం దలంచుచు నప్పటికి దేవికి సన్నిహితవర్తిని యగు నామె రాకడ వార్చ్చ నెడల 46

క. ఒక నాగకన్య రాజబు
షికి మ్రొక్కుచు నెదుర నిలువఁ జిత్రితుఁ డగుచున్
ప్రకటింపుము నీ యీ రా
కకును బ్రయోజనము తెలియఁగా సకలమ్మున్ 47

వ. నిన్నుం బాతాళాధీశ్వరుం డంపెనో కో. యచటి విశేషమ్ము లెట్టి వనిన నదియు. 48

క. పాతాళవిభుని దూతిగ
నే తెంచితి కలవు కొన్ని యేకాంతమునన్
మీతోడఁ బలుకవలసిన
వాతనినఁడు లిదియు సముయు మగునో కాదో. 49

క. అన విని యే నవహితుఁడను
వినిపించెదుగాక యెల్ల వృత్తమ్మునన్
మును మీరు పనుప వీడ్కొని
అనఘా మాప్రభుని సుఖము లగుపయనమునన్. 50

పురమును జేరి రంత నొకప్రొద్దున నంద స్థిరప్రతిజ్ఞయై
యరిగెఁ దపమ్ము సేయ గహనాంతరభూముల కేఁగి యట్లు వ
త్సర మొకఁ డించుమించు కొనసాఁగెడి నింతకు వార్త రామి నో
నరవర! యామెకై దినదినమ్మును వార్చుచు విప్పఁగన్నులన్.

అరయుచు మిమ్ము వీడుకొనునప్పటి మాటల నెంచియెంచి, మీ
పురమున, కింతప్రొద్ధునకుఁ బూర్ణమనోరథ నంద వచ్చుటల్
తిర మనుబుద్ధియై వెడలి దేవి కుమారుని గాంచు వేళలన్
ధరణితలేంద్ర రావలసినన్, మఱి యచ్చట మాదు దేవికిన్. 52

కం. నందకుఁ దమ్ముఁడు చెల్లెలు
నందను మఱపించు రూపునం బుట్టెన, నా

సందడిపడి యాలస్యము
నం దేవరదర్శనమ్మునకు రానయ్యెన్. 53

వ. ఇయ్యపరాధమ్ము సయిరింప వేఁడెద. బహుళామహాదేవులు సుఖప్రసవలే గదా. నంద యియ్యెడకు వచ్చెనే, మహారాణియు రాజును బ్రత్యేకంబుగా మన్ముఖమ్మున నాయమకుం జెప్పినవార్తలుం గలవు. వారలంపినకానికలు రత్నావిశేషమ్ములా తల్లికి సమర్పింప నిది యవసరమ్మగునోకో. అనునెడల నంద యచ్చటకు వచ్చి నిజజననీనిర్విశేష యగు నాదూతిక సంభావించి యామెయాదరమ్ము వడసి స్వపురవృత్తాంతమ్ము సకలమ్ము నాయమ సంగ్రహమ్మునం జెప్ప విని ప్రమోదతరంగితహృదయుం డగునాప్రభుని యనుమతి వడసి యాదూతిక నంతిపురికిం గొనిపోయె. అవ్విభుండును నంద తపస్సిద్ధి యిట్టిదియొకో యని తలంచె. అంతం గ్రమమ్మున నిజపుత్రి ముఖచంద్రదర్శనోత్సుకుం డగు నారాజు హృదయమ్ము నెఱింగినయట్ల సుఖసంపన్నమ్ములగు నప్పురుటిదినమ్ములు సత్వరమ్మ కడచుటయు వైశాలిదంపతులు త్రికాలవేదిమునీంద్రుండు బలాశప్రముఖు లగు నాప్తజనమ్ములు నిఖిలపౌరవృద్ధులుం బరివేష్టింప నారాజు బారసాలపెండ్లికొడుకై పుత్రిసహిత యగు దేవి సందర్శింప నుత్సుకుం డయ్యె నంత. 54

## బారసాల

ఆ.వె॥ ఆత్రికాలవేది యనుమతమ్మునఁ జేసి
దేవి వాణి విఘ్నదేవుఁ గొలిచి
కల్పవిదుఁడు నగ్నికల్పుండు నైన వై
శాలి సలిపె బారసాలమహము. 55

నూనియలోనఁ బుత్రినిమనోహరవక్త్రిము రాజు గాంచె న
జ్ఞానములోన జ్ఞానమును గాంచినయట్లు మొయిళ్లగుంపులో
భానునిఁ దేనెలుట్టిపడు పద్మమునంబలె రాణి చూపఁగా
నానయుఁ సంతసమ్మును మనమ్మున ముప్పిరులాడు చూపులన్.

క॥ అనుమాన రహితముగఁ గొడు
కును జూచితె యనియె నొక్కకులవృద్ధ, కుమా
రుని మొగముపోల్కి చెప్పిన
విని నమ్మోద ననియె నొక్క వెలఁది ప్రియమునన్. 57

ఆ.వె॥ ఎవరిమొగముపోల్కి కేఁ జెప్పవలె నన్న
నెట్టువడెఁ గపోల మింతి కపుడు
చూడ, మొగము నీదుకోడలిపోల్కి నా
వృద్ధ మనసు మిగులఁ బ్రియముపడియె. 58

క. సరసాలాపము లిమ్మొయి
వరుసలు నొకకొన్ని నడువ వైశాలి యటన్

తెఱ తొలఁగించుచు ధరణీ
శ్వర సుతుపే రేమి పెట్టవలె నని యగున్. 59

క. గుసగుసలు కొన్ని నడచెను
ముసిముసినగవులను రాణి మొగము నృపతి యా
బిసరుహాలోచన పతి మొగ
మసివాడిగఁ జూచి యేక మగు భావమునన్. 60

ఆ. వె. అవ్వసిష్ఠుఁ గాంచి యఖిలవేదులు మీర
లేమితలఁచి రదియ నామ మనిన
అత్రికాలవేది నరసి వైశాలియు
నతనియభిమతమ్ము ననుసరించి

క. ఉత్తము లగు దంపతులకు
నుత్తమకాలమునఁ బుట్టె నుత్తమసుతుఁడై
ఉత్తమనామమ్మున నితఁ
డుత్తముఁడై మనువులందు నుత్తముఁ డగుతన్. 62

క. అని పేరిడు నెపమున న
య్యనఘులు దీవించి యుత్తమాధిపుచేఁ బ్రా
లను వఱియించిరి వ్రాలవి
యనిందితార్ధాన్వితమ్ము లయి యలరారన్. 63

నందయుఁ దండ్రియిచ్చిన ఘన మ్మగువస్త్రము లబ్బలాకుచే
తం దగఁగట్టనిచ్చె నట ధర్మమయుం డతఁ డిచ్చెఁ గొన్ని యా

నందమునం, బురీజను లనంతము లిచ్చిరి కాన్క లెల్లరున్
డెందము లుల్లసిల్లఁగఁ గడించి బహూకృతు లిచ్చి పేఁడొగిన్.

క. ఆశీర్వాదము లొసఁగిరి
వైశాలి ప్రముఖ విప్రవరులు ఘనజటా
శ్రీ శోభిల్లఁగ వారల
శాశాసానోక్తి మంగళాశాసనముల్. 65

క॥ అయ్యెడఁ ద్రికాలవేదియు
నయ్యందఱఁ గాంచి యింత లగుభాగ్యమ్ముల్
డయ్యెక డయ్యెక మన కిడె
నియ్యమ యని నందఁ జూపి యెలనవ్వొలయన్. 66

క॥ ఈవనిత తనదుదీవెన
లేవెంట ఫలింపఁగా నహిప్రియభూషున్
భావించి శంభు నవ్విభు
చే వరముల నంది యిట్టి సిద్ధులఁ బడసెన్. 67

గీ॥ తపముబలిమిని శివునిచిత్తమ్మొ యగుచు
నభవు మెప్పించి చెల్లెలి నందె నంద
ఉత్తమప్రభుకోడలి నుత్తమునకు
జాయ నభిరూప సుగుణసౌజన్యశీల. 68

వ. మఱియు మనువులలో స్వాయంభువుండు ప్రథముఁడును
స్వారోచిషుండు ద్వితీయుండు నెట్టులట్టుల నితఁడుత్త

ముఁడై పెక్కువేలేండ్లు భువనమ్ములు సుప్రశస్తముగాఁ బరిపాలించి బహువంశకరుం డగు ననుట యాదిగా నొక కొన్ని పలికి యమ్మునివరుండు తన తేజఃప్రసరమ్ములు సూర్యకిరణమ్ములు దీపశిఖలను జంద్రమస్సందీప్తులు కువల యమ్ముల నెట్లట్ల సభ్యహృదయమ్ముల నివిష్టమ్ములయి ప్రకాశింప నంతర్హితుండయ్యె. ఆసభాజనమ్ములకు శ్రీవిరూ పాక్షస్వరూపుఁడగు నమ్మహితు ననుభావబలమ్మున నుద్దీపిత మ్ములగు నాత్మలం బరమశివ సాక్షాత్కారానుభూతి గలు గుటయు వారలు 69

క॥ భద్రమయు భద్రవాహను
భద్రప్రదు నఖిలలోక పాలన సతతో
న్నిద్రుని రుద్రుని దలఁచిరి
కద్రుద్రాయేతి సూక్త కలితార్థములన్. 70

క॥ శతరుద్రీయమ్మున సం
శితవ్రతాఢ్యులు శివాభిషేకము సేయన్
శ్రుతి మహిత రుద్రగాన
శ్రుతిమధురిమ తెలిపె శ్రీవిరూపాక్షు శివున్. 71

వ. అంతట. 72

హాలహాలమును లీల నారగించినవాని
హేలమెయిఁద్రిపురమ్ము లిలను గూల్చినవాని

ఎల్లవిద్యలకు దా నీశానుఁ డగువాని
నెల్లభూతములకు నీశ్వరుం డగువాని
బ్రహ్మణోఽధిపతి నా బ్రహ్మాధిపతి నాఁగ
బ్రహ్మ నా శ్రుతిరూప పరమపురుషుఁడు నాఁగ
దేవతలలో మహాదేవుఁ డీశుం డనఁగ
సేవనీయుఁడు సదాశివుఁడు రుద్రుం డనఁగ
అఖిలవేదములందు నారూఢు డగువాని
నిఖిలాత్మ నిఖిలేశు నిస్తులుం డగువాని
అష్టమూర్తులు దాల్చి యఖిల మేలెడువాని
ఇష్టార్థముల నిచ్చు మృదుకటాక్షమువాని
ఎడమమేనను రాణి నెలమిఁ దాల్చినవాని
ఒడినున్న బాహులేయుని ముద్దుగొనువాని
స్వామి యా శ్రీవిరూపాక్ష శంకరుని హరు
శ్రీమల్లికార్జునుని శివు శుభంకరునిఁ బరు
కృష్ణవేణీ తరంగిణిజలమ్ములఁ జేసి
జిష్ణుఁ డానృపతి యభిషేకమ్ములను జేసి
సహజాని తీర్థప్రసాదముల్ సేవించె
మహిదేవులకు మేటిమన్నన ల్గావించె. 73

క. పుత్రోదయోత్సవమ్మున
ధాత్రీపతి యొసఁగుపసిఁడి దాఁ గొని రవి త
చ్ఛాత్రులఁ బనిచెనో యన న
క్షత్రము లొండొండఁ దోఁచె గగనపథమునన్. 74

గీ. బాలుఁ నోడిఁదాల్చు బహుళ సౌభాగ్య మరసి
చంద్రు నోడిఁదాల్చి పశ్చిమాశావధూటి
అనుకరించుట సైరింపనటు క్రమమునఁ
బ్రాచి యలరారె నాబాలరాజుఁ గాంచి. 75

క. అరయఁ జతుర్దశమనువుల
పరమకళల్ వీచిమేన భాసిల్లె ననన్
వఱలెను శుక్ల చతుర్దశి
సిరులను దనతల్లియొడివి శిశు వయ్యెడలన్. 76

గీ. దివ్యుఁ డుత్తమనందాతిథిని జనించి
విమల జయ భద్రరేఖలఁ బెంపుఁ జెంది
రిక్తతలు నిండ నాంతర రిపులయందుఁ
బూర్ణగుణముల నాబిడ్డ పొలుపుగనియె. 77

క. పదునాలుగుభువనమ్ముల
పదిలమ్ములు దెలుపు సార్వభౌమ కళాసం
పదలు ద్విదళమ్ము లయి పసి
పెదవులఁ జిఱునగవు లగుచు వేడుకచూపెన్. 78

శోభితచంద్రమస్సుతను శుద్ధచతుర్దశి మిన్నుకై వడిన్
భూభరనైకశీలుఁడు విభుండుగ నెన్ దనయాన్వితన్ సతిన్
శోభనముల్ తదాతన విశుద్ధులు నొక్కట మిన్నుముట్ట నా
వైభవముల్ వెలార్చెను శుభమ్ములు పొల్పుగ నన్నభమ్మునన్

గీ. ధరణిపతి చేయు భూతసంతర్పణమున
దివిని భువి నున్నవారలు తృప్తికొలఁది
తినియు వెక్కసమయి విడిచినపదార్థ
ములను దలఁపించె నక్షత్రములు నభమున. 80

వ. ఆ సమయమ్మునం దొక ముదుసలి ముత్తైదువ యన్నపూర్ణాదేవియట్టి దయ్యెడలకు విజయంచేయుటయుం, దొలుత నమ్మహారాజ్ఞి యామెం గని యెదు రేఁగి నమస్కరించి, తల్లీ! ఇది యెల్ల నీచల్లనిపలుకుల చలువగాదె యని యక్కుమారు నెత్తుకొన నామెకందీయం బరమహర్ష జడమ్ము లగుకరమ్ముల నప్పసిపాప నెత్తిముద్దాడి, బిడ్డా! వీఁ డుభయకులవర్ధనుం డగునని దీవించె. అవ్విభుండు నాతల్లి నుచిత రీతి నుపచరించె. ఇమ్మెయి నవ్యసంతతిలకాయమాన మ్మగు నుత్తముని బారసాలమహోత్సవమ్ములుచిత నిఖిల జనసంతర్పణమ్మై ప్రవర్తిల్లె అటగూడిన జనమ్ము లుచితప్రకారమ్ముల నాదంపతుల వీడుకొని తమతమ నివాసమ్ముల కరిగిరి. నందయు నిజానుజావలోకన కుతూహలమ్ము కడలుకొను మనమ్మున బహులోపలాలితయై యామెయు నాప్రభుండు నొసంగిన పలు తెఱంగుల కానుకల గొని వారలచే ననిపించుకొని మాతృసఖీ సహితయై యంభోనిధిమధ్యమ్ముననుండి చెలియలికట్టకుం బఱతెంచు వీచికయుంబోలె నిజలోకమ్మునకుం జనియె. వైశాలిదంపతులు నబ్బాలకుండు

నప్పుడ యుచితపరికారమ్ముల నప్రభుని కీర్తించెద. అతండు
వారలవెంటం దగుజనమ్ముల ననిపిపుచ్చె. అంత నాపుణ్యా
త్మవతుల మనమ్ములెపో తె. 81

## కాలసమన్వయము

క॥ అనుపమ మనుసంభవమున
ఘన మగు మన్మథ వసంతకాలము వెలసెన్
మునిరవి త్రికాలవిదుఁ డా
డిన పలుకుల తలఁపులకును టీకాకృతియై. 82

క॥ శతమన్యుఁ డగు సుశాంతియె
శతక్రతుపదమ్ము దాల్చుచందము దోపన్
కృత బహు తపఃఫలాకృతి
పితృప్రసువు రేఖ నంద పెంపువహించెన్. 83

గీ॥ అట స్వధామములు సత్యాలు నన శివులు ప్ర
తర్దములు వశవర్తులై తనరుపట్టి
వేల్పులో యన నొక వింతవిలసనమున
నుత్తమ ప్రభలగు తార లొప్పె మింట. 84

ఆ. వె॥ అవ్వసిష్ఠపుత్రుఁ డౌ సుతేజస్కుండు
నాసుతపుఁడు నాదియైనవారు
సప్తఋషితఁ గాంచు చందమ్ములను దెల్పె
చూడఁజూడ నొక్క చుక్కగుంపు. 85

గీ. ఉత్తమప్రభు పౌత్రు లజాదు లట్లు
కొన్ని తారలు మెఱసెఁ గొంగ్రొత్తసిరుల
వారియన్వయమునఁ బుట్టు ప్రభులఁబోలె
గగనమెల్లెడఁ దారక ల్గడలుకొనియె. 86

క. ఒగి స్వారోచిషు నధికృతి
ముగియఁగ నటఁదోఁచు నుత్తముని యంతరమై
జగ మేకసప్తతి మహా
యుగములు వర్ధిల్లుపొలుపు లొక్కట నొలసెన్. 87

పాతాళేశ్వరుఁ డుత్తమాభిధ మనుప్రావిర్భవాకర్ణన
ప్రీతిం జేసినయుత్సవమ్ములు సుతావిర్భావమోదమ్ములై
జ్యోతు ల్పొల్చె నభోంగణమ్మున నిశాశోభాజరీజృంభణ
స్ఫీతాలంకృతులై విసృత్వర ఫణావిభ్రాజిరత్నమ్ములై. 88

క. జనియించి పితృప్రసువున
ఘనకాలతమఃకుమారి కని చుక్కలనం
జను బిడ్డల మినుపొందున
మనుపత్ని యనం గ్రమక్రమమ్మున నొప్పెన్. 89

గీ. చుక్కలనియెడిముక్కోటిసుతుల యాట
లెంచి పనివడి తనతల యెత్తిచూచు
నదితిమోమున ఘుసృణరేఖాంకమహిమ
లెఱుకపఱిచెను బహుళాష్టమీందులేఖ. 90

వ. ఇమ్మెయి నిఖిలవిషయ నిదానమ్మగు జ్యోతిశ్చక్రమ్ము
క్రమక్రమమ్మున బహుముఖ వర్ధిష్యమాణమ్మగు నయ్యు
త్తమమనువు వంశమహిమమ్ము నభ్యుదయమ్ముసూచించు
చుండ నబ్బాలుండు దినదిన ప్రవర్ధమానుండగుచు: 91

ఆ. వె. నురుగుపాలతరఁగ సిరులపొత్తిళ్ళలో
నరిదిబిడ్డ పొరలియాడువేళ
కెరటులాడఁ దొడఁగె హరి మత్స్యలీలలు
సారెసారె కనిమిషత్వరములు. 92

ఆ. వె. తల యొకించుకెత్తి ధరణిపై నురమాని
బారసాచి పట్టి ప్రాఁకువేళ
పాలకడలి సిరులు పండినచూపుల
కూర్మవిభుని సొగసు కొనలుసాఁగె. 93

క. అఱచేతులు మోఁకాళులు
నెఱయఁగ ధర నూని బురద నెఱసినయొడలై
ఎఱిఁగించె శిశువు కిరిపతి
నెఱగతులకుఁ దాను గొన్ని నేర్పినతీర్పుల్. 94

క॥ ముంగురులు గ్రాల మొగమున
చెంగున నెగురుచును విప్పుచేఁదమ్మిసిరుల్
నింగి వెలుంగఁగ నరహరి
సింగారము లొక్కకొన్ని శిశు వెఱిఁగించెన్. 95

క॥ వెకయడుగు లిడుచుఁ దన కను
పడువస్తులు గొనఁగ నర్థిపడుగుగఁ జని పైఁ
బొడవుగఁ బ్రాఁకుచు వామను
గడుసుఁదనమ్ములకు వింత కఱఁదులు నేర్పెన్. 96

క॥ తనతన కయిఁ దనుఁ బిలిచిన
జనకునికయి వ్రాలినట్టి చంద మ్మగుచున్
జననికయి వ్రాలి యటు త
త్ప్రణయము ఫలియింపఁ దెలిపె భార్గవులీలల్. 97

క॥ విల్లమ్ములాటఁ గొండొక
విల్లెక్కిడ విఱుఁగు టరుదె వేధాస్ఫురణన్
పిల్లని త్రిశుద్ధిసిద్ధులు
చల్లఁగ శ్రీరామచంద్రు స్మరణకుఁ దెచ్చెన్. 98

గీ॥ పాలుచిలికెడి తన ముద్దుపలుకుబడుల
వెన్నముద్దలపోలిక వెలఁదిపించు
నిండుమదు లాచికొనుటలు నేర్చి తెలిపె
బాలుఁ డొకకొన్ని శ్రీకృష్ణలీలలపుడు. 99

గీ॥ తోడిపిల్లలతోఁ గూడియాడి వారు
కలహాపడి రేని దా మాట కలుపకుండి
తగవు దిద్దెడి నేర్పరితనము మెఱసి
ప్రకటపఱచెను దన బుద్ధవైభవమ్ము. 100

క॥ క్రీడనకాశ్వము నెక్కుచు
వేడుక నూఁగిసలుపెట్టు విభ్రమలీలా
ప్రౌఢిఁ దన కల్పితంబు మా
మ్రేడితమై చిన్నిబిడ్డ మెఱపులు మెఱసెన్. 101

క॥ శిశు విష్ణుయి బాల్యదశా
దశావతార పరిభావ దర్పణ లీలా
వశ పితృ హృదయాంబరమున
నిశాధిపతి యగుచు సొగసువిగ్గులుసింపెన్. 102

క॥ పంచవసంతప్రాయు
మ్మంచితముగ దైవభావ మట నెఱసిన (శ్రీ)
పంచాక్షరి బాలుని ది
ద్దించిరి గురు లమలబోధ దివ్యజ్యోతిన్. 103

క॥ గురుబోధశ్రవణమ్మున
నుఱిమినఁ బురివిచ్చు నెమలి యొసుగక పయిపై
తొఱఁగిన జలధారల ను
ర్వర యనఁగా ఫలితబోధ బాలుఁ డెసఁగెన్. 104

గీ॥ అరుణకిరణ ప్రసారమ్ము లంటునంత
నఖిల జలజాళి విచ్చినయట్లు గాఁగ
గురువచశ్శ్రుతిఁ దన్మతిఁ బరిఢవిల్లె
ప్రాక్తనమ్మైన విద్యాప్రపంచ మెల్ల. 105

గీ॥ పూర్ణ శరదిందుబింబమ్ము పొడుపుఁగాంచి
కైరవకులమ్ము వికసించుకరణి నెసఁగె
గురుని దర్శింపఁ బ్రతిభ నంకురములగుచు
సరస కవితా కలాపాళి సౌరభములు. 106

క. ఏకాదశ వత్సరమున
నేకాదశ రుద్రమూర్తి కెనయగు ననుచున్
గైకొని యుపనయనోత్సవ
మాకుఱ్ఱని కలరఁ జేసి రాతలిదండ్రుల్. 107

గీ గురుఁడు వైశాలితోడ నాకొడుకుఁగుఱ్ఱ
యధ్యయన మొనరించె వేదాళి నెల్ల
గురునికనుబామ మున్నీటికెరడు గాఁగ
తనగళధ్వని జలధినిస్స్వనము గాఁగ. 108

క. హరిశార్ఙ్గనిస్స్వన మ్మయి
హరి మురజరవమ్ము నగుచు హరి యాడెడు ను
ద్ధుర దర గంభీరధ్వని
పురణించెం బాలు గళసముజ్జ్వలభంగుల్. 109

క. సకల క్షత్రియవిద్యా
నికష మ్మాప్రౌఢశిశువు నిఖిలమ్మృదుకలా
ప్రకట కలాపూర్ణుం డయి
వికసించెన్ వజ్రకుసుమ విలసనలీలన్. 110

క. తన దాసభావ పూర్ణత
నెనసిన మిత్రత్వమహిమ హితదర్శనుఁ డ
య్యును దుర్నిరీక్షతను గనె
ననయము నృపసుతుఁడు నవ వయశ్శ్రీ కలిమిన్. 111

వ. ఇమ్మెయి నబ్బాహులేయుండు నాగేంద్రకన్యాలలామమ్ము నకుం దోడినీడయుంబోని యౌవరాజ్యలక్ష్మి పాణిగ్రహణమ్మునకు సమర్హమ్మగు నెల్ల సౌభాగ్యమ్ములకు భాజనమ్మగుట యెఱింగి వైశాలివప్రిబోధమ్మున నిఖిలపరిజానుమతమ్మునం దిక్కాలవేది సాలపోతక బలాకాది సకల గురు బంధు మిత్ర జనసమక్షమ్మున నఖిలప్రకృతిరంజకమ్ముగా విచ్చేసిన యొక్క వసంతమ్మున నయ్యుత్తమమహీజాని చిరకాలమ్ముగఁ దమహృదయమ్ము లెదుర్చుచూచు కుమారయువరాజ పట్టాభిషేక మహోత్సవమ్ము సంతరించి ధన్యచరిత్రుం డగునంతట. 112

## అభినవ వసంతము

క. భవ్యోత్తమ మనుమిథున
శ్రీ వ్యంజకమై యొసంగెఁ జిత్రాచంద్ర
శ్రీ, వ్యపగతశిశిర మ్మయి
కావ్య నభస్తరు లతాంత కమనీయమ్మై. 113

సీ. ప్రణయినీకంఠ సంభ్రమవిభ్రమము చిందె
కలకోకిలాంగనా స్ఖలితగళము
నవపల్లవారుణచ్ఛవి చూపె బాలికాఁ
ధర ముహుఃకృత మిధఃపరిచయమ్ము.
కిసలయోష్ఠి కిలికించిత మ్మొఱఁగించె
బహు చిత్ర సుమనః ప్రభాసపటలి
పరిత స్స్ఫురద్గంధవహ కుమారుఁడు సాఁటె
సారసాక్షీ భావ సౌరభమ్ము

ప్రతిపదమ్మును ధ్వనిరసాస్పదము లగుచు
సుకవి బుధ కావ్య మధురిమస్ఫురణ లరిసె
భువనవిజయోత్సవారంభ ముఖరితములు
మాధవస్వామి కొలువైన మధుర వేళ. 114

సీ. ఖండితాహంకార కలగళమ్ములు పల్కె
ఝంకారముఖరాఁళిసంకులములు
పోషితయువతికపోల బాంధవ మంది
రేయెండ మిన్నంటు తెచ్చికాసె
హిందోళరాగైక సందర్భపరవశ
దిగ్వధూగళము ప్రతిధ్వనించె
భూనభః క్రీడాభిపూర్ణ వసంతమై
సంజకెంజాయ ముచ్చటలు గొలిపె

శపథ సంప్రార్థనా చాటుశత శిథిలిత
కోప శిశిరాంగనాజన గూఢహృదయ
విలసనక్రమ వికసనవిభవ శోభ
సంతరించెను జాణ వసంతలక్ష్మి. 115

గీ॥ పార్వతీ మధురాధర బాంధవములు
శంభు నయనాంత రాగమంజరులసిరులు
మహిత రతిదంపతీ మనోమధురిమములు
అలమె జగమున నామని యరుణిమములు. 116

పూచిన మావితోట నొఱపుల్ సరిదిద్దెడి మింటితోరివలన్
దోఁచెను సంజ చా విలువుదోపులుగొన్న కిసాలయచ్ఛవిన్
వేచినయట్లుగా మధుర విభ్రమకంఠము నొత్తి పల్కె, నా
చూచినచందముల్ సుకవి సూరిజనమ్ములు మెచ్చఁ గోకిలల్.

నూతననూత్నమై బహు జనుస్స్మృతిభావపరంపరా ముహు
ర్ద్యోతకమై ప్రియా మృదుగళోదయ బద్ధసఖిత్వ మంజిమ
స్ఫీత పికోదితమ్ము రసచిహ్న జగన్మయ భవ్యకావ్య ల
క్ష్మీ తిలకప్రభమ్ము మెఱసెన్ బహుళోత్తమ భావపుణ్యమై. 118

ముప్పదియాఱు తత్త్వముల మూలము దానయి యిర్వదేనుగా
నొప్పెడులీలలన్ జగము లొక్కట నేలు మహామహమ్ము మైఁ
గప్పిన చీఱవన్నెలనఁగా విలసిల్లె వసంతజృంభణ
మ్మప్పటిఁ బుట్టు పెన్గరడులై శివభక్తుల చిత్తవృత్తులై. 119

ఆ వేళన్ బహుళామనోహరుఁడు సర్వాంత స్సదాభాసమా
నైవంరూప వచోఽతిదుర్లభ విరూపాక్షప్రభు ప్రాభవ
శ్రీ విచ్ఛిత్తివిశేష హర్ష జడ వాగ్రేఖా విలాసమ్ములన్
సేవించెన్ సకలేశ్వరేశ్వరు సతీశృంగారితార్ధాంగునిన్ 120

ఆమ్నాయమ్ములు వందులై హరియె తా నర్ధాంగమై జాజ్వల
ద్ద్యుమ్నాంశమ్ములు సూర్య చంద్ర శిఖి విద్యున్ముఖ్య తేజమ్ములై
ద్యుమ్నద్యుమ్నము కాలకాలమమృతాంధోమల్లి కామాళియా
నిమ్నాచ్ఛైశపద దూర గాఢకరుణా సర్ణిద్రముం గొల్చెదన్

విష్ణుబ్రహ్మ మిధోముధాధికపదాపేక్షా ప్రయుక్తాత్మ వ
ర్థిష్ణు క్రూర మహాస్త్ర శాంతికరణాదేశమ్ము లజ్ఞాతరో
చిష్ణు స్స్వీయ మహస్తనూ విధివిధుల్ జిష్ణుల్ మహాలింగరా
జిష్ణు ప్రప్రథమావతారములు పోషించుం జగద్భద్రముల్. 122

స్త్రీపారమ్య విదూష కాంఘ్రిభజనశ్రీ మత్త భృంగీశ సే
వాప్రాగల్భ్య పరీక్షణచ్ఛల కృతవ్యాఖ్యాన లీలాకృతి
స్త్రీపుంసాద్వయ మూర్తి దివ్యకరుణా స్నిగ్ధప్రబంధావళీ
వ్యాపారమ్ములు మంగళమ్ము లొసఁగున్ వాగర్థదాంపత్యముల్

నటనోద్యన్మృదుపాదపద్మ కటకన్నాగేంద్ర రత్నస్ఫటా
స్ఫుటబింబ న్నిజనాట్యబృంద మహితాంభోజాక్ష ముఖ్యామరో
త్కటవిద్యా పరిశిక్షణమ్ములు సతీ వాంఛాధికాభీష్టముల్ [ల్
ఘటియించున్ శివతాండవమ్ములు జగత్కల్యాణసంతానము

మూర్తిత్రయ్యుపసేవ్యమానము త్రయీమూలమ్ము సర్వక్రియా
పూర్తి ప్రప్రథమాభిపూజ్యము కృపాపూర స్వరూప త్కరం
బార్త త్రాణపరాయణమ్ము నిజదంతాగ్రాగ్రధారా త్రుట
ద్ధూర్త క్రూర గజాసురమ్మును భజింతున్ విఘ్నమార్తాండమున్

అందూషు ద్ద్విష జ్జలంధర శిరోహారిక్రియా దర్పణ
ద్బృందారక నిజాక్షిపద్మ కృతభక్తి ప్రీణనాకార ము
ద్గేందూత్తంస కృపాసుదర్శనములన్ మృత్యుంజయాక్షిప్రభా
స్యంద ద్బిందులు చక్రదాన కృతలీలాంఘ్రిస్మృతుల్ ప్రోచుతన్.

బ్రిహ్మాంతమ్ములు బ్రహ్మముల్ శివుఁ బరబ్రహ్మమ్ముగాఁ దెల్పినన్
బ్రహ్మిష్ఠుం డగుశన్నతంఘ్రియుఁ దదర్థంబున్ బ్రబోధించినన్
జిహ్మస్వాంతత ధిక్కరించిన విరించిన్ శిక్షితుం జేయు నా
బ్రహ్మమ్మన్య శిరోగ్రసన్నఖర ధారాధోరణుల్ ప్రోచుతన్

శివభక్తాగ్రసర ద్గజాసుర మనస్సింహాసనారూఢ త
ద్భవ వీక్షోన్మనఉత్క నాట్యకృతివిద్య ద్విష్ణు విస్మాపక
స్తవనీయ ద్విపచర్మధారణకథా సారస్యసంపన్న మూ
ర్తివిశేషమ్ములు ప్రోచు సర్వ శివభక్తిస్ఫూర్తిమత్కీర్త్యముల్

ప్రాణిధ్వంసక కాలభీతమతి మార్కండేయ నిత్యాకృతి
స్థాణు శ్రీగళ కాలకాల ముఖ సంజ్ఞారూఢ తేజోవిని
ద్రాణమ్ముల్ సకలార్త జీవనపరిత్రాణమ్ము లేణాంకదృ
క్కోణజ్యోత్స్నలు ప్రాణిసస్య దిశపత్తూలంకషల్ ప్రోచుతన్,

సోహంబ్రహ్మవివాద జృంభిత శివన్యక్కార దారూభవత్
ద్రోహాస్వాంత మునీంద్రదారువః భక్త్యున్మేష వాసంతరే
ఖాహంకార దినోదయ ప్రకటటీకాకార సౌందర్య ల
క్ష్మీహాసమ్ములు గొల్వుదీర్చుతను మచ్చిత్తాంబుజామోదముల్.

అక్షిర్యోజ్జ్వలమంగళాకృతి మహాహంకార సర్వక్రియా
దక్షమ్మాన్య కృతఘ్నతామయ మునీడ్దర్పాపహారస్ఫురత్
శిక్షామూర్తి శ్రితావనామృతరసస్నిగ్ధమ్ము మద్భావనా
ధ్యక్షమ్మిచ్చుత భద్రభద్రము కృతార్థత్వమ్ము నెక్కాలమున్.

మౌనవ్యాఖ్యానముద్రాంబరతల విలసన్మంజుహాసాత్మరేఖా
మౌనిధ్యానాబ్ధి జాగ్రన్మహితశివకలా మాధురీ చారులీలా
శ్రీనిర్ణిద్రాణ మేధాంచిత సకలకలాస్నిగ్ధ వాగ్దర్పణాళీ
పౌనఃపున్య మ్మొసంగున్ బదఃతజనతా ప్రార్థనాసిద్ధిలక్ష్మిన్ 132

సర్వ స్త్రీపురుషాంతరాంతర జయోత్సాహ ప్రవృద్ధ స్ఫురత్
గర్వాంధ స్మర భస్మసాత్కరణవిద్యా ధూర్వహాక్షిప్రభా
సర్వస్వమ్ములు మోహసంతమస తేజస్సంపదల్ పార్వతీ
ధైర్యస్థైర్యపరీక్షణమ్ములు జగత్త్రాణమ్ము లేలున్మమున్. 133

వసంతశ్రీ రామావతరణకలా వల్లభమ్ముల్ నిదాఘ
ప్రసారాసారేక్షాప్రభవ ఫలసంపన్న సస్యౌఘ వర్షా
లస త్కృష్ణాకా రోల్లసన శివకల్యాణ మాధుర్యలక్ష్మ
ప్రసన్నమ్ముల్ గౌరీ బహుముఖ తపోభాగ్యముల్ ప్రోచుగాతన్

గౌరీకల్యాణవేళా స్ఖలితశతధృతి క్షాళనా సృష్ట భూభృం
గా రూత్పూర్ణాంబునా రాకలిత లలితవ త్కామినీరూప గంగా
ధార శ్రీమత్కపర్దాంతర రసకసుమ త్కాంత సానూయవీక్షాం
కూరస్వైరప్రఫుల్లత్కువలయమహాముగ్ధాక్షు విస్తారసిద్ధుల్.

జామాతృద్వేషి శాపక్షయగద బహుళచ్ఛన్న జైవాతృకశ్రీ
కామి శ్రీమాతృరేఖాశ్రిమ గగనధునీ గాఢసఖ్యార్కకన్యా
శ్యామోచ్చైర్వీచిపాళీసఖములౌసగుతంజంద్రచూడాలజాగ్రత్
ప్రేమాంభోధాన వీచీవినిమయ కరుణావీక్షణమ్ముల్ శుభమ్ముల్

ఋతుసంహార లసన్ముఖాంబుజ పితృప్రేమస్ఫుటాదర్శ ద
ర్శిత షడ్వక్త్రపరంపరా మధురమూర్తి శ్రీ నిదానమ్ము రా
జిత నేత్రాంబుజబంధు దత్త జగతీశ్రేయమ్ము షాణ్మాతుర
మ్మతిలోకాద్భుతశక్తిభూషి హరికన్యావల్లభ మ్మెలుతన్ 137

నిర్యద్దుర్వ్యాహగర్వసంభృత తపోనిర్ణిద్ర రక్షఃపతి
స్వారాజ్యోద్ధత పత్తనత్రయ జయ భ్రాజజ్జగద్భద్రముల్
ధుర్యబ్రహ్మధనుర్ధ్వనిధ్వనితముల్ తూణీర వీచీచ్ఛటా
పర్యాయాచ్యుతబాణ వేగగమన ప్రాధ్మాతముల్ ప్రోచుతన్

వేదద్రోహక సోమకాసుర వధావేశాబ్ధివీచీ పునః
ప్రాదుర్భూత రసాఘుష క్రకచదంష్ట్రాగ్రంత ర్మ్రేడీహార, స్వా
వాది గ్లానవఖండ మండనరమా మాధుర్యముల్ ప్రోచు ద
ద్ధ్వైధున్యుజ్జ్వలభంగ భంగకలనా ధూర్తప్రచ్ఛా [illegible] కృతుల్.

క్షీరాబ్ధ్యుత్థిత హాలహాల గిలనక్రీడా పరిష్కారముల్
స్వైరాహంకృతి భిన్నవృత్త ఫలిరాట్సంరంభశిక్షాస్మృతుల్
హారబ్రహ్మకపాల సల్లపన సౌఖ్యాఽజ్ఞాత మంధాచల
క్రూరోద్ఘటన కూర్మకర్పర మహాశకూలంకషల్ ప్రోఁచుతన్.

సౌందర్యాపరదుగ్ధసాగర రమాజాగ్ర జ్జగన్మోహినీ
కందర్పాగమబోధకాంబుజదళాక్షమ్ముల్ విరూపాక్షముల్
స్యంద న్మందర మంజరీ మధుఝరుల్ సార్ద్రీభవ న్మోహినీ
సఁదర్భమ్ములు భైరవోదయ కథాసారస్యముల్ ప్రోఁచుతన్.

అవనీచక్రి కటభ్రమీకృతి హిరణ్యాక్ష ప్రదాఁక్రియా
భువనోద్ధార వివృద్ధదర్ప దవశస్ఫూర్జ న్మహావేశ దు
ర్వ్యవశాత్మాదిమఘోణి శిక్షణ జరీజృంభ త్కిరాతస్వరూ
పవిశేష త్కిటిదంతధారణకథా పారమ్యముల్ ప్రోఁచుతన్ 142

రమణీయాద్రిశిరో హిరణ్యకశిపూరస్స్యంది రక్తాపగా
క్రమ సంధ్యారుణిమార్ద్రచంద్రిఁదః ప్రోద్భాస్య మిథ్యాహరి
భ్రమ నిర్వాపణసాక్షి తన్నృహరిచర్మ ప్రోక్తగాథా శ్రుతి
ప్రమనోద్దీపి గజాఽజినాంబర కథాప్రాగల్భ్యముల్ ప్రోఁచుతన్

బలభి ద్దుర్లభ విశ్వదానకలన ప్రోద్ధాత్మశక్తి స్ఫురత్
బలి విధ్వంసన పాండితీచతుర దంభబ్రహ్మచారి ప్రబో
ధ లసచ్చిహ్న తదస్థిధారణకథా తాత్పర్యసంభారముల్
పొలుచు న్నిర్గతపక్షపాత లలితమ్ముల్ విశ్వరక్షాకృతుల్. 144

విద్యాస్థాన విసర్ణము మ్మొకటిఁగియున్ విశ్వేశు నాస్థానిలో
ఛిద్యత్ప్రాణ్యుఁడు వ్యాసుఁడొక్కయెడలన్ జేయెత్తినోద్దైవతమ్
విద్యేతాఽత్రహరే రతిచ్ఛలవచో విద్ధ్యద్భుజాస్తంభుఁడై
సద్యశ్శ్రీహరిబోధితుం డగు కథాసారమ్ము నర్చించెదన్. 145

చైతన్యమ్మయి పూర్ణమై యచలమై సర్వాత్మమై యేకమై
జ్యోతీరూపము లింగమై పరమమై సూక్ష్మాతిసూక్ష్మమ్ము నై
ధ్యాతవ్యమ్మయి బ్రహ్మమై శివ మనాద్యంతమ్ము పంచాక్షర
స్ఫీత మ్మా బహిరంతరస్ఫురిత మర్చింతున్ జగత్ప్రాణమున్.

హారితాత్రిప్రముఖాఖిలర్షి హృదయాహ్లాది స్వరూపమ్ము శ్రీ
హరిధాత్రాది సమస్తదైవత శిరోనర్ఘ్య ప్రదీపమ్ము భా
సురబాణాసుర రావణప్రముఖ రక్షోజ్ఞాతరూపమ్ము దాఁ
గరుణించున్ సలభార్గవాది నృపరక్షారూప మశ్రాంతమున్.

అని ధ్యానించు నృపాలు నెట్టెదుర సర్వామ్నాయసారమ్ము భ
క్తనిశాంతమ్ము తనూవిషజ్జలదరేఖాకాంత కాంతాన్విత
మ్మనుకంపాపరిణామ గాంగఝుర మంకారూఢపుత్రమ్ము వా
లినిశానాథకళమ్ము వెల్గొకఁడు పొల్చెం జక్షురానందమై 148

క. బహుళాఽనందాకార
స్పృహణీయ కలావిశేషరేఖాఽకృతులై
అహిభూషలు కనువెలుఁగులు
మహేశురూపమ్ము నృపతిమతిఁ బొడసూపెన్. 149

క. ఆ యుత్తమభూమీపతి
జాయాపత్యాన్వితుండు శ్రద్ధాజ్ఞాన
శ్రీయుత విధి యగు నితఁ డో
హో యనఁ గీర్తించె శివకథోదాహృతులన్. 150

ప్ర థ మ

క. కల దఖిలలోక కారణ
విలాసినీ చిత్తవృత్తి విభ్రాంత బహు
చ్ఛల జీవావనరూ పో
గులింగలీలమ్ము శ్రీవిరూపాక్ష మనన్. 151

క ళి క

పున రనన్య పంచకృత్యమూలభూత మృదులహాస
పోషితాఖిలప్రపంచ మూర్ధ వదనపంచకమ్ము
ఘన తపోవినిద్ర శైలకన్యకా పరీక్షణ ప్ర
కారఘటిత వర్ణిరూప కపటవచన కంచుకమ్ము
నిజతనూ ప్రభావిశేష నిర్ఝరాపగా తరంగ
నిచిత యామునప్రవాహ నిజసతీ విభాసురమ్ము
నిజ కృపాపయోధి చర దః మిష దబ్జనయనదళిత
నిఖిలలోక పాపరూప నిగమచోర కాసురమ్ము
త్రిజగ దవనశీల పాదస్పృష్ఠ కమఠరాజరాజ
భృత సమస్తలోక భద్రబృందభార మందరమ్ము

రజతశిఖరి కటక చరణ ర_క్త చరణసౌకుమార్య
రసిక పాణికమల దార రమ్యభావ సుందరమ్ము
ద్విజసుతావన ద్విగుణిత వృషభ తురగపల్లన ప్ర
విచల దభ్రసరి దభంగవీచి ఫణిఫణాన్వితమ్ము
విజయమంగళ స్వరూప వినత ఘోణి రదనకదన
విమల జాటజూట లసిత విశద శశికలాంచితమ్ము. 152

ఉ త్క లి క

నిజ మహ_త్వకదన కుపిత నీరజాక్ష నీరజాండ
త్రిజగ దపకృతిప్రవృద్ధ దీప్ర నిజ మహాస్త్రకాండ
పరిజని తోగ్రదహన శమనపరమ పరమలింగరూప
భుజగకటక శీర్ష పాదమూల దర్శనానురూప
విహగ దధఃప్రచార సుకర విధృత ఘోణి హంసరూప
హాయి రయప్రచార గుణిత హరి విరించి దుర్నిరూప
భుజగశయన విధివిహాసి భూష ణాఽహిరత్నమహము
విజయమంగళార్థవిహిత విమల భవ్య దివ్యమహము 153

ద్వి తీ య

క. అమరేశ్వరసఖుని విరూ
పాక్షు మహాదేవు నభవు నాదిమభిక్షున్
రక్షస్సురసంపూజితు
త్ర్యక్షుని బంపాప్రవాహ దమలకటాక్షున్ 154

కలిక

వెండి ముని హృదయారవింద మృదుగంధముల
విందయిన చందముచవిం దెలుపు మెయివాని
కొండరాచూలిమది కొండొకవికల్పముల
కుటిలవీక్షల మేలిగొన మెంచుమెయివాని
వెండికొండ నెగాక పిండుగొని యెల్లెడల
విడిదిచేసిన మేని పెంపుసొంపులవాని
పండువెన్నెలరేక పసిమిసంపెఁగజోఁక
పండించు ముడిజడల వన్నె కెంపులవాని
గండుకొని కాలుఁడు మృకండుసుతుఁ జేరఁ బెడ
కాలఁ గాలుని దాఁచి కాచి ప్రోచినవాని
కొండ యొకవిల్లుగాఁ గుండలియె నారిగాఁ
గొనగంటఁ దిగ(ప్రోళ్ళు గూల్చి పేర్చినవాని
కండగొని రాకాసి కలుచనెత్తురు ద్రావి
కసరుగొను వెడహారికిఁ గలఁక లార్చినవాని
చండవిక్రముఁడైన సామజాసురుఁ గూల్చి
జయభద్రములు సర్వజగతి కిచ్చినవాని. 155

ఉత్కలిక

వెడవడుగు పొడవుగొని ద్విరదగతి నిలుసొచ్చి
యడుగు లొకమూఁడు దన కడుగ నిచ్చను మెచ్చి
మెచ్చకయుఁ దనయొజ్జ మెలపుబలుకుల నొచ్చి
వచ్చినాతఁడు లచ్చివలపువాఁ డని నచ్చి

యిచ్చితిని గొనుమన్న యెలమి కెంతయు జెచ్చి
జిచ్చపా టొదవంగ రిక్కదారులు చొచ్చి
తనదాత తలఁదొక్కి తగవు దీర్చినవాని
ననిమిషాసురశిక్ష లలర నేర్చినవాని 156

తృతీయ

క. పొలిచినభక్తిని సిరి కుచ
మలరంగాఁ గోసి తనకు నర్చనసేయన్
మొలచిన శ్రీవృక్షమ్మున
దళముల కెద హెచ్చుమెచ్చు దైవముచేతన్. 157

కళిక

వెండియు హరిగతి వెలికన్నిడు నిలు
వెజ్జగు కన్నప పెనుచు నభవుచే
కుండలిపూజా క్షుభిత మ్మగుహరి
కుందు వెలార్చిన గురుఁ డవు భవుచే
శుండాలార్చా క్షుబ్ధ మ్మగునహి
సొంపులుదిద్దిన సొబగులగనిచే
తీండ్రించిన నత్కీరునిఁ బూజరి
తెఱఁగున దీర్చిన తెఱఁగులగనిచే
అనుపమ మగుపిరియ యళిచికురమ్ముల
ననితర పరిమళ మరయు రసికుచే

తనుతంతుల నిలు తన కిడులూతకుఁ
తనపద మిచ్చు నుదారరసికుచే
శుండాలానన శుండామార్జిత
శుండాలాజిన శుభ్రద్యుతిచే
గాండీవధనుః కలితకలా సం
గత ముకుటతటీ కమ్రద్యుతిచే 158

ఉత్కళిక

మఱక మధురగతి మఱిమఱి తలఁచిన
పెఱతెరువులఁబడి విసువక కొలిచిన
మఱచియు నొకపరి మదిలో నాచిన
తఱచితఱచి తనతత్త్వము చూచిన
మఱిమఱి యొకపరి మహిలోఁ బుట్టని
పఱిపఱి చెదురుచుఁ బలుమఱు గిట్టని
అమృతపద మ్మిడు నజరామరుచే
విమలపదాశ్రిత విశ్వామరుచే. 159

చతుర్థి

క. ఆనందకాననమ్మున
నానందాకృతి నెసంగి యఖిలాశ్రిత వాం
ఛానూన దానదీక్షా
దీనకటాక్షములఁ బఱపు దేవరకొఱకున్. 160

కళిక

మఱియు రావణమస్తకాంబుజ
మధురపద సురతరువునకునయి
చెఱఁగి రాజులఁజీరు రాముని
శిత కుఠారముగురువునకునయి
కుపితరాఘవ కులిశనిష్ఠుర
కుటిలవీక్షా ప్రిభవమునకయి
త్రుపితయాదవ సంయమీశ్వర
శాపజాగ్రి ద్విభవమునకయి
పదియురెండగు తీర్థములలో
పరఁగు జ్యోతిర్లింగమునకయి
ముదిసిముదిసియు మూఁడుజగములు
పొదివి ప్రోచెడు జంగమునకయి
ఝషపతాక విదాహదోహాల
చటుల వీక్షాపూరమునకయి
వృషభ సుందరగమన విభవో
ద్వీక్షణాఽశ్రిత వారమునకయి. 161

ఉత్కళిక

నవనవోజ్జ్వల నాట్యాకృతి కై
తవ సుబోధిత తత్త్వమయి కై

రవసుహృ ద్రిచిరశిఖ మయి కై
రవభిదా భిదురమ్ము నవు కై
దువఁ ద్రిమూర్తులు తోప బహుకై
తవము లార్చుసదాతనము కై
లాసవాస విలాసమునకై
లాసలీలాఽవాసమునకై 162

పంచమి

క. శ్రీరుచిర తుంగభద్రా
కార నిజాకార శీర్ష కలితేందుకలా
సారమయ తుంగభద్రా
పూర కృతార్థాశ్రితౌఘపుణ్యముకంటెఁ. 163

కళిక

మఱి కలదె దైవ మనుమహితమార్గము పట్టి
మెఱమెఱల దిగద్రావి మృదునిపాదము పట్టి
నిగమాగమ పురాణ నిశ్చితార్థము కంటె
అగరాజకన్యా విహారరంగము కంటె
అని తెల్పుగురుబోధ లాత్మఁ జిక్కఁగఁ బట్టి
అనితరాభ్యాసమ్ము నర్థిఁ దక్కఁగఁ బట్టి
నీలకంఠాఖ్యాత నిఖిలావనమువలన
బాలచందిరమౌళి పరిపాలనమువలన 164

### ఉత్కళిక

నచ్చి భక్తుల బ్రోచు
మెచ్చి సక్తుల గాచు
యోగిభాషల నుండు
భోగిభూషల నిండు
త్యాగలీలల మెచ్చు
యోగలక్ష్ములఁ ద్రచ్చు
కందర్పహరువలన
సుందరేశ్వరువలన. 165

### షష్ఠి

క. కవితావనితా మానస
నవ పంచశర స్వరూపునకు గిరికన్యా
ధవునకుఁ బంచారామ
స్తవనీయాకృతికి భక్త సంపత్కృతికిన్. 166

### కళిక

వెండి పంచాక్షరీవిదిత పంచారామ
విహరణోత్కంఠాభివృద్ధ మతిశాలికిని
తాండవోత్సాహవర్ధన మార్దళిక విష్ణు
తత పాణిలాఘవోదారగుణ శీలికిని
యుగయుగ శ్రితరక్షణోత్థ నరనారాయ
ణోగ్రతర గురు తపో యోగ ఫలదాసికిని

యుగపత్కృతోదయ ద్యుమణిచంద్ర త్కుండ
లోద్దామ గండపా ళ్యుదిత రుచి ధానికిని
శాంకరీ కరతాళ చటులదృష్టిక్రియా
సంపన్న బహునాట్య చారుతా ౽స్థానికిని
సంకుచ ద్వ్యక్షిప చ్చ్రాక్రమ ద్భ్రంభమత్
చటు చారు నృత్తదర్శక రాజధానికిని
నృత్య త్కుమారాశ్వ రేఖా౽నుసరణ ని
ర్ణిద్ర శేషా౽శేష మృదుఫణా ధామునకు
భృత్య ప్రపంచ సంభృత భక్తిభావనా
భిక్షార్థ భవ్యా దిభిక్షుతా ధామునకు. 167

ఉత్కళిక

కరుణార్ఘురీరూప గంగాతరంగ మయి
వరసతీచరిత భాస్వర నిజాపాంగ మయి
దారార్థ పునరనూర్థారి తానంగ మయి
దూరీకృతా నేకదురితా౽నుషంగ మయి
నారీనర మహా౽భినయ నా౽ర్థరూప మవు
పూరసుర సంహార భూదారరోప మవు
వర చలడ్డమరుక ధ్వానిభూత విద్యునకు
నరయ నెవ్వరికంటె నాఢ్యుఁ డగునాద్యునకు. 168

సప్తమి

క. శ్రీరమ్య పంచభూతో
దార మహాలింగరూప దర్పణ రుచిర
స్ఫార పరబ్రహ్మమ్మన
గౌరీ హృదయారవింద కలహంసమునన్. 169

కలిక

మఱి విద్విషచ్ఛమూన్మథనోగ్ర శూలాగ్ర
మహనీయసంపదలు మరులుగొను చందమున
మఱిమాఱ్రికిక్రేఁజాయ మఱఁగి బెబ్బులితోలు
మకువుసింగారము ల్మదిమెచ్చు నందమున
పగలురే యొకయెడల బలసి కొలు వగువింత
పగిది మగనాల్మగల బలువన్నెతోయమున
నిగమాంతసంచార నిరత పాదద్వయీ
నిగనిగల్ ధగధగల్ నిలువైన తీరమున
నెమ్మదులసోయగము నిలువుదోపులు గొన్న
నెఱజాణతనములను నెఱయు తొలికవయందు
సమ్మోదపూర దుశ్శక నిజోత్సవ దిదృ
క్షుమ్ములగుకందోవలఁ గయికొనెడి తొవవిందు
నం కుకూల జ్జటానవ్యబంధ ద్వయ
స్నప శరీరప్రభాఽ నవసుధాధామమున

అందువులు నంధువులు నన్ను పుట్టువులఁ జిక్కు-
లందు జనబృందముల నలరించుధామమున. 170

ఉత్కళిక

కమనీయ రమణీయ గమనీయ తేజమున
నాడించు క్రీడించు నలరించునోజమున
మూర్తు లెన్మిదిఁదాల్చి ముగురైన రూప మవు
ధూర్తు లంటఁగరాని దుర్వారదీప మవు
మహిత నిజసౌందర్య మధితహారిమతి రీతి
నహిరాజవలయ దివ్య జ్జటాభృతిభాతి
వేద వేదాంతార్థ విశ్రాంత వస్తువున
కవిలోక కావ్యార్థ గంభీరవస్తువున. 171

సంబోధన

క. శ్రీపంపాహృదయాంతర
రూపా చిద్రూప శ్రీవిరూపాక్ష కృపా
వ్యాపారాంబుధిజాత
శ్రీపత్యవతార సుకృతసిద్ధి విశేషా. 172

కళిక

మఱియు శ్రీగిరిమల్లికార్జున
మహితరూపము నవధరించిన
మధురమధు సంపదల నెగడిన
మమ్ము గాంచిన దివ్య తేజమ

ఎఱింగి నినుభజియించుభక్తుల
యెల్లకోర్కు లనుగ్రహించుచు
నెలమిఁ బ్రోచెడి యెనుఁగుగదుకని
యింటిముంగలి కల్పభూజము
భక్తినొసఁగినఁ బాలు విష మొక
వలెనె కైకొని పరమరక్తిని
వరము లొసఁగెడి పరమకరుణా
భరణ విషధర! బాలశశధర!
భక్తి మెచ్చినపగిదిఁ బలుకుల
పటిమ మెచ్చునిప్రభుడ వయ్యును
పరమసక్తిని కృతుల గైకొను
ప్రకటవత్సలతా ధురంధర
పంచముఖముల బయలు వెడలుచు
బయలునిండిన పండు వెన్నెల
పగిది నగియెడి నగవుతరఁగల
వఱలుజీవుల పాలిప్రాణము
పంచకేంద్రియపంచకము పెను
బారిబడి కడు బడిసి సుడిసిన
పఱపులకు వెఱచఱచి ప్రిదిలిన
ప్రాణిలోకముపాలి త్రాణము
అరుణకరు లయి అమృతకరు లయి
యమరపతులయి యసురపతు లయి

హరిపితామహు లబ్ధితరగలు
నయినచూపుల నలరుపద్భవము
హరిణగతి చతురాత్మవృత్తుల
నంఘ్రిసేవకు లయినవారల
నలరు వృషగతి నధిగమించుచు
నభయమిడి చేనందు విభవము 173

ఉత్కళిక

శ్రీ గిరీశ్వరుశృంగమున నివ
సించి భక్తులు కనినమాత్రకు
యోగిదుర్లభ మయినతన పద
మొసఁగి వారలు నలుపుయాత్రకు
తెలియఁగా బ్రతిపదము ఫలము
ప్రతిధ్వనించెడి వృషభగమనము
తెలుపు కటకకృష్ణవేణీ
దివ్యవీచీ గమనకమనము
లలిత నిజపదలక్ష్య బహుముఖ
లాసితాశ్రిత మధురకవనము
కలిత యాత్రికగళ వినిర్గత
గానలీలా లాసభవనము
నధివసించి జగమ్ము లేలెడి
యద్రిజా హృదయాంతరంగము

మధుర నిజపద మధురస ప్రియ
మాన్యజన చిత్తాబ్జభృంగమ 174

## సార్వ విభ క్తికము

నీవే మూలము నిన్నె పల్కెడి శ్రుతుల్ నీచేతఁ బ్రోపంద నీ
కైవాల్యభ్యమునొంద, నీకునతి, నీకంటెం బరుం గొల్వ నీ
కేవారల్ సరి సర్వభావముల నాయీబుద్ధి నీయందుగా
దేవా యెవ్వఁడ సర్పణంబిడఁగ నీదే నీవు పాలింపవే. 175

## అనుగ్రహము

క. అని మ్రొక్కిన యయ్యుత్తమ
జనపతిని గళత్రపుత్రసహితుని దీవిం
చెను శంకరుఁ డనుకంపా
వినిమయ భాషణము శ్రవణపేయము గాఁగన్. 176

క. ఓ యుత్తమదంపతులా
రా యుత్తమపుత్రుకలిమి నైతిరి ధన్యుల్
మీయుభయు లితఁడు మనునై
యీయఖిలమ్ముత్తమముగ నేలుఁ జిరముగన్. 177

క. మీయభిలషిత మ్మిచ్చెద
హాయిగఁ జిర ముండి వాంఛితాధికసిద్ధిన్
మీయెల్లరు తుదకును మ
త్సాయుజ్యము నందుఁ డనుచు శంకరుఁ డంతన్. 178

క. అంతర్హితుఁ డయ్యె నృప
స్వాంతము వెలుఁగొందఁగాఁ బ్రజామతి భూయ
స్సంతర్పణముఁగ నుత్తము
సంతతపాలనము విభవసంభృత మయ్యెన్, 179

శ్రీమధురధామములు శిష్టజన పూర్ణచిర
కామములు శ్రీగిరికుమారీ
ప్రేమరసపూర సవవిభ్రమ విహారరుచి
రాకృతులు విశ్వహిత కావ్య
వ్యోమమణు లుత్తమమనూదయ గభస్తులు శ్రి
తావన దయోదధి విరూపా
క్షామలకటాక్షము లహర్నిశము ప్రోఁచు జగ
మాదృతిని మంగళమహశ్రీ. 180

క. శ్రీనాథాది కవీశ్వర
ధీనాథా కృష్ణరాయదేవేంద్ర మన
శ్శ్రీనాథ నిగమసార
శ్రీనాథ శ్రితావనప్రసిద్ధకటాక్షా. 181

అహార్యకులనందినీ హృదయహారి హంసాకృతీ
విహారమణిమందిర న్నిఖిల వేదవిద్యాకృతీ
మహర్షి మతికందరా ధ్వనిత మాన్యమంత్రాకృతీ
అహేతుక కృపాత్త మత్కృతి గుణాఢ్యహారాకృతీ. 182

మహిత షడక్షరీమను సమంచితభావ మదీయకావ్య స
త్కృహార సదావిహార రసగుంభితచిత్త మదీయ చిత్తస
న్నిహిత హితాత్మపుత్రి కమనీయ షడాస్య మధుస్రవ ద్వచ
స్సహజగుణ పరిబంధరస సంగత దివ్య కృపావశంగతా. 183

క. శ్రీకనకరత్నమాహ్వాద
యాకాశమృగాంకశరభయారాధ్యమనో
జ్జ్వాకరపతంగ కవనర
మాకల్పాకల్పచంద్రమౌళీశ శివా 184

క. అభినవశాకుంతల దీ
పి భవ్యగాధానుజనన ఫలితగుణాళీ
విభవోత్తమమను సంభవ
విభాసి షష్ఠాననమ్ము వెలయు శివుకృపన్. 185

శివమ్

జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు-2.